సంవత్సర చందా
రు. 12-0-0
విడిపత్రిక 4 అ.



సంపుటము 47
సంచిక 19
13-1-54

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

విజయ పుష్య శుద్ధ నవమి బుధవారం

# ఈ వారం రచయితలు

ముఖచిత్రం: "సస్యలక్ష్మి" చిత్రకారుడు: రాగి వెంకటేశ్వరరావు.



## అవును, ఈ ప్రణాళిక నా కొరకే!

వేలాది గ్రామములలో విద్యుద్దీపములు నెలకొల్పబడును. చేనేత మగ్గాలు, లేతులు, ఝుంకారముతో పనిచేయ నారంభించును. ప్రతి చిన్న శిల్పి సంఘముపై గ్రామ పరిశ్రమాభివృద్ధి ఆధారపడియుండును. ప్రతియొక్కనికి ఉపాధి లభించును మన శక్తి సంపదల నభివృద్ధిచేసి యినుమడింపచేయుటకై పంచవర్ష ప్రణాళికలో 127 కోట్ల రూపాయలు కేటాయించబడినవి వివిధోపయోగకరములగు హైడ్రో ఎలక్ట్రిక్ స్కీములద్వారా పరిశ్రమలకు చౌకగా విద్యుచ్ఛక్తి లభించగలదు. ప్రపంచములోని ప్రముఖ రాజ్యములలో నొకటిగా పరిగణింపబడుటయే మన దేశపు ధృఢ సంకల్పమనుట కిదే తార్కాణము.

ఎన్నో వేల టన్నుల ఉక్కు ఈ ప్రణాళికనందలి వివిధ కార్యక్రమములను అమలుపరచుట కవసరము. ఇటులనే పలువిధములుగా ఉక్కు మనదేశము, ప్రజల భావిసౌభాగ్యత, ఐశ్వర్యములకు పునాది వేయుచున్నది.

**ది టాటా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ లిమిటెడ్**

TN 2033




# సంక్రాంతి

బాలాంత్రపు
రజనీ కాంతరావు

వచ్చెను సంక్రాంతి!
ఇచ్చె శుభము శాంతి!!
కుచ్చుల స్వప్నాలూరే
వెచ్చని కంబళ్లూ,
మంచు తెరల చీల్చే చలి
మంటల సందళ్లూ!!
వెన్నెల కడిగిన దారుల
వెలసిన ముగ్గుల్లూ
ముగ్గుల ముసిముసి నగవుల
సిగ్గుల మొగ్గల్లూ!!
ఆవిరు లెగసే నోళుల
అందపు పాటల్లూ
అందెల గాజుల రవళుల
ఆడే గొబ్బిళ్ళూ!!
పూవులు కుంకం పసుపూ
పూజల నాగళ్ళూ,
పొలతుల నోముల కలకల
పులకం పొంగళ్ళూ!!
పిల్లల తలలను రాలే
అల్లో నేరేళ్లూ,
పెద్దల దీవన కోర్కుల
పెరిగే చూరేళ్ళూ!!
అలకల మాపుల ఓపిక
కొలిచే అల్లుళ్ళూ.
రంగుల బొమ్మల కొలువుల
పొంగే కూతుళ్ళూ!!

గాదెల గడపల ధాన్యం
కదిలే వాకిళ్ళూ,
అందరి పనులకు, జనులకు
ఆటవిడుపు వీళ్ళూ!!

వచ్చెను సంక్రాంతి
ఇచ్చెను విశ్రాంతి
నిగిడిన రెక్కల కండలు
తెగు పందెపు కోళ్ళూ,
కొమ్ముల సందుల రోషం
కొనరే పొట్టేళ్ళూ!!
వచ్చెను సంక్రాంతి!
హెచ్చెను విశ్రాంతి!!
మకరము చేరిన సూర్యుడు
సుకమిచ్చు పగళ్ళూ,
సకియలు దూరమైనతే
శకాలు రాత్రిళ్ళూ!!
వచ్చెను సంక్రాంతి!
ఇచ్చె శుభము శాంతి!!





సస్యలక్ష్మి
జి. విరన్న
(విజయవాడ)

# సంక్రాంతి ఆచారాలు

భారతీయుల దేవతలు చాలామంది ప్రకృతినుంచి మూర్తీభవించారు. వారి ఉత్సవాలకూ ప్రకృతికీ సన్నిహితమైన సంబంధం గోచరిస్తున్నది. పరిశీలిస్తే వారి ప్రతి ఆచారంలోనూ ఒక ప్రకృతి రహస్యం ఏదో తొంగిచూస్తూ ఉండటం మనం గమనిస్తాము.

మన పండుగల్లో 'సంక్రాంతి' ఉత్తమోత్తమమైన వాటిలో ఒకటి. ఇదీ ప్రకృతికి సంబంధించింది. ఇది జ్యోతిర్లోకంలో జరిగే ఒక సన్నివేశాన్ని నిరూపిస్తున్నది. సూర్యభగవానుడు సంక్రాంతి (ఉత్తమమైన వెలుగు) నాటినుంచీ ద్వాదశరాసుల్లోని మకరంలో ప్రవేశించి ఉత్తర ముఖంగా తన దివ్యయాత్రను మరల ఆరు నెలలకాలం కొనసాగిస్తాడు. ఈ కారణం చేతనే సంక్రాంతిని కొందరు 'మకర సంక్రాంతి' అని వ్యవహరిస్తారు.

కొందరు 'సంక్రాంతి'ని అజసంక్రాంతి అనటంకూడా కద్దు. ఒక మేకచేత పులిని చంపించటం ఇంద్రుడు చేసే ఘన కార్యాలల్లో ఒకటిగా ఋగ్వేదంలో ఒక సూక్తం కనిపిస్తున్నది [VIII—, 1817]. నేటి భారతీయ జ్యోతిషశాస్త్రవేత్తలు ఈ సూక్తం ఒకానొక జ్యోతిషాంశాన్ని వెల్లడి చేస్తున్నదనీ, అది సింహారాశి అస్తమిస్తేగాని అజరాశి ఉదయించకపోవటమనీ అభిప్రాయమిస్తున్నారు. ఈ అజమే మకరరాశి. సూర్యుని రథాన్ని అజం వహిస్తున్నట్లు ఋగ్వేదంలో వర్ణనలున్నవి. దీనిని బట్టి అజసంక్రాంతి అన్నా, మకర సంక్రాంతి అన్నా అభిప్రాయం ఒకటే అని వ్యక్తమౌతున్నది.

సర్వసామాన్యంగా సంక్రాంతి జనవరి నెలలో 14 వ తారీఖు ప్రాంతంలో వస్తూ ఉంటుంది. ఆనాటికి పంటలు పండటం పూర్తి ఔతుంది. కోతలు అయిపోయి రైతులు ధాన్యాన్ని ఇంటికి చేర్చుకొని శాంతిసౌఖ్యాలను అనుభవిస్తూ ఉంటారు. అందుచేత దీనిని ఒకవిధంగా మనం పాశ్చాత్య దేశాల్లోని కోతలపండుగలో పోల్చవచ్చును. కాని ఇది కేవలం కోతల పండుగ మాత్రమనుకోటం పొరపాటు. ఇది ప్రధానంగా సూర్యుని ప్రయాణాన్ని తెలిపే టందుకు ఏర్పడ్డ ఉత్సవదినం.

భారతీయ జ్యోతిషశాస్త్రజ్ఞులు ద్వాదశ రాసులతో కూడిన సూర్యునిమార్గాన్ని ఉత్తరాయణమూ, దక్షిణాయనమూ అని రెండుగా ఋగ్వేదకాలంనాడే విభజించారు. సంక్రాంతిలో ఉత్తరాయణము ప్రారంభమౌతుంది. అయన శబ్దానికి మార్గమని అర్థం. 'రషాభ్యాం నోణస్సమానపదే' అనే పాణినీయసూత్రం వల్ల అది 'అయణము' ఔతుంది. భారతీయులకు ఉత్తరము దేవతల దిక్కు. దక్షిణము యముని దిక్కు. ఉత్తరయానము దేవయానము; దక్షిణయానము పితృయానము. మకరంనుంచి కర్కాటకంవరకూగల సూర్యుని ప్రయాణకాలాన్ని భారతీయులు ఉత్తరాయణ పుణ్యకాలంగా భావిస్తారు. వారి సమస్త శుభకార్యాలకూ ఉత్తరాయణం ఉత్తమమైన కాలం. ఈ ఉత్తరాయణ పుణ్యకాలాన్ని నిరీక్షిస్తూ భీష్ముడు అంపశయ్యపై శయనించటం పురాణప్రసిద్ధమైన అంశం; అందరికీ తెలిసిందే.

వావిలాల సోమయాజులు

ఆంధ్రులు సంక్రాంతిపండుగను మూడు దినాలు—భోగి, సంక్రాంతి, కనుమ—జరుపుకుంటారు. 'భోగి' అనే శబ్దం సమృద్ధిని, ఆనందానుభవాన్ని వెల్లడిచేస్తున్నది. ధాన్య సమృద్ధి కలగటంవల్ల సంక్రాంతి నాటినుంచీ అంతా భోగమే. భోగినాటికి పూర్వ కాలమంతా రాక్షసకాలం. అది భోగినాటితో అంతమౌతుంది. భోగి నాడు తెలవారకముందే నిద్రలేచి అంతా 'భోగిమంటలు' వేసుకొని తలంటి పోసుకుంటారు. 'భోగిమంటలు' తూర్పుగోదావరి జిల్లాలో చూస్తుంటే గ్రామసీమల్లోని సమష్టి జీవితవిధానం ఇటువంటి పండుగల మూలంగా ఎలా కట్టుబడిఉందో, ఉండగలదో మనకు అర్థమౌతుంది. భోగినాటి సాయంత్రం ప్రతి ఇంట్లోనూ పిల్లలచేత బొమ్మలు పెట్టించి, పిలలకు బొమ్మలు చేయటం నేర్పుతూ అందులో వారు చూపించే కౌశలానికి ముగ్ధులైపోతుంటారు తల్లిదండ్రులు. ఈ బొమ్మలపండుగ ప్రధానంగా శిల్పకళతో బాలబాలికలకు పరిచయం కలిగించటానికి అతి ప్రాచీనకాలంలోనే భారతదేశంలో ఏర్పాటు చేయబడింది.

భోగినాడే ఆంధ్రవనితా లోకం 'గవిరమ్మ' ను పెట్టి ముత్తైదువులను పిలుచుకొని పేరంటాలు చేసుకుంటూ, చందన తాంబూలాది సత్కారాలతో ఒకరినొకరు సంతోషపెట్టుకుంటూ ఆనందిస్తారు. గౌరమ్మపూజ ఇలా మూడునాళ్లూ జరిగించి కనుమనాడు సాయంకాలం నదులుంటే నదుల్లోనూ, లేకపోతే గ్రామాలల్లోని వాపీకూపాదుల్లోనూ ఆమెను ఓలలాడిస్తారు.

నిజానికి 'గవిరమ్మ పూజ' ఆశ్వయుజ మాసంలో జరగవలసింది. ఆమె కృషికి అధిదేవత. గౌరమ్మ పూజ అంటే ఒక విధంగా చంద్ర పూజ అని చెప్పవచ్చు. చంద్రుడు ఓషధీశుడు. ఆయన దయవల్ల పంటలు బాగా పండినందుకు ఆయనకు తమ కృతజ్ఞతను చూపిస్తూ కార్తీక పౌర్ణమినాడు ఉపవాసం ఉండి 'చంద్ర పూజ' చేయటం ఆర్య సంప్రదాయము.

కర్షకులు గౌరమ్మపూజను అతి వైభవంగా జరుపుకుంటారు. భోగినాడు రాత్రి ఒక రవికగుడ్డ తాంబూలం దక్షిణలతో కమ్మరి ఇంటికి వెళ్ళి అతడు అంతకుపూర్వం చేసిఉంచిన 'సంక్రమయ్య' విగ్రహాన్ని తెచ్చికొని మూడు నాళ్లూ గౌరమ్మతోబాటు ఒకచోట చేరి పూజించి గ్రామస్థులంతా చివరకు ఆమెతో సంక్రమయ్యనుకూడా ఓలలాడిస్తారు. భోగి నాటి సాయంకాలం పసిబిడ్డలకు పళ్ళుపోసి ముత్తైదువులకు వాళ్ళచేత తాంబూలా లిప్పించి వారి దీవనలను ఇప్పించడం ఆంధ్రదేశంలో ఆచారం. ఆంధ్రదేశంలో నూతన వధువులు కనుమపండుగతో ప్రారంభించి తొమ్మిది దినాలు సావిత్రీ-గౌరీ నోములు పడతారు. వారు స్వయంగా అమ్మవారికి నవవిధ నైవేద్యాలు సిద్ధం చేస్తారు. తరువాత అత్తవారింట అవసరమైన పాకశాస్త్రపరిచయాన్ని అలవరుచుకోటానికీ, భవిష్యత్తులో జీవిత విధానాన్ని తీర్చిదిద్దుకోడానికి ఈ వ్రతంలోని కొన్ని నియమాలు కల్పితాలైనట్లు విస్పష్టంగా మనకు తోస్తుంది.

సంక్రాంతి పితృదినంగా ఛాందసులు భావిస్తారు. ఆనాడు స్వర్గ ద్వారాలు విడి వడతవి. ఇది పర్వదినం. సముద్రతీరాల్లో నదీ ముఖాలలో వారు గుంపులు చేరి స్నానము, సంధ్యాద్యనుష్ఠానాలను తీర్చుకుంటారు. పితృదేవతలకు పుణ్యలోక ప్రాప్తి కోసం తిల తర్పణాలు విడుస్తారు. గోదాన సువర్ణ దానాలు చేస్తారు. ఎంత పేద బ్రాహ్మణుడైనా తప్పక ఒక కూష్మాండా

న్నైనా (గుమ్మడికాయ) దానం చేస్తాడు. క్రొత్త మంత్రాలు చెప్పకోడానికీ, పునశ్చరణ చేసుకోటానికీ సంక్రాంతి సమయం ఉత్తమమైంది. ప్రకృతి సంబంధంగా ఆ సమయంలో అనంత వైశిష్ట్యమున్నది. ఆ నాడు నదీతీరాల్లోను, సముద్రతీరాలలోనూ మంత్రశాస్త్రజ్ఞులు ప్రియశిష్యులకు గుహ్య మంత్రోపదేశం చేస్తుంటారు.

ఆంధ్రదేశంలో ధనుర్మాసారంభంనుంచీ ఇళ్ళముందు పెట్టుకునే గొబ్బెమ్మలు సంక్రాంతి పండుగ మూడు దినాలు కూడా పెడతారు. ఆ సందర్భంలో కన్యకలు బృందాలుగా చేరి పాడే 'గొబ్బి పాటలు' మన జాతీయ సాహిత్యంలో అంతర్భాగాలుగా నిలువ తగ్గవనటంలో అతిశయోక్తి ఏమాత్రమూ లేదు.

భారతదేశంలో సంక్రాంతి పండుగను ఆంధ్రులతో బాటు విశేషంగా గౌరవించే వారు తమిళులు. అరవలు సంక్రాంతిని 'పొన్‌గళ్' అంటారు. ఇది మొదటి సంక్రాంతి పండుగకు వారు పెట్టుకున్న పేరు 'పొన్' అనే ద్రావిడ శబ్దానికి బంగారము అని అర్థము అనగా సూర్యుని బంగారు కాంతులుగల పండుగ అని మొదటి అర్థము. కాని ఇది తరువాత తమిళులు సంక్రాంతి పండుగకు చేసుకునే ఒకానొక భోజ్య పదార్థానికి నామమైంది. ఇది వారికి ప్రధానంగా సూర్యోపాసన. సూర్యుడు బంగారు కాంతులు కలవాడు. 'హిరణ్మయేన సవితారథేన' ఇత్యాది వేద మంత్రాలు సూర్యుని హిరణ్మయత్వాన్ని పేర్కొంటున్నవి. 'తై' నెలలో రావటం వల్ల తమిళులు సంక్రాంతిని 'తై పొంగల్' అని కూడా అంటారు.

తమిళదేశంలో ఆచారపరులైన హిందువులు సుప్రసిద్ధ దేవాలయాల్లోనూ నదీ తీరాల్లోనూ సంక్రాంతి పండుగకు గుంపులు చేరుతారు తిన్నవల్లి జిల్లాలోని తామ్రపర్ణీ నదీ స్నానం చేయటానికి వీరు వచ్చే సందర్భంలోని దృశ్యాలు చూడ ముచ్చటగా ఉంటవి. సముద్ర ప్రాంత గ్రామాల్లో నివాసం చేసేవారు సముద్రతీరాలకే సంక్రాంతి స్నానానికి వెళ్తారు. ఆనాడు నదీ జలాలకు ప్రత్యేకశక్తి ఉంటుందని, అట్టి సమయంలో పుణ్యనదుల్లోనూ, సాగరాలల్లో స్నానమాడితే దివ్యత్వం తమకు కూడా కొంత కలుగుతుందని వారి నమ్మకం.

పూజా గృహాల్లో తమిళులు చక్రాకృతిగా సూర్యుని సంజ్ఞను చిత్రించి, ఆయనను విష్ణుస్వరూపునిగా ధ్యానిస్తారు. క్రొత్తపంటకు ఆయన వలుసురు, ఆయన వల కలిగే మేఘాలూ, ఆయన వెలుగును గ్రహించి వెన్నెలగా ప్రసాదించే చంద్రుడు కారణాలు కనుక వారు క్రొత్త పంటలోనుంచి పొంగలిని వండి నైవేద్యమిస్తారు. క్రొత్త వరికంకుల గుత్తులతో తోరణాలు గుచ్చి ఇళ్లను అలంకరిస్తారు. క్రొత్తగుడ్డలో క్రొత్త వరిధాన్యంతో వండిన అన్నాన్ని మూటగట్టి ప్రత్యేకంగా ఒక స్తంభానికి పక్షిలోకం కోసం వ్రేలాడదీస్తారు. ఈ ఆచారాలన్నీ తమ సమృద్ధినీ, సంపదను, సౌఖ్యాన్నీ వెల్లడి చేయటానికి ఉద్దేశించినట్లు సాంఘిక శాస్త్రవేత్తల అభిప్రాయము.

సంక్రాంతి మరునాటి దినాన్ని ఆంధ్రులు కనుము అంటారు. యావద్భారతంలోనూ ఈనాడు గోపూజ జరుగుతుంది. గో శబ్దానికి కిరణమని అర్థము. సంక్రాంతి సూర్యునకు సంబంధించిన పండుగ కావటం చేత గో శబ్దార్థంతో అభివ్యక్తమాతున్న గోవును సంక్రాంతి సందర్భంలో పూజించటం సమంజసం. పూర్వం ఈ సందర్భంలో ఇంద్రపూజ జరిగేదట. కృష్ణుడు 'ఇంద్రోత్సవాలను' ఆపించి గోపూజను ఆరంభించినట్లు, ఇంద్రుడికి కోపం వచ్చి బృందావనంలో కుంభవృష్టి కురిపిస్తే కృష్ణుడు గోవర్ధనాన్ని ఎత్తి గోవులనూ, గోపాలురనూ రక్షించిన గాథ భారతీయులకు సుపరిచితమైనదే.

కనుము పండుగను తమిళులు 'మాట్టు

## వారపత్రికకు సెలవు

సంక్రాంతి పండుగ కారణంగా ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక 20-1-1954 తేదీ గల సంచిక వెలువడదని పాఠకులు గుర్తించ ప్రార్థన. సంక్రాంతి సంచిక అనంతరం 27-1-1954 తేదీ సంచిక యథాప్రకారం ప్రచురించబడుతుంది.

స్థలాభావంవల్ల ప్రస్తుత సంచికలో పంచతంత్రం, కాలక్షేపం, ఘంటారావం, విజ్ఞాన వీధులు, బొమ్మరిల్లు శీర్షికలు ప్రచురించబడడం లేదు

—సంపాదకుడు.



రంగవల్లిక — జానకి, (విజయవాడ).

# పంటసిరి-పాటలు  నార్ల చిరంజీవి

బసవన్నల నదిలిస్తూ
ఉసికొలిపీ పసదులిపే
— ఓ వరాలమావా!
సందిట పస పందెం రాలేనా..ని...
మెట్టచేలో పండు మిరప
బుట్టలతో కలబోసే
— ఓ కొత్త కోడలా!
బుట్టకాపురమ్ము తట్టకెత్తేవా?
గట్లమీద జనపపూలు
గట్లకింద మినపచేలు
— ఓ పంటలతల్లీ!
సంకురేత్రి సంబరాలు వొచ్చేనూ...
జొన్నచేని మంచెమీద
జోరుగ పిట్టల తోలే
— ఓ వయారి వదినా!

తెచ్చినకూడూ పిట్టలుతినిపోయే...
నువు...
వంకసన్న వడ్లరాసి
వలివలియో పొలితిరిగే
— ఓ ముద్దుల మరిదీ!
జొన్నకూడు సరిపడదూ..నీకూ
సన్నన్నం వండితెచ్చి పెడుదునోయ్
మున్నూటరవై రోజులు
నిన్నునమ్మి కొలిచామే
— ఓ అమ్మ భూదేవీ!
పరమాన్నంవండి నీకు పెడతామె...
ముంతంత కొప్పుజుట్టి
చేమంతిపూలు బెట్టి
నొసట సిరిచుక్కదిద్ది
కళ్ల కాటుకలు రుద్ది

ముకుపుడక రాతి ఎరుపు
బుగ్గపై అగ్గి మెరుపు
కదిలితే పిడుగురెమ్మ
నిలుచుంటే పసిడిబొమ్మ
పంటసిరి తల్లి పయనమై మరలిందీ!
నడివీధి భోగిమంట
నట్టింట పసిడిపంట
తాతయ్య ముచ్చటలూ
పసిపాప చిరునవ్వులు
రంగవల్లికల నడుమ
గొబ్బెమ్మ పబ్బాలూ
ఇంటింట నూరుపాళ్లు
ఎనలేని మంచితిళ్లు
తెలుగుజాతికిది తొలిసంక్రాంతి
తెలుగు నేలకిక సుప్రశాంతి

# ★ సంక్రాంతి ఆచారాలు ★

పొంగల్' అంటారు దీనికి పశువులపండుగ అని అర్థం. ఈసందర్భంలో పంట ఇంటికి చేరినతరువాత అటువంటి ధాన్యసమృద్ధి అసలు కలగటానికి కారణమైన పశువులను పూజించి కృషీవలులు తమ కృతజ్ఞత వెల్లడించుకోటం సమంజసం. పశువులకు స్నానం చేయించి పసుపు కుంకుమలతో అలంకరించి వారివారి శక్తి ననుసరించి ఇతరములైన ఘంటికాదులైన అలంకారాలు చేసి, హారతులిచ్చి పాటలు పాడుతారు. నృత్యోత్సవాలు చేస్తారు. తాము పెట్టే నైవేద్యాలు అనుభవిస్తూ సంతసంతోబాటు సంతోషాన్ని వెలిబుచ్చుతూ ఉన్న పశులోకాన్ని చూచి ఆనందాబ్ధిలో ఓలలాడుతారు. ఈ సందర్భంలో తెలుగుదేశంలో పాడే పాటలు — ముఖ్యంగా నందిపాటలు, ఉత్తమ సాహిత్యగుణాలతో ఒప్పి జాతీయతా స్ఫోరకాలై యున్నవి 'వీధి కోనల వెంట విడువరమ్మ మా నందినీ, శివ నందినీ' అన్న పాటను గ్రామస్త్రీలు బారులు తీర్చి గోవులముందు నిల్చి మహా సంతోషాంసులెత్తి పాడుతుంటే ఎటు వారికైనా ఒడలు పులకరిస్తుంది.

సంక్రాంతి కనుమ పండుగనాడు తమిళ దేశంలో 'కోడె - పందాలు' వేస్తారు. ఈ సందర్భంలో వారు ప్రయోగించే వాద్యాల ధ్వనికి ఒడలు పొంగెత్తుతుంది. 'మాట్టు పొంగలి' నాటి 'జల్లికట్టు' అనే ఆచారం బలశాలుల శక్తిని పరీక్షించటానికి ఉద్దేశించినది. మదించిన కోడె కొమ్ముకు ధనపు సంచి కట్టి దానిని వశపరచుకున్న వారికి ఆ ధనం బహుమానంగా ఇస్తారు. అనేకమంది మల్లులు ఆ మదించిన పశువులతో పోరాడి లొంగదీసి ఆబహుమానాన్ని పుచ్చుకుని మిత్రుల్లో, బంధువుల్లో బలశాలులని కీర్తిగడిస్తారు.

పొంగలి పండుగ మూడవనాడు తమిళ దేశంలో కన్యకలు 'కన్నెపాటలు' పాడుతారు. ఇవి అత్యుత్తమమైన జానపద సాహిత్యము. కన్యలు ఉదయమే లేచి మామిడి తోపులకు వెళ్ళి అక్కడవున్న ఏడు కన్నె శిలలకు పూజచేస్తారు. తరువాత చక్రాకృతిగా చేరి చేతులతో తాళం వేస్తూ, ఒక రీతి చిందుతో నాట్యంచేస్తూ కొన్ని పాటలు పాడుతారు. వీటికి 'కుమ్మితట్టర పాట్టు' అని పేరు...వంగి చప్పట్లుచరుచు పాటలని వీటికి అర్థము. పైన పేర్కొన్న ఏడు కన్నె శిలలు శక్తిదేవత రూపాంతరాలు. సప్తమాతృకలవంటివారు

సంక్రాంతి పండుగల్లో దక్షిణ భారతంలో కనిపించే ఆచారాల్లో కొన్ని ఆర్య సంప్రదాయాలు. కొన్ని ద్రావిడ సంప్రదాయాలు. కాని ఉభయ సంప్రదాయాల్లోనూ ముఖ్యోద్దేశ్యం సూర్యోపాసన; సూర్య సంబంధమైన గో (కిరణ) పూజ. 'బ్రహ్మ స్వరూప ముదయే, మధ్యాహ్నేతు మహేశ్వరమ్, సాయం ధ్యాయేత్సదా విష్ణుం, త్రిమూర్తిశ్చ దివాకరః' — ఇత్యాది ధ్యాన శ్లోకాలనుబట్టి భారతీయులు సూర్యుని మహా విష్ణుస్వరూపునిగా భావించి పూజిస్తున్నట్లు వ్యక్తమౌతున్నది. ఆయన, మార్గాన్ని సర్వరూపాన్ని ధరించి నిత్యం అడ్డగించే మందేహరాక్షసులను పారద్రోలటానికి సంధ్యావందన సమయంలో మంత్రజలాలను బ్రాహ్మణలోకం ప్రతినిత్యమూ అర్పిస్తున్నది.

["ఉద్యన్తమస్తం యన్త మాదిత్య మభిధ్యాయన్ కుర్వన్ బ్రాహ్మణో విద్వాన్ సకలం భద్రమశ్నుతే" — ఉదయాస్తమయాలతో స్వయంప్రకాశంగల సూర్యుని ధ్యానంచేస్తూ ప్రదక్షిణంచేస్తూ ఈసూర్యునే పరమాత్మునిగా ఎరిగిన జ్ఞాని సకల శుభాలనూ పొందుతాడు—శ్రుతి.] ★

# సంక్రాంతి సుందరి

## ఉత్పల సత్యనారాయణాచార్య

అంతరమందు పుష్యరథ
మాపిచివాలున భూమిపైని కా
లెంతయుమోపి - మేలిముసు
గించుక నెత్తి కపోలపాళికా
కాంతులు ప్రస్ఫుటింపగ - ము
ఖమ్మున నవ్వు నటింప వచ్చె, సం
క్రాంతికుమారి చేతుల నొ
కానొక పూలసరమ్ము తోడుతన్.

నాదృగ్వీథుల నందనోప వనిలో
నన్ దాగి ప్రాభాత వే
ళాదివ్యోత్సవ సంప్రఫుల్లిత తుషా
రస్నిగ్ధ పుష్పాల నీ
పాదాబ్జస్ఫురితాంక రక్తిమ రహిం
పన్ రమ్ము - రారమ్ము నీ
వీదారింబడి నాకుటీరమునకే
ఏతెంచుమా కోమలీ!

గమకమ్ముల్ విదళించు గంధవహు తె
క్కల్ రెంటిపై కెక్కి పో
దము రారమ్ము - లతావితాన సుమనో
ద్వారమ్ము లావిష్కరిం
తము దేవీ! తడవేల మాయనిమిరా
నన్ వాసరార్థమ్ము వ్య
ర్థముగాఁ జొచ్చెడి నవ్యయౌవన వసం
తశ్రీల నోలాడగన్

మృదులసంచార మలయ సమీర మీవు
గంధకుసుమ కోమల పరాగమ్ము నేను
స్వర్ణ సంక్రాంతి సౌమనస్యములజల్లి
ఇండ్ల వాకిళ్ల వాసింత మిర్వురమును

స్వాగత మిత్తునీకు నవ
సస్య సమృద్ధుల మాగృహమ్ముకున్
రాగలవేని - బంతి పువు
లన్ ములుగోరింట పూలనల్లి పు
న్నాగ సరమ్మొసంగుదు - ఘు
నమ్మగు విందును జేతుఁజూడు మ
భ్యాగతివైనచో నవన
వాన్నము గుమ్మడికాయ కూరలన్

ధరణిదాగిన ఈ పురాతన దినమ్మ
ఈ యుషస్సున నవజన్మ మెత్తివచ్చె
ఎంత క్రొత్తందనమ్ము - ఎంతెంత గూర్చె
సర్వజనులకు సంక్రాంతి పర్వమయ్యె!
రంగు రంగు పూలు! రైతాంగపుంబూలు
పల్లెపిల్ల జడకు బంతిపూలు
స్నిగ్ధ పరిమళాలు! ముగ్ధసురభిళాలు
నడివయసు పడతికి నవరసాలు!

దురధిగమమ్ములయ్యెడిని
త్రోవలు చుక్కమెఱుంగు త్రోవలై
తరుణుల మోహవాగురల
తావులునై కడునల్లిబిల్లి జుం
జురు వలతీవలై మెరసి
చుక్కల ముగ్గులు పల్లెపల్లె గ్రి
క్కిరిసి సమైకతా విభవ
కీర్తులు చాటుచునున్న వెంతయున్

అదుగో! వచ్చినాడు హరిదాసుఁడచటికి
చిట్టితల్లిబుల్లి చేతులెత్తి
పెట్టుచుండె మురిసి బిచ్చమ్ము, సాతఁడు
వంగివంగి కయికొనంగ వలసె

గుమ్మడికాయ చెంబు తల
కున్ బిగియించియు ద్వాదశోర్ధ్వపుం
డ్రమ్ములుదిద్ది, పచ్చడము
నన్ నడికట్టు బిగించికట్టి హ
స్తమ్ముల ద్రిప్పికొంచు చిటి
తాళములన్ "హరిరంగహరి" గీ
తమ్ముల నాలపించు హరి
దాసుఁడు నేడు ప్రసన్నుఁడయ్యెడిన్.

# [illegible]

హాలకడలి కేయవరారా నే పిలువగానే" - సాతాని జియ్యరు చిరుచిరతల మేళవింపుతో తంబురా మీటుతూ తెల్లవారు జామున జాలిగా పాడుతూ ఉన్న ఆ పాట చాలమందిని మేలుకొలుపుతోంది. నాగభూషణంగారు లేచి ముఖప్రక్షాళనం చేసుకొని 'శ్రీరామ కవచమ్' పఠిస్తున్నారు. ధనుర్మాసం. దూరాన్ని విష్ణ్వాలయంలో జేగంటలు మ్రోగుతున్నాయి. తిరుప్పావై, ద్రావిడ వేదం పఠిస్తున్నారేమో - సమూహము చేత కంఠాలు తప్ప, ఆ చదివేది స్పష్టంగా ఏమీ వినిపించడం లేదు.

"అంబా పలుకు జగదంబా పలుకు, అలివేణీ పలుకు నీరజపాణీ పలుకు - అయ్యవారు ఏదో ఆలోచిస్తున్నారు - మహాకష్టాలలో ఉన్నారు. మంచుకొండలాగ వచ్చిన కష్టం మబ్బు తునకలాగ మటుమాయం అయిపోతుంది. మహామంచి మనసు. కాని తెలియకుండానే చిక్కుల్లో పడతారు. అంబను సేవించు - అన్నిటినీ పాలించు దొరా!" అన్నాడు బుడబుక్కలవాడు. అతని ఘంటానాదంలో, డమరుకం బుడబుడక్కల చప్పుడులో అతని జోస్యం కూడా కలిసిపోయింది తప్ప - నాగభూషణంగారది వినిపించుకోలేదు. 'రామనామ తారకం రక్తిముక్తిదాయకం' అని పాడుకొంటున్నారు. సంక్రాంతి వారం - కొత్తధాన్యం ఇండ్లల్లోనూ, గాదుల్లోను నిండుతున్నాయి. మూడోయింటి పాపమ్మగారి దంపుళ్ళ చావిట్లో, ఆరుగురు కాపుపడుచులు కొత్తధాన్యం రాతిరోలులో వేసి దంచుతున్నారు. వాళ్ళపాటే అది—.

'కోడలా! కోడలా! కొడుకు పెళ్ళామా. ఓ యమ్మ.'

ఆ పాటుకి వేడివేడి అటుకులు గరగరగ్గా - గరంగరంగా, సాగుతున్నాయి-నాగభూషణంగారు దీర్ఘంగానే

## "శ్రీవాత్సవ"

ఆలోచిస్తున్నారు. ఆ పాటలోని మాటలు మర్మఘాతంలాగ తగులుతున్నాయి. అప్పుడు- తనకొడుకు చెట్టంతవాడయ్యాడు. ఈపాటికి పెళ్ళికావలసిందే - కాలేదు. మొదట రెండు మూడు సంబంధాలు చూచి తానే వద్దన్నాడు. అవి ఒప్పుకున్నా తీరిపోవునేమో! పిల్లవాడికి అంగారక దోషం. రాహుమంగళ యోగం. వాళ్ళిద్దరు అకళత్రస్థానంలోనే ఉన్నారు. ఈ కాలంలో కూడా జాతకం అంటే అంత చాదస్తంగా చూస్తున్నారు. పిల్లవాడికి పెళ్ళి కాలేదు: చదువు పూర్తికాలేదు. ఆ బి. యే. తిరిగి ఈ సంవత్సరం దండయాత్ర చేస్తున్నాడు. ఈయేటతో కైనా వదలిపోతే - ఏదో ఒక పనిలో ప్రవేశపెడితే అక్కడి కది పూర్తిఅయ్యేది! ఏదీకాలేదు మళ్ళీ అట్టే సంబంధాలు వచ్చినట్టు లేదు. ఆ కట్టావారి అమ్మాయిని చూస్తే - అబ్బాయికి అసలు నచ్చలేదు. వీడన్నీ యిలాగంటే యెలాగ? ఆడదానికి అందం ఏమిటి? 'ఎక్కడి కక్కడికే శ్రీ మహాలక్ష్మి!' వీడికి పెళ్ళికాకపోతే కష్టమే! బ్రహ్మచారి ముదిరీనా బెండకాయ ముదిరినా పనికిరాదు అంటారు మరి. వీడి వయస్సుకి అప్పుడే తన పెళ్ళీ అయింది; బిడ్డనూ ఎత్తుకున్నాడు ఏమైనా సరే ఈ వేసవిలో పెళ్ళి చేసెయ్యాలికి అదటుంచు - ఇప్పుడు పీకలమీదికి బ్యాంకు వాయిదా వచ్చిపడింది కదా! సమయానికి ఇవ్వకపోతే - వడ్డీ పెరిగిపోతుంది. కొత్త ధాన్యం వచ్చింది. అయితే అది అయినకాడికి అమ్మెయ్యాలి. తక్కువ ధర! బస్తా ఒక్కంటికి ఒక పుంజీ రూపాయలు లేదా ఉంటుంది. ఎనభైబస్తాలు మూడువందలపై చిల్లర నష్టం! క్రిందటేడు గృహప్రవేశం, సంతర్పణ లేకపోతే - ఆ ధాన్యం మిగిలేవే. అవి తిండికే సరిపోలేదు. క్షేమంలో మేలు. ఈయేడు [illegible] బాగా పండాయి. పల్లపు పొలం నూరు బస్తాలు రాలుస్తే, మెరకపొలాలన్నీ చేరి మరో నూరుబస్తాలు దిగుబడి యివ్వవా? చూద్దాం! బాగానే ఉంది - ఈసంవత్సరం దండుగ! పెద్దమ్మాయి రానేరాదు కనక, చిన్నమ్మాయీ అల్లుడూ రావాలి. వాళ్ళకి బట్టలు ఇవ్వక తప్పదు. చిన్నమ్మాయికి తొలికాన్పు కనక అఖర్చులన్నీ తానే భరించాలి. ముసలావిడ ఎంతో ముచ్చటపడుతూ ఉంది అవిడ చాదస్తం మరీని - సంక్రాంతికి శివాలయంలో అభిషేకం చేయిస్తుందట!



**లంబాడిపిల్ల...చీడీలమీద పడుతున్నట్టు వాలిపోయింది....ఇది మందు ప్రభావమా?**
**ఈమనిషి దొంగయెత్తు వేసిందా?**

[illegible]కి ఖర్చు కాక తప్పదు పోనీ తాను [illegible]య్యక పోయినా ఇల్లాలు అయినా చేసి[illegible]చిది పుణ్యమూ పురుషార్థమూ కలిసివస్తా[illegible]

'హరహరా! సాంబశివశివా!

కైలాస వాస[illegible]!

జంగందేవర శంఖంపూరించి, గంటవాయిస్తూ వస్తున్నాడు ఆపాట అతనిరాగం వింటే, ఎంత నిరుత్సాహం పొందేవాళ్లకయినా కొత్తఆశలు పుట్టుకొనివస్తాయి ప్రొద్దెక్కుతోంది ఆవిడ వీధిలో ముగ్గులు పెడ్తూ ఉంది. నిమ్మకుస్తులు - ఎగురింటి వాళ్లకోడలు - పండుగలకి పుట్టింటికి వెళ్ల లేదు ఇక్కడే ఉండిపోయింది వాళ్ల మామగారు కర్కోటకుడు తాపట్టినకుందేటికి మూడేకాళ్లు అనేరకం కొడుక్కి వాడీ, కాని యివ్వలేదని విశ్యాలవారి మీద పంతం! ఆ కోడలు వట్టి చెవల వాజమ్మ తండ్రిచాటువాడు! ఎంతచెప్పితే అంతే - గిరిలోంచి దాటి బయటికి రావడమే అసంభవం ఆ పిల్ల అదృష్టం మరి! ఎప్పుడుచూచినా కలకలా నవ్వుతూ ఉంటుంది తన నవ్వులాగే ఎంత పెద్ద ముగ్గు పెట్టిందో? గుమ్మానికి ఎంత నిండుగా! ఉందో? 'పెలొతీసి దానిలో గుమ్మడి పూలు, గొబ్బిబంతులు చక్కగా పెట్టింది ఈ బంతిపూలు చా[illegible]పూలు దండలు గుచ్చి గుమ్మానికి కట్టారు ఎంతో బాగున్నదో, వాళ్లయిల్లు! మన దొడ్లో [illegible]పూలూ చేమంతిపూలు బాగా పూస్తాయి కాని ఎందుకు? వాటిని మా చేవాళ్లేరు! ఇరుగు పొరుగువాళ్లు కోసుకొనిపోతారు అమ్మాయి వచ్చిన తర్వాత దండలు కట్టుందేమో! దానికి అలాంటి శ్రద్ధలులేవు [illegible] చెవద ఒకటా? ఏమి చేస్తుందో! మన యింటికి ఇంతవరకు పండుగకళే రాలేదు మరి!

స్నానంచేసి వచ్చేలోపున - అబ్బాయి వచ్చేవాళ్లకి బియ్యం పడితే మంచిది! వచ్చేవాళ్లు వెళ్లేవాళ్లు బిచ్చగాళ్లు, నాగభూషణంగారు బియ్యం పోసిన పెద్దబుట్ట కొడుకు వీరభద్రానికి అప్పగించి వెళ్ళిపోయారు

# లతాంతార్ధ్వ రాగంబు లంబాడి



'బొజ్జగల తల్లో, బొజ్జగలతల్లీ—
బొజ్జకోడలొ స్తదో బొజ్జకోడలొ స్తదీ?' అంటూ కోయమనిషి - కళ్లు తిప్పుకుంటూ మెడలోని పూసలు మిలమిలలాడిస్తూ వచ్చి పాడుతూ ఉంది.

బొజ్జగలతల్లి సరి - బొజ్జకోడలు బొజ్జకోడలు ఏమిటి? నాకువద్దు. నే నిన్నాళ్లు పెళ్లి చేసుకోలేక నేమిటి? మంచి పిల్ల రావాలనే ఇంతసేపు ఆగాడు అబ్బాయి! ఆ యెదురింటి వెంకుపంతులుగారి కోడలు-ఎంతచక్కగా ఉంటుందో! గుమ్మడిగింజ లాగ అలాంటిపిల్ల తనకి భార్యఅయితే?— ఆ పిల్లకి తగిన మొగుడుదొరకలేదు, కాకి ముక్కుకి దొండపండు! ఆ శ్రీరామమూర్తి చూడు—నల్లగా కొఱివిదెయ్యంలాగ ఉంటాడు. వాడు చుట్టలుకూడా కాలుస్తాడు. చుట్టలవాసన ఎలాగ భరిస్తుందో!—అంత సుకుమారమైన ఆ అమ్మాయి. తనకి ఆవాసనే గిట్టదు!—దుర్భరం! వాళ్ళు ఎలాగ బాధపడితేనేం? ఆ పిల్లకి మొగుడంటే ఇష్టమల్లే ఉంది. ఎపుడుచూచినా ముఖం నవ్వుతూ ఉంటుంది. వీడికి యింతోటి, మహాయోగ్యుడు వాచీకావాలట, వాచీ. అది కొనిస్తే గాని పండగకి వెళ్ళడట. మొగంవాచీటట్టు చీవాట్లు పెట్టాలి, వాడికి వాచీకాదు. వాళ్ళగొడవ మనకెందుకు? నా పెళ్ళిమాట యీ సంవత్సరం అయిపోతే బాగానే ఉంటుంది. నన్ను ఏ పిల్లచూచినా అలాగ చురచురలాడుతూ చూస్తుందే! అమ్మ నన్ను కొఱకంచు అంటుంది. నేనేం చేశానని? నేను బాగాఉండనా? బాగా నేఉంటానే! మా విస్సన్న మావయ్యకూతురు నన్నెంతో మెచ్చుకునేది. ఆ పిల్లకి పెళ్ళి అయిపోయిందికాని దానిని చేసుకున్నా బాగుండిపోను. ఎవరికినచ్చిన పిల్లను వాళ్లకు చేస్తే లోకంలో ఇంతమంది 'దేవదాసు'లు లేకపోదురు! కొంపదీసి నేను దేవదాసును అవుతానా? ఎందుకు అవుతాను—నాకలాంటి 'పార్వతీ' లేదు. 'చంద్రముఖీ' రాదు!

వెంకుపంతులుగారి కోడలికి గిరీశం లవ్ లెటర్సు రాశాడట. ఈ అమ్మాయికేనా? అతనెప్పటివాడో? ఛీఛీ! తప్పు తప్పు! ఇపుడు నాకేసి ఆ అమ్మాయి నవ్వుతూ చూస్తుంది. మా యింటికివస్తే చాలకోపంగా చూస్తుంది. అర్థంఏమిటి? ఆడవాళ్ళ చూపులకి అర్థం ఏమిటి? నారికేళ పాకము గదే కామినీ హృదయ కావ్యరస గ్రహణమ్ము నెచ్చెలీ...నాటకంలో ఏ రాగంలో పాడాడు చెప్మా? బాగాఉంది పద్యం?

ఈ ధోరణిలో వీరభద్రం ఆలోచిస్తున్నాడు.

"బొజ్జగలతల్లీ...బాబూ, మీకు పెట్టమీద మనస్సుపోతది. పెట్టమందు ఇస్తాను తీస్తావా?" అంటూంది కోయపడుచు! అలాగంటూ చేరువగావచ్చి మత్తుమంతు వేసినట్టు మాటాడుతూఉంది!

అవును—వీళ్ళు మందు లిస్తారట—ఆ మందులు పనిచేస్తాయా?

"మీకు చక్కని చుక్కమీద ఉంది—ఈ మందుతీసి బొట్టుపెడితే పెట్ట బుట్టలో పడుతాది తీయ్‌దొరా!" అని తన బుట్టలో నించి బూడిదతీసి యేదో చెప్తూవుంది! నిజమేనా? అని వీరభద్రం లోభపడ్డాడు. ఒక తవ్వెడుబియ్యం కోయదానిబుట్టలో వేశాడు --స్నానం చేసి—కొత్తబట్టలు కట్టుకొని అది నొసట పెట్టుకొని—ఆ బొట్టు ఎవరుచూస్తే వాళ్ళు వెంటపడతారట! మందు పనిచేస్తే బాగానే ఉంటుంది! ఇదంతా ఎలాగ పని చేస్తుందో? తీరా ప్రయత్నిస్తే! ఒకటిరెండు చెడితేనే తప్ప వైద్యుడు కాడు.

తాటాకు గిలకలుపట్టుకొని ఎఱుకలది వస్తోంది. పిల్లలకికొనాలి. ఇంతలో వెదురు కఱ్ఱలతో చేసిన బూరాలు. ఆ కోయదొర ఎంత చక్కగా వాయిస్తాడో! తమాషాగా ఉంది. ఫ్లూటులాగేఉంది. ఇదే బన్సారీ అంటారు. వాడిలాగ తాను వాయించగలడా? తవ్వెడుబియ్యం ఇస్తే ఒక పిల్లనగ్రోవి!

"ఏమిట్రా అబ్బాయి! భద్రం! బియ్యమన్నీ ఖాళీచేశావు. అడ్డమైన సామానులు ఈ బియ్యం పడబోసికొంటున్నావు: వెళ్ళు స్నానంచేసిరా" అని ఒక్క గదుముగదిమి నాగభూషణంగారు వీధి అరుగుమీద నించున్నారు. బిళ్లగోచీపంచె విభూతి పిండికట్లు. అపరమాహేశ్వర మూర్తిలాగున్నారు. ఆయన తలంటేనెఱసిందికానిమనిషి పిడుగులాగ ఉంటాడు. కొంతమంది ఎంత కాలమైనా నిత్యయౌవనులుగా ఉంటారు. నాగభూషణంగారు ఆ కోవలో చేరినవాడే! అరే! ఆ పాముల బుచ్చిగాడు. ఎపుడుచూచినా ఒకలాగే ఉంటాడు, కఱ్ఱ ముక్కలాగ! ఆ నాగస్వరం ఊదితే-చక్కగా ఉంటుంది. ఎప్పుడూ తప్పతాగి ఒళ్ళుతెలియకుండా ఉండేవాళ్ళు; వీళ్లు ఈ రోజుల్లో ఎలాగుంటున్నారో! ఏం? బ్భాగానే ఉంది. పెద్దకాపుగారి దగ్గర రెండొందలు దాచుకున్నాడట వీడు. క్రిందటేడు వీడి కూతురిమీద తప్పేస్తే అది



తీసుకోవడానికి ఆ రెండోందలూ అయిపోయాయట. నాగస్వరం బాగా ఊదుతాడు, పాముల బుచ్చెయ్య. వాడికొడుకే ఆ వచ్చేవాడు. వీడూ వాయిస్తాడు నాగ, సారపుకాయ!

నాగస్వర మూదితే నాగులకు నిద్ర...

మల్లికాసులవాళ్ళు - ఏటా వచ్చి నడవలో ఆటకట్టారు. "ఇక్కడ వెలిగిన దీపారాధన తిరిగి కరణంగారి లోగిలివద్ద వెలుగో!" అంటాడు. కఱ్ఱసాము బాగా చేస్తారు వాళ్లు. ఈ కాలపువాళ్లకి ఏమీ చేతకాదు సుమా!

వాడింకా వీరణం తాషామర్పాలాంటి డమారం వాయిస్తున్నాడు... పెద్ద చప్పుడు. వద్దు...బియ్యం వేసి పంపించెయ్యాలి. లేకపోతే పెద్ద గోలచేస్తాడు! నాగభూషణంగారు ముష్టివేసి వచ్చాడు. వాడు ఆ మలుపు తిరిగాడో లేదో ఇంతలో గంగిరెద్దులవాడు వచ్చాడు.

బాబు గారికీ దణ్ణం పెట్టు
అయ్యగారికీ దణ్ణం పెట్టూ
డూడూడూడూ బెంకన్నా

పెద్దమ్మాయి కొడుక్కి గంగిరెద్దువాళ్లంటే ఎంతో యిష్టం! వాళ్లకి డబ్బు వేసి-ఇంతమంది కొడుకులూ కూతుళ్లు కలగాలి అని దీవించుకోవాలి. 14 గురు మగపిల్లలు 12 గురు ఆడపిల్లలు అని వాడు చెప్తే ఎంత సంతోషమో! పిచ్చిపిల్లలు.

"బాబు గారికీ దణ్ణం పెట్టూ!"

'ఒరేయ్! అవన్నీ వాయించ నక్కరలేదు - ఉండు బియ్యం వేసిపంపిస్తాను' అని నాగభూషణంగారు ఒక సోలెడు బియ్యం వేసి చేతులు దులుపుకొన్నారు. అబ్బా! ఎంతమంది బిచ్చగాళ్లు?

అదిగో వెళ్ళాడే బీబీనాంచారీ
వెళ్లాడే బొమ్మ!—అంటూ

బీబీనాంచారమ్మ వచ్చింది. ఇంక ఇలాగ తండోపతండాలుగా వస్తూఉంటారు. ఈ పద్ధతి యెక్కడా లేదు. పండుగలకి తండోపతండాలుగా తరలిరావడం, కలిగినవాళ్లు యీ పేదల కింత పెట్టుకోవడం, ఒక్క తెలుగువాళ్ళకే చెల్లింది. పెద్దపండుగ! పండిన ధాన్యం యిళ్లకువచ్చే పండుగ! పనులూ అవీ పూర్తి అయి అంతా తెఱపిగా ఉండే పండుగ! అబాలగోపాలమూ చేసుకుంటారు. ఆటపాటలతో—

అదుగో! శాస్త్రులుగారు వచ్చారు. సంక్రాంతినాడు చేయవలసిన తర్పణాల మాట ఆలోచించాలి. నాగభూషణంగారు పురోహితులయిన శాస్త్రులుగారితో లోపలికి వెళ్ళారు!

బాగా జాముప్రొద్దెక్కింది. వీరభద్రం స్నానంచేసి బట్టలు వేసుకొని వీధిలోకి వచ్చి నించున్నాడు. "బొజ్జగల తల్లీ!" బొజ్జగల తల్లీ!" మగో కోయది! ఇందాక కోయది మంచిదే. మందిచ్చింది. జ్ఞాపకం వచ్చింది. ఆ మందుతీసి...వణుకుతూవున్న చేతితో నొసటమీద పెట్టుకున్నాడు. పెట్టుకొని యెదురింటి వైపు పరీక్షగా చూస్తున్నాడు. ఎవరూ కనిపించడం లేదు. ఎదురింటి వెంకు పంతులుగారి కోడలు లోపల ఎక్కడ ఏ పనిలో మునిగిపోయిందో?కిటికీలోంచి చూచినా ఎవరూ లేరు? స్నానాల సమయం, వంట పనులు! ఈసమయంలో ఎవరు కనిపిస్తారు? చూడాలని వెఱ్ఱిచూపు చూడటం తప్ప!

చకాచకా చకాచక్

కత్తులు కొట్టిన చప్పుడు. ఆ కత్తులు ఆడిస్తూ ఒక అందమైన పిల్ల వచ్చింది. మంచి వయస్సులో ఉంది. తలమీద ముసుగు. స్తనవల్కలాలు చుట్టినట్లు గుబ్బలతో రంగుబిళ్ళలు వేసి కుట్టిన గుత్తమైన రవిక. చెవులకి చేతులకి, మెడలోను ఒడిలోను బరువైన ఇనుప నగలు. వాళ్లే జాతివాగో! 'లంబాడి' వాళ్లంటారు వాళ్ళే యేమో! అదేం భాష? అలాగ మాటలాడుతుంది! అర్థం కాదు. పిల్ల పిటపిటలాడుతూ మంచివయసులో ఉంది. ఈ కత్తులెందుకు? కత్తులు చూస్తే భయం వేస్తుంది. పూబోళ్లు కటారిక త్రియల్!—చాకులాంటి పిల్ల!

"కత్తి కొంటారా?"అని అడుగుతోంది. కొంటారా చస్తారా అన్నట్టు ఝడిపిస్తోంది. వీరభద్రం ఏదో మాటలాడబోయాడు. లంబాడీ పిల్ల అతనికేసి దీక్షగా చూచింది. భద్రం పెట్టుకొన్న బొట్టు కనిపించిఉంటుంది! అదేమిటి అలా వెర్రిదానిలాగ చూస్తుంది? పెటమందు పని చేస్తూ ఉందా ఏమిటి? కోయది గట్టిదే! వీళ్ళు ఎంతకయినా తగినవాళ్ళు. ఎంతెంత పనులైనా చేయగలరు! ఇదేమి కర్మ! తీరా ఇది వెంట పడితే? అప్రతిష్ఠ! నాన్న యింటిలో ఉండనీయడు. తరిమేస్తాడు. ఇంకా పరీక్ష ఒకటి ప్యాసు కాలేదు. ఛా! ఈ మనిషిని వదుల్చుకోవడం యెలాగ? కత్తి కొనేస్తేనో! ఒక రూపాయి యిచ్చి కత్తి కొన్నాడు అలాగయినా వదలిపోతుందని! ఆ లంబాడీ పిల్ల కదలదు. పైగా పాతబట్టలు కావాలట. గంజి పొయ్యాలట! అమ్మతో చెప్పి అన్నం పెట్టిస్తేనో! మడి కట్టుకుంది. ఎవరూ తినకుండా యీ లంబాడీదానికి పెట్టుందా? పెట్టదు. ఒక సీతాఫలం పెట్టితే సరి! దానితో ఆకలి తీర్చుకుంటుందేమో!

వీరభద్రం ఒక సీతాఫలం పెట్టి వెళ్ళిపొమ్మన్నట్టు అడిగాడు. లంబాడీపిల్ల కదలదు. వీరభద్రంకేసి చూచి వెకిలిగా నవ్వుతుంది. వింతగా చూస్తుంది. తిష్ఠ వేసి కూర్చుంది. సీతాఫలం తిని కడుపునిండా నీళ్ళు తాగింది. ఆ కత్తులమూట అక్కడ పెట్టి, అరుగుకి చేరబడి గుమ్మంచీడీలమీద కూమంది. వీరభద్రానికి భయంగా ఉంది. ఇదంతా ఆ కోయది ఇచ్చిన పెట్టుమందు గుణం అని చెప్పి లోపలికి పోయి బొట్టు చెరుపుకొని వచ్చేశాడు. బుద్ధి వచ్చింది అన్నట్టు లెంపలు వేసుకున్నాడు ఇంకెన్నడూ ఇలాంటి పనులు చెయ్యకూడదని.

లంబాడీ పిల్ల అలాగే కూర్చుంది. సొమ్మసిల్లినట్టు కూర్చున్నదే పడిపోయింది. చీడీమీద పడుకున్నట్టు వాలిపోయింది. ఆ వాలిపోవడంలో పయాట జారి ఆమె యవ్వనం అంతా కన్పిస్తూ ఉన్నట్టు కనిపిస్తోంది. వీరభద్రం సిగ్గుపడిపోతున్నాడు. కళ్ళు మూసుకున్నాడు!

ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు? ఇది మందు ప్రభావమా? ఈ మనిషి దొంగ యెత్తు ఏమైనా వేసిందా? ఒక పడుచుపిల్ల అలాంటి దుస్తులతో ఎదురుగా తన ముందు పడిఉండటం బాగా లేదు. ఏం చేయడం? దీనితో ఏం కొంప మునుగుతుందో?

నాగభూషణంగారు బయటికి వచ్చారు. చూశారు. "ఇదేమిట్రా భద్రం! ఈ పిలను వీధిలో పడుకోనిచ్చావు? పంపించెయ్ -"అని ఆయన చీదరించుకొన్నాడు. 'పైగా స్పృహ లేనట్టుగా ఉందే?' భద్రం కిమన్నాస్తి మాటలాడడు. 'లేలే' అన్నాడు. ఆపిల్లకి వీళ్లగొడవ వినిపించడం లేదు.

ఏమిటి జరిగిందో చెప్పు అని నాగభూషణంగారు తన వెఱ్ఱిబాగుల కొడుకును నిలదీసి అడుగుతున్నారు. శరపరంపరగా మీద పడే ఆ ప్రశ్నలకి ఏ జవాబూ భద్రం చెప్పలేక తడబడుతున్నాడు. మాట పెగలదు. లంబాడీ పిల్ల కదలదు. వీరభద్రం చివరికి సంగతి చెప్పాడు. పెట్టుమందు బొట్టు - ఆపిల్ల చూడడం—నవ్వుతూ పడిపోవడం ఇవన్నీ నాగభూషణంగారి బుద్ధికి నిజంగానే ఉన్నాయి. అప్రతిష్ఠ! తీరని కళంకం! ఇన్నాళ్ళూ పెళ్ళిలేకుండాఉన్న తన ఏకైకపుత్రుడికి ఒక లంబాడీ పిల్లనిచ్చి పెళ్ళి చేస్తాడా? వాళ్ళు చేసుకోవద్దూ? వాళ్ళు ఎన్నో కట్టుబాట్లు పెట్టుకుంటారు. చూస్తూ చూస్తూ ముళ్లకంపమీద చెంగు వేశాడు భద్రం. అది చిరగకుండా వెనక్కి తీసుకోవడం యెలాగ? పెట్టుమందుకొనడం ఏమిటి? ఆ పాడుమందు లెందుకు వీడికి? అవి ఈరోజుల్లో కూడా పని చేస్తాయన్న మాట - ఇదిమూచి ఆ శాస్త్రులు గారయితే వెళ్ళిపోయారు కాని ఇంకెవరైనా చూస్తే ఊరిలో తలెత్తుకోలేము! ఈ వంకను డబ్బు గుంజుకోవాలని యీపిల్ల యెత్తువెయ్య

# లతాంతార్ద్రిరాగంబు లంబాడి

కదా? అబ్బ! ఆడవాళ్లని నమ్మకూడదు. ఎంతయినా చేస్తారు! కాక వీడికి పెళ్ళి కాక ఈ చిక్కు వచ్చి పడింది. తిన్నగా ఉండటం లేదు. ఆ వెంకుపంతులు గారి కోడలి వైపు ఎందుకు అలాగ చూస్తాడు? రెండు మూడుసారులు కేక లేశాను. వాళ్ల అమ్మ చేతకూడా చెప్పించాను. బుద్ధిలేదు. వాడి పని ఏంలాభం? ఇంతకాలం ఘోటకబ్రహ్మచారిగా ఉండనిచ్చిన నాకు బుద్ధిలేదు. ఈ లగ్నసరిలో ఏ సంబంధమైనా చూచి ముడి పెట్టివేస్తాను. ఇపుడీ చిక్కు దాటి బయట పడాలికదా! ఈపిల్ల అలాగ పడిపోయి ఉంది - ముఖంమీద నీళ్ళు కొట్టి చూస్తాను ఉండు!

నాగభూషణం గారు ప్రథమ చికిత్సవంటిది చేశారు. ఆపిల్ల మంచినీళ్లు తాగింది. కదులుతోంది. కాని పూర్తిగా స్పృహ రాలేదు. పొద్దుటినించి విన్న పాటలన్నీ తలలో మెదుల్తున్నాయి. పండుగపూట ఇంటి ముందర ఈ అఘాయిత్యమేమిటి? నలుగురిలోను తలవంపులు! ఎవరినైనా డాక్టరిని పిలిపిస్తే! ఇంకెవ్వరు? ఆయనొక్కడే! శృంగారం! వస్తాడా? ఎందుకు రాడు? డబ్బిస్తే సరి! ఇలాంటి చిక్కు లేనిదంటే. డబ్బుచ్చుకుంటూ డాం? "ఒరేయ్ అబ్బాయి? డాక్టరిని పిలుచుకొనిరా!"

"వెళ్ళను నాన్నా! ఇది నా పెటమందు గుణమేమో!"

"నీముఖం! నే చెప్పినట్టు వెళ్ళి డాక్టరిగార్ని పిలుచుకొనిరా!

డాక్టరుగారువచ్చేలోపున నాగభూషణం గారు లోపలికి వెళ్లారు. ముసలావిడ వచ్చి చూచింది. పనివాడూ వెంకన్న కనిపెట్టుకొని వున్నాడు. లంబాడి పిల్ల కదుల్తూ ఉంది. కాని ఇల్లు విడిచి స్వస్థస్థితిలో లేదు.

ఇంతలో ఒక పెద్ద ముఠా వచ్చారు! లంబాడీమూక. ఆడవాళ్లు మగవాళ్లు! గుంపు! అందరూ ఒక ఉప్పెనలాగ వచ్చి పడ్డారు.

'ఏంబాబు? ఏం చేశారు?' అని కేకలు వేస్తున్నారు. ఆ వాలకం చూస్తే వీళ్ళందరూ ఒక దండయాత్రకని బయలుదేరినట్టు కనిపిస్తున్నారు! నాగభూషణం గారు లోపలినించి బయటికి వచ్చారు. ఈ సందడికి చుట్టు ప్రక్కల యిండ్లవాళ్ళు వచ్చారు. డాక్టరు గారూ వచ్చారు. ఘాటయిన మందు వాసన చూపించారు. వెంకు పంతులు గారి కోడలు ఘురఘురా చూచింది. వీరభద్రం తలయెత్తుకోలేదు.

నాగభూషణం గారు తలెత్తుకోలేకుండా న్నారు. ఏమి అభాండం మీదపడుతుందో? ఇంతవరకు ఊరిలో పెద్దతలకాయలాగ బ్రతికాడు: ఈ అవమానం ఎలాగ భరించడం?

డాక్టరు పరీక్షచేసి భయంలేదన్నారు. అది ఒకరకం మూర్ఛ, ఫిట్సు, అని తేల్చారు. మందు ఘాటుకి, లంబాడీ పిల్ల లేచి మంచినీళ్లు తాగింది. 'అమ్మయ్య బ్రతికించిందిరా బాబూ ఫరవాలేదు' అని త్వర త్వరగా నాగభూషణం గారు లోపలికి పోతున్నారు. అక్కడ ఉంటే ఆ పిల్ల ఏం అనరాని మాటలు అంటుందో, ఏం పరాభవం వస్తుందో అని!

వీరభద్రం భయంతో బిక్కుబిక్కు చూస్తున్నాడు.

ఆ పిల్లకి తెలివివచ్చి ఏం చెపుతుందో అని!

"ఓసూ! ఈ బాబ్జీ నన్ను బ్రతికించారు" అని యింకా తన భాషలో గుక్కతిప్పకుండా ఏదో మాటలాడింది. ఆ ముఠా వాళ్ళందరూ "అయ్యగారు! మా పిల్ల ప్రాణం దక్కించారు: మీదీ మేలూ మరచిపోలేం..." అని వాళ్లల్లో ముఠా పెద్ద లంబాడీ అమ్మి అన్నది. ఆవిడ ఆ పడుచుపిల్ల తల్లి. అందరూ లేచి దణ్ణాలు పెట్టి వెళ్ళిపోయారు.

డాక్టరుగారికి అయిదురూపాయలనోటు చేతిలో పెట్టబోతూ ఉంటే, అనాథ బాలికను చికిత్స చేసినంత మాత్రానికే ఛార్జీ తీసుకుంటానా? వద్దులెండి అని వెళ్ళిపోయాడు డాక్టరు శృంగారం!

వీరభద్రం - ఆ ముఠా వెళ్ళిన వైపు చూస్తున్నాడు. వెంకు పంతులుగారి కోడలు వింతగా చూచి లోపలికి వెళ్ళిపోయింది. ఇంకా ఇరుగు పొరుగు వాళ్లుకూడా ఎవరి యిళ్లల్లోకి వాళ్లు వెళ్ళిపోయారు. పెద్ద కెరటాలు వచ్చిపోయినటయింది.

నాగభూషణం గారు ఆశ్చర్య సంభ్రమాలతో అరుగుమీద పచారీ చేస్తున్నారు.

పొద్దుటినించీ విన్న పాటలు లతాంతార్ద్రిరాగాలు వినపడుతున్నాయి గోలగా, గజిబిజిగా!

"పాలక పెలి శయన గారా!"

"హరహరా! సాంబ శివశివా!"

"పెళ్లాడే బొమ్మ"

"బొజ్జగల తల్లి బొజ్జగల తల్లి—
బొజ్జగల కోడలు వస్తాది బొజ్జగల కోడలు వస్తాది."

గాలికి చెట్లు రొదచేసినట్టు - మనస్సులో కంగారు. వీరభద్రం మాత్రం వాన వచ్చి వెలిసినట్టు కుదటపడ్డాడు. ఆ తబ్బిబ్బు మనస్సులోని తలపుల మలుపుల్లో అర్థంలేని ఆలోచనలు. ఆ ఆలోచనల సందులో ఆకారంలేనిపాటల వరుసలు! తీగలేని వీణ: వీణలేని రాగం, తానం, పల్లవి.

భుజంగ ప్రయాతం బుభుక్షిత మాతం
లతాంతార్ద్రి రాగంబు లంబాడిలంగా!

ఈ పాటలోని కూనిరాగాలు చినిగిపాతల జిలుగు రంగులుగా సిల్కు చీరల చిరునవ్వులుగా శిరస్సులో చిడుముడులు పెట్ట చెదరిన తలపుల్ని చిందర వందర చేస్తున్నాయి. ★



## అంతశ్చిత్రాలు

సి. నారాయణరెడ్డి



చీకటి పెదవులు నాలోపల
జీవన వేణువు పూరించెను
కాంతి కరమ్ములు నా కన్నుల
గాఢ తమోభారం దించెను.

హైమంత నిశీథం నాలో
అంగారం రేకెత్తించెను
ఆషాఢ పయోదం నాలో
యోషావిరహం పొరలించెను.

ఉరిమిన ఆకాశం నాలో
ఉన్మాదం ఒడలెత్తించెను.
తరళ తటిల్లాసం నాలో
తారుణ్యం పడగెత్తించెను.

ఆరని కర్పూరం నాలో
ఆశాదీపం ముట్టించెను
అందని మందారం నాలో
అనురాగం నన లెత్తించెను.

నాలోన ఉషస్సులు కురిసెను.
నాలోన తమస్సులు మెరిసెను
నాలో పావన జీవన సం
ధ్యాలాసిక కింకిణులు మ్రోగెను. ★

# స్వప్నిక

అనగనగా – ఓ మహారాజు: ఆయన కు వలమాలిన రాజ్యం.

ఆ రాజ్యంలో ఎన్నడూ అతివృష్టి లేదు, అనావృష్టి లేదు: ప్రజలకు ఏ యీతిబాధలూ లేవు.

ఏలే మహారాజుకు ఏమీ పని లేదు – ప్రొద్దు పోవడం లేదు.

చూసి చూసి ఏమీ పాలుబోక, చివరికి ఒకనాడు మహామంత్రికి కబురు చేశాడు, ఉన్నవాడు న్నట్టుగా వచ్చి దర్శనం చేసుకోమని.

ఒక్క క్షణంలో జవాబు వచ్చింది – రానేనని –
ఎందు చేత? – మహారాజే స్వయంగా బయలు దేరి వెళ్ళాడు, కనుక్కుందామని

గుమ్మంలో కూచుని, నిశ్చింతగా జంధ్యాలు వడుక్కుంటూ ఉన్నాడు ఆ బ్రాహ్మడు –

'ఏం మహామంత్రీ!'

'నన్ను ఆ పేరున పిలవద్దు!'

'ఏం? –'

'సిగ్గు చేటు!'

'నీకా – నాకం!'

'ఉభయులకూ! – నాకు ఏడు వెనకల పుట్టిన ప్రతి కుర్రమంత్రీ – కార్య కలాపాల్లో మునిగి తేలుతూ, – దిగంత విశ్రాంత యశో విరాజితుడౌతూంటే – నేను గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోనా – ఏదీ, చెలుముడి చెప్పండి – మీ హయాములో, ఒక్క యుద్ధం వచ్చిందా. ఒక్క ఉపద్రవం వచ్చిందా? –'

'అది నా తప్పంటావా?'

మంత్రి భగ్గుమన్నాడు. 'నిర్మొగమాటంగా చెప్పాలంటే – అనక తప్పదు –! పరరాజులున్నారంటే వాళ్ళకేం మనమీద జాలా, దయా? – కవ్వించండీ, కజ్జాకు కాలు దువ్వుతారా? – అది మీకు చేత కాదాయెను

ఏ రాజ్యంలోనన్నా చూడండీ – ఎప్పుడూ కన్నుల పండువుగా, గత్తర్లూ గందరగోళా లేకద.

అటునుంచి ఆ రాజు దండెత్తడం – ఇటునుంచి యీ రాజు దండెత్తడం – మంత్రి కలుగజేసుకోవడం – ఎత్తుపై ఎత్తు వేయడం – అందితే తన్నడం – తప్పితే తినడం – యీ మచ్చట ఒక్క నాడన్నా నాకు తీరిందా? –

'ఎందుకండీ ఈ ఉద్యోగం – నా చేతాను –' అన్నాడు ఖండితంగా – 'సరే!' అన్నాడు, మహారాజు వినయంగా. మంత్రి ఒడుపులో కదురు మరింత విశ్శృంఖలంగా తిరుగుతోంది: చూసి చూసి, –

మహారాజు మనసు చుక్కపట్టింది. తోచీ తోచని మహారాజు యిటు మళ్ళీ, అడుగులు లెక్కపెట్టుకుంటూ వస్తున్నాడు. దోవ పీలి, కాలువగట్టు చ్చుకుంది. కాలిబాట నలిగి నలిగి చేలో దుబ్బుల్లో కలిసిపోయింది.

– మడి దున్నుకుంటూన్న వాణ్ణి, మరియాదగా పలుకరించాడు మహారాజు.

'నీ పేరేమిటయ్యా!'

'వెంకయ్యగారి సుబ్బయ్యా!'

'ఈ చేను ఎవరిది?'

'మాపిల్లది –'

'అదేం?'

---

## మల్లాది రామకృష్ణశాస్త్రి

---

దున్నే ఆసామి ఎగాదిగా చూసి – 'నీకు పెళ్ళి కాలేదా? –' అన్నాడు – 'ఊహుం –' అన్నాడు మహారాజు నిలువునా.

'అయితే బిడ్డలున్న సుఖం నీకేమెరిక? –'

– నాగలి సాగుతూంది:

మహారాజుకు రోషం వచ్చింది – అతి ఆలోచనమీద అన్నాడు –

'ప్రజలందరూ నా బిడ్డలే!' – రైతు, ఓరకంట పరకాయించాడు.

'నీ వేం – భూదేవ్వా?'

'మహారాజును –!'

'అంటే...ఏం పని చేస్తావ్!'

'రాజ్యం చేస్తాను!'

'రాజ్యం చేయడమంటే – ? – అదేదో కొత్తవిద్దెలాగుంది. ఏమో నాకెందుకులే – నీదారిన నీవుపో! – అంక ఆగుంది –'

– మహారాజు పెదవి విరిచి చక్కాబోతున్నాడు – పోయిపోయి మళ్ళీ పట్నంలోకి జొరబడ్డాడు.

ఒక అరుగుమీద, అప్పుడే సుష్టుగా భోంచేసిన గేస్తు బాసెపట్టు వేసుకుని, తాంబూలం తబుకు ముందుంచుకొని, మునిగోర ఈనెలు సుతారంగా గిచుతూ, కడుపులో సంతోషాలూ కలిసికటుగా. కూనిరాగం తీస్తూ కూర్చొని ఉన్నాడు. మహారాజు ఆ యింటి ముందు ఆగాడు. ఒక్క అడుగు ముందుకు వేసి, – అంచాయించి, అంతలో దర్పం తెచ్చుకుని, అహంకారం ఉట్టిపడేట్టు మరో అడుగు ముందుకు వేశాడు గేస్తు, మహారాజును చూసీ చూడనట్టు చూసి, – 'ఎవరో పరదేశి వచ్చాడు!' అని, యింట్లోకి పొల్లుకేక పెట్టి – 'పోయి స్నానం చేసి భోంచేయి!' అని, యిటో ఉరుము ఉరిమి, – రాగం సాగించాడు. ఇదంతా ఆగడం అనుకున్నాడు మహారాజు! –

'నే నెవరో తెలుసునా?'

'అనవసరం!. వేళపటున వచ్చావ్! – ఉన్న దేదో కలో – గంజో – త్రాగుతావు. అంతిగా అయితే ఓ గడియ సేపు నడుం వాలుస్తావ్! – నీదోవను నీవు చక్కాబోతావ్! —'

'నేను – మహారాజును!'

'నేనూ – అంతో ఇంతో ఓ మహారాజునే. మాతండ్రి కడుపు చల్లగా – నా కడుపు చల్లగా – ఉన్నంతలో యింతవరకూ ఏలోటూ లేకుండా రోజులు వెళ్ళిపోతున్నాయ్. పద, – అలాగే నిలుచుంటావేం? – అపరాహ్ణమైంది! —'

మహారాజుకు తన్నుతానెరుగనంత రోషం వచ్చింది! – చర చర నడిచిపోతున్నాడు. గేస్తు, ఒక్క నిముషం నిదానించి, — ఒక్క అంగలో, – సరసకు దుమికి జబ్బ పట్టుకు నిలవేసి – 'ఏమిటే ఓ గాయిత్వం! – ఈ మిట్ట మధ్యాహ్నం అప్పుడు అభాస చేయడానికి వచ్చావా భిషవా! – పద —' ఆవూపున రెక్క పట్టుకు తీసుకువెళ్ళి, – మడికట్టించి తానుదగ్గిర కూర్చుని భోంచేయించాడు. భోజనం అయిన తరువాత, – కంకటి వాల్చి, – బొంత తల క్రిందకు యిచ్చి, – ఓ ఝాము సేపు కునుకన్నాడు: ఝాము కాగానే కొట్టినట్టు లేపి కూర్చోబెట్టాడు: కాళ్ళూ చేతులూ కడుక్కోమని ఉదకం యిప్పించి, దోసెడు వేలపిండీ బెల్లం గడ్డా తినిపించాడు: పోతు లాంటి వక్రకేళీపండు వలిచి చేతికిచ్చాడు: పట్టు బలవంతాన తిన్న తరువాత, – ఇహ నిలవలేక – 'వెళ్ళివస్తాను' అన్నాడు మహారాజు. 'మంచి!' దన్నాడు గేస్తు. వెనుతిరిగి చూసుకుంటూ వెళ్ళిపోతున్నాడు మహారాజు. గేస్తు ఈవంక చూసినా చూడలేదు —



హరహర ! మహాదేవ!

ఫొటో :—జి. ఎస్. భూషణ్, (మద్రాసు).



# స్వస్తిక



కోటలో హంసతూలికా తల్పంమీద,- తెల్లవార్లూ కునికిపాటన్నా లేకుండా కూర్చుని ఉన్నాడు. తొలికోడికూత విని లేచి,- కోట నలుమూలలా కలయ దిరిగాడు: తన్ను పలుకరించే వారూ లేరు,- తాను పలుకరించే వారూ లేరు - ఆలానంలో పట్టపేనుగు,- కుంభంబగోష్ఠిలో ఉంది. తాను అటూ వెళుతూంటే ఓరగంట - చూసీచూడనట్టూ,- గవంత జోహారు చేసింది: మందురలో ఉత్తమాశ్వాలన్ని - కళ్ళం పగ్గాలలో నే,- పట్ట పగ్గాలులేని పరవడిమీద ఉన్నాయ్: మహారాజుకు మర్యాద చేయాలన్న ధ్యాసే ఉన్నట్టులేదు—

తాతలనాడు ఏ వీరుడో విజయాంకంగా ప్రతిష్ఠించిన వీరధ్వజం దగ్గర నిలుచుని,- ధర్మఘంటికను మ్రోగించాడు మహారాజు. కొంతసేపటికి కొందరు పౌరులు తీరుబడిగా, ఆ ప్రాంతాన గుమికూడారు!

'మాకు యీ రాజ్యం అక్కరలేదు!' అని గర్జించాడు మహారాజు! అందరూ మౌనంగా - ఉన్నారు:

'మేము, దేశం విడిచి వెళ్ళిపోతున్నాం!'

అందరూ మౌనంగా - విన్నారు!

ఆ శిలా ప్రతిమల నన్నింటినీ ఒక్కసారి పరకాయించి, మహారాజు,- తన త్రోవ తాను చూసుకున్నాడు - పోగా పోగా -

ఎదురుగుండా - ఎవరో పండు ముదుసలి పడుచువాడికన్న ధూకుడుగా వస్తూ వస్తూ,- మహారాజుకు, రాచుకున్నంత దగ్గరసా వచ్చి,-ఆగి, - 'ఎక్కడికి?' అన్నాడు; మహారాజు ఆగకుండానే - 'అక్కడికి!-' అన్నాడు:

'అక్కడకోసం ఎక్కడికో పోవడం ఎందుకు? ఎక్కడబడితే అక్కడేఉంది!-'

'ఉందని తెలియకనే!-'

'తెలిసినా అందుకోలేకనే-'

'ఉనికికి అందలేదు!-ఊహకు అందింది!'

'పూచిన పూవల్లా కాయగాదు! కాచిన కాయల్లా పండుకాదు-'

'వెదికితే అందనిది - తానై వెదుక్కుంటూ రావాలి!-'

'అందుకు - వేయి జన్మల తీరుబడి కావాలి!'

'మన చేతకానిది - మనసుకు నేర్పావు!'

—మహారాజు-పకపక నవ్వుతున్నాడు- వినికిడి మాయమైంది. వెన్నాడిన కాంతి మాయమైంది! అడుగడుగునూ కోలాహలంగా, ఒక వసంతం చిగిరించుతూంది - మరో వసంతం పొగరెక్కుతూంది.

ఎన్ని వసంతాలుగానో,- మత్తా - సత్తా నిలుపరించుకున్న కొదమ తుమ్మెదలు,- ఏరీ కోరీ, నిలువచేసుకున్న ఆసవాలన్నీ మహారాజుమీద ప్రదిమ్మరించినవి! ఏడు రంగులు పొంగి ఏక సంద్రమైపోగా,-మహారాజు-నిలువు నిలువూ కరిగి మనసై- మనసు మరిగి మత్రాకై-మత్రాకున మినుకుమని నిలిచిన ఒక్క తేనెచుక్క,-చీకటికి వెలుగు కప్పిన తెరలు చీల్చుకు జారబడ్డది - అలనాటి అనంతంలోకి—

రోమక సామ్రాజ్యంలో—

యుగాలు పుట్టకముందు పుట్టిన వెలుగు కదలక మెదలక పదునెక్కి - జ్యోతిగా శబలించింది!—

తాను కదిలింది - తపస్సులో మునిగి తేలుతూన్న ఋషులను కదిలించింది.

ఏసునాథుడు ఉదయించాడు :

వస్తున్న ఋషులలో, ఒక్కరికి - అడుగు ముందు పడలేదు :

'బిడ్డ పుట్టినవేళ మంచిది కాదు! ఆ తల్లి లక్షణంగానే పురుడుపోసుకుంది. కాని,- ఎన్నెన్నో ఎన్నివేలమంది బిడ్డలనో పొట్టబెట్టుకుంటుంది - ఆ రాకాసి బిడ్డమొగం చూడను!' అన్నాడు ఋషి.

'రాకాసి బిడ్డకాదు - లోకరక్షకుడు!' అన్నారు తోటివేత్తలు!—

'తన్ను తాను రక్షించుకోలేనివాడు - లోకానికేం రక్షకుడు!'

ఎట్టకేలకు—

ఏసునాథుడు - శిలువమీద బలియిచ్చుకుంటూ—

'తండ్రీ! - అజ్ఞానులు! అందరినీ

క్షమించు -!' అని మననం చేశాడు:

శిలువజాడల్లో జాగరణ చేస్తున్న ఋషి,- కరుకు పీఱుడిగొంతుతో మౌనంగా మంద లించాడు:

అహంకారం అంతం చేసుకునేందుకు ఒక్క జన్మచాలలేదా తండ్రీ!—

పాపులు వేరా - ప్రభువు వేరా?—

తండ్రికి పెద్దకొడుకువై పుట్టి - తమ్ము లను చిన్నచూపు చూస్తావా?—

మరణించేందుకే అవతరించిన వాడవు - నీవు మిగులవు!—

శిలువ మిగులుతుంది - వెనుదిరిగి చూసుకో - మాకూ నీకూ విమోచనకోసం- మరికొన్ని యుగాలు మననం చెయ్యి—!

ఏసునాథుడు - నిశ్చింతగా అస్తమిం చాడు—

* * *

శాక్యముని, పద్మాసన ముద్రలో మన స్సులో సంక్షోభానికి రూపకల్పన చేసు కుంటూ - తనతో తాను సంకుల సమరం చేస్తున్నాడు: మనస్సు పరిపరివిధాల, మార వధువులై,- గగ్గోలుగా నాట్యం చేస్తూంది - ధ్యానభంగమైంది - ఎదుట ఆడుతూన్నది - యశోధర - పాడుతూన్నది - యశోధర - కవ్వింపుగా కనుగీటేది, - యశోధర—

'నేను, తరించాలి!' అని హుంక రించాడు, అన్ని ముద్రలూ విదిలించు కుంటూ గౌతముడు:

'నేను - వరించినప్పుడే తరించాను' అన్నది రాహులమాత.

'అయితే - వదలిపో -'

'వదలిపోయినా - వదిలించుకోలేని అను బంధం!

అమాయకులుగా పెరిగినందుకు,- అర్థం కాని దుఃఖం కబళించింది: వేదనలూ యాత నలూ బ్రతుకైన లోకంలో,- తమ కొక్క రికే శాంతి,- తమ కొక్కరికే నిర్వాణ పథ ప్రాప్తి కావాలని తపించడం, తలక్రిందులు చేసే రాజసంకాని, తరణోపాయం కాదు. అని ఆర్యపుత్రులకు మనవి!'—

గౌతముడు తొణకడు-'దుఃఖం యాతన లేని సుఖం. తలితండ్రులను మ్రింగే రాకాసి బిడ్డ - అన్యోన్యంమాలి, శూన్యం కోసం చేసే సాధనలు ఫలిస్తే జగతికి క్షేమం కాదు.' ప్రబుద్ధుడు - గౌతముడు, శాపం విడిచిన విశ్వామిత్రుడైనాడు. యశోధర - మధురమూర్తులు, శరణులేక, మరగిపోయినవి.

* * *

మధురలో—

వంచిన తల ఎత్తకుండా, తన దోవను తాను పోయే కుబ్జను కృష్ణుడు కవ్వించి నిలి పాడు.

'ఎవరీ సుందరి!'

'నందుని మందలోనిది-కాదు-'

ప తా భి

నిత్యమ్ము ప్రణయ భృత్యమ్ము నలిపి,
రచియించి చనుల మకరాంకు నిలిపి,
ముద్రించి ముద్దుపయి ముద్దు, వింత
యందాలకుప్పయని దేహమంత,
పెరవారికంట పడకుండురీతి
పరిరంభణమున బంధించి ప్రీతి,
ప్రాణాధిపు డుపలాలించుచుండ,
స్వానందసుధల భాండమ్ము నిండ,
సంతోషితాత్మ, స్వాధీనపతిక;
రమణీయ నవ్య లావణ్యలతిక.
రాత్రింబవళ్లు రతిదేవిమోజ,
కావించుచుండి కందర్పపూజ,
తన జీవితమ్ము తగనాటపాట
నిష్కంటకమగు కుసుమంపుబాట,
తన నోముఫలము, ఏలాటిఅతుకు
లేనట్టి మంచి బంగారు బ్రతుకు,
ఆనందసరసి రాయంచసరణి,
విహరించుచుండి మోహాలబరణి,
సంతోషితాత్మ, స్వాధీనపతిక;
రమణీయదివ్య లావణ్యలతిక.
మిథునమ్ము తిరుగు పథసీమ సతము
చీకట్లులేక జ్యోత్స్నాభరితము,
హసియించునపుర, తమనవ్వుతోడ
పులకించి సర్వ భువనాలుకూడ,
ఈ దంపతులకు ఏకమ్ము లోని
ప్రాణమ్ము, దేహములు వేరుకాని;
మధువందు తియ్యదనమట్లు, అలరు
లో తావిపగిది, ప్రియునాత్మనలరు,
సంతోషితాత్మ, స్వాధీనపతిక;
రమణీయదివ్య లావణ్యలతిక.
ఆనందగగన మందుద్భవించి
నటువంటితార, సుఖపున్ విపంచి,
ప్రాణాధిప ప్రణయమద్యమత్త,
ఉద్యాన విహరణాసక్తచిత్త,
పరితోషజలధి పగడాలదీవి,
శోకమ్ము కనని సుఖపూర్ణజీవి,
తనకన్నుసనల దాస్యమ్ము ప్రాణ
పతిచే ముదమున చేయించుజాణ,
సంతోషితాత్మ, స్వాధీనపతిక:
రమణీయనవ్య లావణ్యలతిక.

'సంతరించిన గంధమాల్యాలు ?'

'సంహరించే రసికుడికి!'

—పెనుగులాట లేకుండానే దోచుకో నిచ్చింది కుబ్జ: కృష్ణుడు ఆమెకు, తన చేత నైన వరమిచ్చాడు: శ్యామసుందరుడి కను పాపల్లో, అలముకుంటూన్న అందం ప్రాగ న్నన నిర్లక్ష్యంగాచూసి, నిలువకుండా, పిలుపందని దూరంగా పోతూ, - జాలిగా అనుకున్నది:

'కురూపికి రూపసంపద?-ఎవరి మక్కువ తీరనో? - నాలుగు మోసేదాన్ని, మన్మథ బాణం కాలేను-'

* * *

అలనాడు-

రాతిని నాతిగా చేసినందుకు గౌతముడు వినమ్రుడైనాడు రఘురామునికి: మళ్ళీ మెత్తబడుతూ పాషాణి రోషంతో కణకి పోయింది!

'తల్లిలేని బిడ్డనని ధరణి ఆదరించింది. నగ రాజు కనికరించి తన రూపు యిచ్చాడు. తరించాలని ఎన్నడూ తపస్సు చేయలేదే!- ఎందుకయ్యా ఇన్నేళ్ళకు అవతరించి పాద ధూళితో బ్రతిమాలావు!-దేవరాజుకు, మరో వేయి దీవెనలకా?-ఇదా నీ ఉద్ధరింపు!'—

శబరి అందిచ్చిన పండ్లు-చవిచూసి సమ ర్పించిన పళ్లు శ్రీరామచంద్రుడు కళ్ళకు అద్దుకున్నాడు: అహల్యకు తాను చేసిన అపకారం అప్పటికి అర్థం అయింది—

—మహారాజు-నడచిపోతూ, అడుగు పడేలోపల, అందనిది తనకు అక్కరలేదని అర్థం చేసుకున్నాడు: నిశ్చింతగా తిరిగి వచ్చి, అంతఃపురంలో నిద్రలేచాడు: వందిమాగధులకై వారాలు మారోగ్రుతున్నాయి-

'నా కెందుకీ కైవారాలు: నా కెందుకీ వైభవం!- నేనూ మీలాటి మనిషినే!-' అన్నాడు మహారాజు.

'ఎన్నటికీ కానియ్యం! - మీరు మహా రాజులే!' అని ఆజ్ఞాపించారు ప్రజలు:... మహారాజు నవ్వు ఆపుకోలేక పోయినాడు

# యెన్జీవో సూర్యుడు

ఆరుద్ర



("ఆరుద్ర" ఆధునిక ప్రబంధంలోని అక్కడక్కడి ఘట్టాలు)

## పురవర్ణన:

ఒకరితో ఒకరికి సంబంధం ఉండీ ఉండనట్టు
అంటీ ముట్టనట్టు తెలిసీ తెలియనట్టు జీవిస్తున్నా
ఆధునిక కవిత్వంలోని పద్యపాదాలలాగ కనబడే
ఆధునిక నగరంలోని ప్రజలు ఒకే హారంలోని పూసలు
ఒకే చక్రానికి రేకులు ఒకే జ్యోతియొక్క రోచులు
ఒకే వృక్షం యొక్క ఆకులు కోరికలలో లేవు విభేదాలు
వేదనలో వేసటలో దరిద్రంలో లేవు తేడాలు

ఆర్రోజులు బానిసపడితే ఆదివారంనాడు ఆటవిడుపు
అయినా ఆనాడు వంతెనలు విరిగిపోతాయి తెరచాపలు చిరిగిపోతాయి
ఎండిపోయిన నదిలో ఏ పడవలు నడుస్తాయి?
ఎండిపోయిన నదిలో ఏ పడవలు నడుస్తాయి?
ఏటిగట్టున కన్నాల్లోంచి ఎండ్రపీతలు బయటకొస్తాయి !

బొరియల్లోని నక్కలు కారు, కొండ చరియల్లోని చిట్టెడలు కారు
నగరంలోని పాపులు పులితోలు కప్పుకొన్న సాధుగోవులు
మద్రాసులో మధ్యాహ్నాలను మచ్చిక చేసుకొని చూడు
బొంబాయిలో నీ సాయంత్రాలను బోరవిడుచుకు తిరుగు
కలకత్తా బీరువాని రాత్రులలో కల్మశాన్ని కలయచూడు
రచ్చకెక్కిన నావసాని కోరికల రాజధాని
స్వేచ్ఛ పట్టు తప్పివడిపోయే ఓపికలేని గడసాని.

నగరం నీ ధర్మపత్ని కానేకాదు
ఉంపుడుగత్తె అంతకన్నా కాదు
వానలో తడిసి ముద్దయినా వలపించలేని
పీలికలు కట్టుకొన్న అనాకారి బికారి
పేలవంగానైనా ప్రేమించలేని అణాకాణీ బికారి

ఎండిపోయిన నదిలోని పండుటాకుల గలగల
నేలకొరిగాయి ఎత్తిన పతాకాలు
నేలకరిచాయి పాతిన గుడారాలు
ఎన్నికల ప్రచారంలాగ ఎందుకూ పనికిరాని రాకపోకల్లా
ఎవరూ నమ్మని వాగ్దానాలవలె ఎందుకో తెలియని ట్రా[illegible]కులు

నీ నగరం ప్రొద్దునే ఎదురొచ్చే ప్రశస్తమైన విశ్వస్త
బలవంత పెళ్ళిలోని ముదనష్టపు పెళ్ళికూతురు
మూగి వాడి భావప్రకటన పేడివాడి మూడో పెళ్ళి
ఆడదాని మీసాల్లాగా అసందర్భంగా మొలచిన పేటలతో
గూనివాడి వీపులాగ అసహ్యంగా పెరిగిన పేటలతో
నగరం నిన్ను ఆహ్వానిస్తుంది నగరం నిన్ను ఉంచుకొంటుంది
మందుపెట్టి దక్కించుకొనే పెళ్ళాంలాగ నిన్ను కామిస్తుంది
నగరం నీ ముందరికాళ్ళబంధం, నగరం నీ కాలకూట మకరందం.

నగరం నీలినైలాను చీరల తారురోడ్లు ధరించాలి
తారురోడ్ల చీరలమీద మోటారుల జలతారు కావాలి
పానీయపు టంగళ్ళ ఖరీదైన శాటీను లంగా ధరించాలి
షాపుల గ్లాసువిండోలలో కట్ జాకెట్ తొడుక్కోవాలి
నైటు క్లబ్బుల రమ్యమైన 'న్యూ లుక్ బ్రా' బాడీని బిగించాలి
ఆధునిక రంగేళీ యువతిలాగ నగరానికి మెదడు తక్కువ
షోకు లెక్కువ ఆశయాలు లేని ఆశలూ విలాసాలూ ఎక్కువ
ఇండియా కాఫీహౌసులో పొగిడే మగాళ్ళముందు కూర్చొని
నాజూకుగా సిగరెట్ కాలుస్తూ సుతారంగా కాఫీపీలుస్తూ
రీటా హేవర్త్ ప్రణయాలు జేన్ రసెలు వలయాలు ముచ్చటిస్తూ
టైరన్ పవర్ గురించి కలలుకంటుంది ఆధునిక నగరం
శ్రీమంతుడిని ప్రేమించడానికి ఆశపడుతుంది ఆధునిక నగరం

అయిదంతస్తుల హోటళ్ళ డాబామీది పూదోటలో
వెలుతురు తగ్గించిన ఎలక్ట్రిక్ దీపాల నీలిమసాబులో
పన్నెండుగంటల రాత్రి తరవాత పరిష్వంగ నృత్యంలో
స్లోఫాక్సు ట్రాట్ సంగీతానికి కళ్లుమూస్తుంది నగరం.
డాన్సుఫ్లోరు మూలతిరిగేటప్పుడు నృత్యంలో నిన్నదుముకొంటుంది
నీమీద చూపించిన ప్రేమే టేగుడ్యాన్సులో ఇంకొకడిమీద కూడా
నిష్కారణంగా నిష్కామంగా చూపెట్టే పింజారి నీ నగరం
టాక్సీలో ప్రియురాలిని షికారుకి తీసుకెళ్లు
సోడా ఫౌంటెన్‌లో పీచిమల్బా ఇప్పించు
అందమైన భయానక హాలీఉడ్ చిత్రం చూపెట్టు
జామ్ సెషన్సుకి తీసికెళ్ళి వెర్రిగా జైవ్ చెయ్
నగరం నిన్ను ప్రేమిస్తుంది నగరం నిన్ను ప్రార్థిస్తుంది.

కామ్‌గార్ మైదానంలో కార్మికుల మీటింగుకన్నా
స్టేడియంలో అమెరికన్ పద్ధతి కుస్తీలు చూడండి
జహాంగీరు ఆర్టు గేలరీలో చిత్రకళా ప్రదర్శనం కన్నా
లాయడ్స్ గ్రౌండ్సులో ఫుట్‌బాల్ పందెం వీక్షించండి.
రసికరంజనిలో శాస్త్రీయ పాటకచేరికన్నా
పీపుల్సుపార్కులో బాక్సింగ్ మేచ్ గొప్పది

ఆలిండియా రేడియోలో ఆధునిక సాహిత్యంపై టాకు కన్నా
రేడియో సిలన్‌లో తారలతో గోష్ఠి సరదా వేసేది
లక్ష్మీపురం వైయంఏ లో ప్రముఖుని ప్రసంగం కన్నా
క్లబ్బులో డబ్బువేసి కట్ జోకర్ రమ్మీ ఆడటం గొప్ప
ఇది ఈనాటికి నాగరికత సభ్యత పూజ్యత
ఇది ఈనాటికి నాగరికత సభ్యత పూజ్యత.

## కథానాయకుడి నిష్క్రమణం:

నిరుడు ఉతికిన నీర్కావి ఆదివారాన్ని కుచ్చిళ్ళుపోసి
తొందరగా తొడుక్కున్న శనివారంపై లోతుగా దోపి
తెరపిచ్చిన ముసురు తెరలు తొంగిచూపుకి తగినంతతీసి మూసి
కిరణాలను ఆర్పేసి కిటికీలను వేసి దీపం తగ్గించేసి
ఎన్‌జీవో సూర్యుడు ఏవిటి చేస్తున్నాడు ఏమిటి చూస్తున్నాడు
దూలంక్రింద వ్రేలాడే కాలంతాడు మూడుపేటలుగా ఏల నేస్తున్నాడు
తణిఖీకై దయచేసే అధికారుల రాకకొరకు వేసిన వేషంతో
పట్టపగటి గది చీకటి కరక్కాయ సిరాలోన తర్జని ముంచి కొంచెం దులిపి
గచ్చూడిన పావుతావు పడగ్గది నేలమీద ఏమిటి రాస్తున్నాడు
తుడుపులతో తప్పులతో రచించిన ఈ పిటిషన్ పనికొస్తుందా
ఉతుకులో ఊడిన తారకల కర్రబొత్తాయిల కాళరాత్రి ఆల్పాకాకోటు
హారీబరీలో అడ్డదిడ్డంగా తిరగేసి తొడుక్కొని తీసి మరగేసి
ఉద్యోగం ఊడిన సూర్యుడు ఏవిటి చేస్తున్నాడు ఏవిటి చేస్తున్నాడు
ఏ దొరగారికి దొరికిపోతే ముప్పని భయపడుతూ చూస్తున్నాడు.

## అతడి ఆక్రందన: (బహుశా ఆఖరిది)

అయ్యా మృత్యువుగారూ! పిల్లలవాణ్ణి దయచేసి కనికరించండి
అద్దెకుంటున్న ఈ జీవితం వాటాకి నిజమే ఆదినుంచీ బాడుగ బాకీ
అయ్యా మృత్యువుగారూ! పండుక్కి కోర్కెల గోడలకి వెల్లవేయించండి
పడిపోయిన యావనం పెరటిగోడలు ఈ ఏడైనా మరమ్మత్తు చేయించండి
ఇకమీదట సెక్సుపాపాల పిడకలతో గోడలు ఖరాబు చెయ్యను ఖరారు
నిత్యనైమిత్తికాల వంటింట్లో చూరునుంచి లేమి కారుతూంది చూడండి
కలల పంచనుండికారే సంతృప్తిధార నిద్దుర బిందెలలో పట్టుకోనీండి
అయ్యా మృత్యువుగారూ! పరిస్థితుల పెంకులు తిరగనేయించండి
ఆశయాల ధరలు మండిపోతున్నాయి అద్దె కొద్దిగా తగ్గించండి
దయచేసి తక్కిన వాటాలవాళ్లని త్యాగాల ముగ్గులు పెట్టమనండి
నుయ్యి కొంచెం లోతు చేయించండి పోనీ బురదైనా తీయించండి
ఆ భయం మీ కక్కర్లేదు అందులో మట్టుకు పడి చావను
జ్ఞాపకాల సందుగులు అనుభవాల పరుపులు రోడ్డుమీద పారేకండి
బాబ్బాబూ వచ్చేజన్మలో చూసుకుందాం ఈసారికి ఊరుకోండి
అయ్యా మృత్యువుగారూ! పిల్లలవాణ్ణి కనికరించి కనికరించండి.

# బాధ కవిత్వానికి పర్యాయపదం

శ్రీరంగం శ్రీనివాసరావు

చక్కని పద్యాలు రాసి నీకు వినిపించాలనే చవితినాడు, ఆ కుర్రాడు చాలా బాధపడుతున్నాడని వినీ వినగానే నాకేదో వేదనా, అణులేశం ఆవేశం ఆమట్టునే ఆగ్రహం వచ్చి, అటువంటివాళ్ల అవస్థలమీద ఖర్చు పెట్టడానికి నాదగ్గర కన్నీళ్ళు లేవన్నాను.

బాధపడడం చేతకానివాళ్లు పద్యాలు రాస్తే, బాధపడడం భరించలేనివాళ్లు పద్యాలు చదివితే, పద్యాలు అందులోకీ యతిప్రాసల్లేని అర్థంలేని పద్యాలు రాసి బాధపెడడం, అర్థంలేని బాధపడడం, యతిప్రాసల్లేని బాధపెడడం అన్నాన్నేను.

ఆ కుర్రాడు నాదగ్గరికి వచ్చిన మాట నిజమే. పద్యాలు చదివిన మాట నిజమే. నేనతణ్ని పొమ్మన్న మాటా నిజమే. ఎందుకు పొమ్మన్నానో చెప్పడానికే ఈ కథ.

కథా అన్నాను? సంఘటనల్లేని సంచలనంలేని కర్త కర్మ క్రియల్లేని కథనాన్ని కథనడం ఎలా? ఇప్పుడే చెబుతున్నానిందులో ఒక పూరిల్లు గాని. పచ్చకర్పూరం కాని, చివరికొక సిగరెట్టు కాని తగలెట్టేటప్పుడు బయల్దేరే పొగలో కనిపించే కదలిక పాటిదికూడా ఈ రాతలో మీకు కనబడదు. మెదడు తగలబడిపోయేటప్పటి పొగ కాని, పొగ కదలనట్టు కనిపించే కదలడం, జరగనట్టు కనిపించే జరగడం ఇందులో చూపించాలని ఎందుకో ప్రయత్నం.

నీ తరువాతి తరం యువకవి నీదగ్గరికి వచ్చినప్పుడు నిర్దాక్షిణ్యంగా పొమ్మన్నావు. అతని పాటలోని బాధ నీ కళ్ళ వెనక నీళ్ళలో ఈదుతోందని నీకు బాగా తెలుసు. అయినా పొమ్మన్నావు, ఉప్పెనగా ఉద్గమించబోతూన్న కన్నీళ్ళను అటకాయించి!

“అపాయానికి ఇటూ దారి” అని ఎక్కడైనా ఎవరైనా ఒక హెచ్చరికను ప్రతిష్ఠిస్తే ఎంత బాగుండును! అప్పుడు మనం అంతమందిమీ అటు వెళ్ళడం మానేద్దుము.

మానేస్తామా? ఏమో అబ్బా! నామట్టుకు నేను అపాయాలని అన్వేషించడంలోనే ఆనందం పోగుచేసుకుంటాను. ఇంకా ఎందరో ఉన్నారు ఇలాంటి నాలాంటి వాళ్లు. అపాయం స్వభావాన్ని అనుభవంలోకి తెచ్చుకోవాలంటారు వాళ్ళు. నిషేధాలు విధిస్తూ నిలబడే పోలీసుబలం నిరుపయోగం వీళ్ల విషయంలో.

అపాయం బోర్డుకట్టి అటు వెళ్ళకుండా ప్రజల్ని శాసనాలద్వారా అరికట్టి అపాయానికి ఇవతలివేపు క్షేమాన్ని వెదజల్లడానికి ప్రభుత్వాలన్నీ కృషిచేస్తూనే ఉంటాయి. కాని ఏం లాభం? అవతల ఏముందో చూడడానికి మానవునిలో కుతూహలం ఉన్నంతకాలం బోర్డుచేసే హెచ్చరిక నిశ్శక్తం నిర్వీర్యం.

సుమతిశతకం స్తవనీయమే. సెన్సారు బోర్డు అభిలషణీయమే. శాసనసభ అవశ్యం గౌరవనీయమే. అయితేనేం? అపాయానికి గల ఆకర్షణని నేను కొనియాడడం మానలేను.

ఈ కుర్రాడున్నాడే వీడు అపాయాల స్వభావం కనిపెట్టాలనే ఉబలాటం ఉన్నవాడు. ఆ పద్యాలు చదివినప్పుడే తెలిసింది నాకా సంగతి. పద్యాలుగా అవి బాగానే ఉన్నాయికాని అవి బతకవని నాకు తెలుసు. ఎందుకో చెప్పనా?

ఒకసారి నేను చాలా ప్రమాదకరమైన పరిస్థితిలో చిక్కుకున్నాను. ఎవరిదో అరచెయ్యి, దానిమీద ఒక గుండుసూది అంటీ అంటనట్టు నిలబెట్టి ఉంది. దానిమీద నేను ఒంటికాలిమీద నిలుచున్నాను. అంతవరకు బాగానే ఉంది. అటువంటి సర్కస్ ఫీట్లు నేను సునాయాసంగా సాగించగలను. ఇక దిగిపోదామనుకుంటూన్న సమయానికి నా నెత్తిమీద గ్రంథాలయాల దండయాత్ర ప్రారంభమైంది. ఎంత బరువుందో ఇప్పుడు జ్ఞాపకం లేదు గాని ప్రపంచ కవుల రచనల సంపూర్ణ సంపుటం నా తలమీద వచ్చి వాలింది. దానిమీద నానా భాషల నిఘంటువులు. ఉగాదిసంచికలు ఒత్తుకున్నాయి. ఇంకా ఇంకా మీదిమీదికి పోనుపోను అనంతంగా అనేక గ్రంథాలు. షేక్స్పియరు సమస్త రచనల మేలు ముద్రణం వ్యాఖ్యాన గ్రంథాలతో సహా నోస్ డైవ్ చేసినప్పుడు నా మెదడులో అణువు బద్దలైనట్టయింది. ఆకాశంవేపు పెరిగిపోతూన్న గ్రంథాలభారం నన్ను క్రుంగదీస్తోంది. అంతసేపూ ఒంటికాలుతో గుండుసూదిమీద నిలబడే ఉన్నాను. గుండుసూదిని కదలకుండా నిలబెట్టగలిగినవాడి చాకచక్యానికి తీసిపోకూడదని పౌరుషానికి నిలుచున్నాను భారబాధ భరిస్తూ. కాలైనా మార్చుకోడానికి వీల్లేదు. నా నెత్తిమీద ఎన్ని పుస్తకాలున్నాయో స్పష్టంగా తెలియదు. వాతావరణంలోని వివిధ పరిమళాలను చర్మంతో పీలుస్తూ గ్రంథాల పేర్లు పోలుస్తున్నాను. మధ్యమధ్యని ఎక్కాల పుస్తకాలూ అచ్చుతప్పులతో నిండి అణాకీ అర్ధణాకీ అమ్ముడుపోతున్న చవకబారు పుస్తకాలూ గుచ్చుకుంటున్నాయి. అమూల్యమైన తాటాకు గ్రంథాలతో తంజావూరు లైబ్రరీ నా నెత్తిమీద పడింది. తామ్రశాసనాలూ శిలాశాసనాలూ తగులుతున్నాయి. నా రక్తనాళంలోని నెత్తురు వాటి ఒత్తిడిని అనుభవిస్తోంది.

నామీద గ్రంథాలూ నాకింద గుండుసూదీ! ఏ తెలియరాని గణితశాస్త్రసూత్రం వల్లనో అవి నిలబడి నన్ను నిలబెట్టాయి.

అరచెయ్యి అభయహస్తం. పడిపోతానని భయంలేదు గాని పాడడానికేమీ తోచలేదు. పాడాలనే బాధమాత్రం పొడుస్తోంది. ఏదిపాడినా ఈ పుస్తకాల సారమే. జీవితానుభవమే కావ్యవస్తువు కావాలని నాకప్పటికింకా తెలియదు.

ఈ ఇరుకు పరిస్థితిలో చిక్కుకొని ఏదో పాటపాడాను. ఆ పాట చాలా మందిని ఆకర్షించిందికూడా. అరచేతి కిరుపక్కలా ఉన్న అగాధమైన లోయల్లో తండోపతండాలుగా క్రిక్కిరిసిపోయిన ప్రేక్షక జనం అయిదునిమిషాల ఇరవై సెకండ్లసేపు కరతాళధ్వనులుచేసి నా పాటని అభినందించారు.

ఆ పాటకి ముగ్ధుడైపోయాడు ఈ కుర్రాడు. దానికి అందమైన అనుకరణలు తయారుచేశాడు. అదీ నాకోపం. అందుకే అతణ్ని పొమ్మన్నాను. అందుకే అతని పాటలు బతకవన్నాను.

నువ్వు స్వయంగా అపాయాల్లోకి వెళ్లు. ఎరువు తెచ్చుకున్న అభిప్రాయాల్ని తగలెట్టడానికి వీలుగా ఒక అగ్గిపెట్టె నీతో తీసుకువెళ్లడం మరిచిపోకు. గుండుసూదిమీద ఒంటికాలితో నిలబడడం గొప్ప మాటే. కాని అదే అంత గొప్పా కాదు. ఇంకో కవి - ఎంత గొప్పవాడైనా - నువ్వు వాడివి కావాలని ప్రయత్నించకు. ఇన్నాళ్ళూ నువ్వు అర్థానుస్వారంలాగ ముద్రాసురుడిలాగ బతికేవు. పేపర్ వెయిట్ లాగ, రబ్బర్ స్టాంప్‌లాగ బతికేవు. వెళ్ళు జీవితంలోకి!

రెండోరకం పద్యంలోకూడా బాధ ఉంటుంది. కాని అది బతికే బాధ కాదు. బతికించే బాధ కానేకాదు. ★



# గంజికేంద్రం

## కొడవటిగంటి కుటుంబరావు

"అవ్వగారూ, మీరు అన్నం అత్తిసరు పెడతారా, వారుస్తారా?"

"పొద్దున వారుస్తా, నాయనా. రాత్రి అత్తిసరు పెడుతున్నా. ఏం?"

"మరేం లేదు. వార్చిన గంజి ఏం చేస్తారు? కుడితి తొట్లో పొయ్యటానికి గొడ్డూ గోదా లేదుగా?"

"గంజిపట్టడం కూడానా? తూములోకి వాకేస్తా."

"అట్లా అయితే ఒక పని చేస్తారూ?"

"ఏమిటి, నాయనా?"

"ఇవాళనుంచీ మీరు అన్నంవార్చనీళ్లు దేనిలోకన్నా పట్టి నాకిస్తూఉండండి."

"నీకా?"

"మరేం లేదు. ఆమధ్య రాయలసీమలో నడిపిన గంజికేంద్రాలున్నాయి చూడండి. అవి అంత సంతృప్తికరంగా లేవనీ, వాటిని గురించి కొంత పరిశోధన జరగాలనీ మా ఆఫీసరుగారంటున్నారు. నేనూ మరికొందరమూ కలిసి పరిశోధనలు జరుపుదామని!"

"దానికేం భాగ్యం, నాయనా? అట్లాగే ఇస్తాలే!"

తన నాయనమ్మకూ, తమ వెనక గదిలో అద్దెకుంటున్న శ్రీనివాసరావుకూ మధ్య జరిగిన ఈ సంభాషణ యావత్తూ పంకజం విన్నది. ఆమెకు కోపం వచ్చింది.

అతన్ని చూస్తే ఆమెకు తరుచు కోపమే వచ్చేది. కారణం ఆమెకే తెలీదు. అతను తనకు గాని ఇతరులకు గాని ద్రోహం ఏమీ చెయ్యలేదు. వీలయితే సహాయం కూడా చేసేవాడు. ఎన్నో సార్లు లైట్లను ఫ్యూజ్ పోతే వేసి పెట్టాడు. ఒకసారి చెడిపోయి ఆరిపోయిన బల్బును మళ్ళీ వెలిగేట్టు చేశాడు కూడా. చదువులో ఎప్పుడైనా తనకు సహాయ పడతాడు. ఆ విషయం అతన్ని గురించి ఆక్షేపణ ఏమీ లేదు. అద్దె సరిగా ఇచ్చేవాడు కాడు నిజమేగాని ఆ విషయం పంకజాన్ని అంత బాధించేది కాదు. ఏ బుద్ధినఉండో తన తండ్రి ఈ శ్రీనివాసరావు కా గది ఇచ్చాడు గాని అంతకు పూర్వం అది తమకిందనే ఉండేది. పనికిరాని సామాన్లు అందులో పడేసేవాళ్లు. శ్రీనివాసరావుకోసం స్నేహితులు వస్తూండే వాళ్లు. రోజుల తరబడి వెళ్లేవాళ్లు కారు. అందువల్లకూడా పంకజానికి బాధలేదు.

శ్రీనివాసరావుమీద పంకజానికి అప్పుడప్పుడూ వచ్చే కోపానికి కారణం అనుమానం. ఆరు నెలలనుంచీ అతను తమ ఇంట్లో ఉంటున్నప్పటికీ అతన్ని గురించి పంకజానికి స్పష్టంగా ఒక్క విషయమైనా తెలియదు. అతను ఏ ఆఫీసులో పనిచేస్తున్నాడు? అతని జీతం ఎంత? ఏ హోటల్లో తింటున్నాడు? అసలతని దేవూరు? ఇలాటి చిన్న ప్రశ్నలకు కూడా పంకజానికి సరి అయిన సమాధానాలు తెలీవు. ఆమె తండ్రికి ఇలాటి వివరాలు తెలుసుకోవటంలో ఆసక్తి లేదు. తానే అడిగితే అతను అర్థం అయీ కాకుండా చెప్పేవాడు. అతను చెప్పేది ఒక్కటీ విశ్వసనీయంగా కనపడేది కాదు. వచ్చిన కొత్తలో శ్రీనివాసరావు తాను ఏదో ఆఫీసులో రికార్డు కీపరుగా పనిచేస్తున్నా నన్నాడు. ఆమధ్య మాటల సందర్భంలో తాను అప్పర్ డివిజన్ క్లర్కు నన్నాడు. రికార్డు కీపరు పని ఏమయిందంటే అది రెండు నెలల క్రితమే అయిపోయిం దన్నాడు. పర్యవసానం, పంకజానికి రెండూ అబద్ధమే నని తోచింది. ఒక నాడు అతనూ మరొక మిత్రుడూ కలిసి గదిలో వంటపెట్టటం చూసింది. ఇదేమిటంటే తాను భోంచేసే హోటల్లో ఒకడు కలరా తగిలి చచ్చాడనీ, హోటలు మూశారనీ చెప్పాడు. ఆ సంగతి తనూ విన్నది, అందుచేత నిజమేనని నమ్మగలిగింది. కాని ఇంకా పట్నంలో ఎన్ని హోటళ్లు లేవు? ఈమాటంటే, "ఏ హోటలునూ నమ్మటానికి లేదు," అన్నాడు శ్రీనివాసరావు.

"నమ్మటానికి లేంది హోటళ్లనే కాదు—నిన్ను కూడా," అనుకున్నది పంకజం... వంటపెట్టినవాళ్లు కూరలోకి పోపుగింజల సంగతికూడా ఆలోచించకుండా మొదలుపెట్టారు. తాను వెళ్లి వాళ్లకు సహాయం చెయ్యటమే గాక మినప్పప్పూ, ఆవాలూ, ఇనపగరిటే, కత్తిపీటా వాళ్లకి అరువివ్వాలిసి వచ్చింది!

పంకజం అతని గదిలోకి వెళ్లటం అదే మొదటిసారి. గదిలో ఆట్టే సామాను లేదు. కుప్పతెప్పలుగా పుస్తకాలున్నాయి. గదిని బట్టి శ్రీనివాసరావు రహస్యాలేమీ ఆమె గ్రహించలేకపోయింది. అతనికి ఆట్టే బట్టలు లేవని మాత్రం తెలుసుకున్నది. అతను బయటికిపోతూ లోపలికివస్తూ కనిపించినప్పుడు బాగానే డ్రెస్ చేసుకున్నట్టు కనపడేవాడు. రెండు మూడు రకాల దుస్తులున్నట్టు కనబడేవాడు. అతనికున్నవే రెండుమూడు జతలని ఆమె ఊహించలేదు. ఆ సంగతి ఇప్పుడామెకు తెలిసింది.

ఈ ఆరునెలల కాలంలో అతను రెండుసార్లు టైముకు అద్దె ఇవ్వలేకపోయాడు. ఒకసారి తన చెల్లెలు డబ్బుకోసం రాస్తే దగ్గర ఉన్నదంతా పంపేశానన్నాడు. మరోసారి తన మేనగోడలు పెనిమిటిని ఆదుకోవాలి సొచ్చిందన్నాడు. రెండుసార్లూ అతని మాటలు పంకజం చెవులకు అబద్ధంగానే వినిపించాయి. అయినప్పటికీ అతను డబ్బుకిబ్బంది పడేవాడిలాగా ఎన్నడూ కనిపించలేదు. ఈ నెల అద్దె ఇవ్వకపోతే వచ్చేనెలలో రెండునెలల అద్దే ఇచ్చేసేవాడు. సంపాదన తక్కువ గనక పొదుపుగా జీవిస్తూ వచ్చాడేమోగాని, చేబదుళ్లు తీసుకుని ఎగగొట్టే గర్భదరిద్రుడుగా అతనెన్నడూ కనిపించలేదు.

ఇప్పుడు గంజి కావాలంటున్నాడు, గంజి పరిశోధనలంటున్నాడు. ఇటువంటి కబుర్లు వినేవాళ్లకి అబద్ధాలుగా వినిపిస్తాయని అతనికి తెలీదో, లేక తన చెవులే పాడునో అనుకున్నది పంకజం.

## 2

నాలుగురోజులు గడిచాయి.

"ఏమండీ, అవ్వగారూ, ఇవాళ అత్తిసరు పెట్టారల్లే ఉందే?"

# ★ గంజి కేంద్రం ★

"లేదు, నాయనా! గంజివార్చా. మా పంకజం బట్టలకు పెట్టాలని తీసుకుంది. అంతగా అయితే రాత్రికి అన్నం వారుస్తా లే."

"పోనివ్వండి. తొందర ఏమీ లేదు. అవ్వగారూ, పైత్యానికి ఏం తింటే మంచిది?"

"నీకేనా, నాయనా? నోంట్లో సరిగా లేదా?"

"ఏమీ లేదండీ. కడుపులో తిప్పుతోంది. ఈపూట మానే దామనుకుంటున్నాను."

"పాత ఉసిరికాయి ఉంది. అది వేసుకుని రెండుముద్దలు తిను. అసలే నీరసంగా ఉన్నట్టున్నావు. ఏమీ తినకపోతే నీరసపడిపోతావేమో?"

"పచ్చడి ఇప్పించండి. దాంతోనే రెండుముద్దలు తిని ఇంత చారన్నం తిని వచ్చేస్తాను."

"ఈభాగ్యానికి హోటలుకెందుకు పోతావు నాయనా? కాస్త అన్నం నే పెడతాలే. రెండునిమిషాల్లో చారు పెట్టిస్తా"

"అన్నీ అబద్ధాలు! అన్నీ అబద్ధాలు!" అనుకున్నది పంకజం ఈమాటలు వింటూ. తనకూ, ఈ శ్రీనివాసరావుకూ మధ్య ఏదో కష్టాష్టకం! అతను ఏంచెప్పినా తన చెవులకు పచ్చి అబద్ధాలుగా వినపడవలసిందే!

మరో అరగంటకు అవ్వ, "పంకజం?" అని పిలిచింది.

పంకజం వంటింట్లోకి తొంగిచూసి, "ఏం?" అన్నది.

"ఆ అబ్బాయిని అన్నానికిరమ్మనమ్మా."

పంకజం శ్రీనివాసరావుగదిలోకి తొంగి చూసింది. అతను నిద్రపోతున్నాడు. కనీసం పంకజానికి మొదట అట్లా కనబడింది. మరుక్షణంఏకంగా అతనుచచ్చాడనే అనుకున్నది —అతను ఊపిరికూడా పీలుస్తున్నట్టులేదు! అతనిపై తనకుగల అనుమానాన్ని కట్టిపెట్టి దగ్గిరికివెళ్ళి చూసింది. సాంతం చావలేదని రూఢి చేసుకున్నది. "ఇదుగో, ఏమండీ?" అని పిలిచింది. అతను పలుకలేదు. మొహం చూటానికిపోతే లాభంలేదని చేత్తో తట్టింది. శ్రీనివాసరావు కళ్ళు తెరిచాడు.

"అన్నానికి వస్తారా?"

"విస్తట్లో కాస్త తెచ్చిపెట్టు. కొంచెం సేపుండి తింటాను," అన్నాడు శ్రీనివాసరావు మళ్ళీ కళ్ళు మూసుకుంటూ.

ఈ సందేశాన్ని పంకజం అవ్వకు అందజేసింది. అవ్వ విస్తరినిండా చేసినవన్నీ వడ్డించి పంకజాన్ని తీసుకుపొమ్మన్నది.

"అన్నం వొద్దో అనేవాడికివన్నీ దేనికి?" అన్నది పంకజం.

"అన్నీ ఎక్కడే? ఒకచుక్క దోసకాయ పప్పూ, ఒకచుక్క కాకరకాయ కూరా! తినకపోతే వొదిలెయ్యనీ.. మొదటి ముద్దమటుకు ఉసిరికాయ తినమను. గాజుగ్లాసులో చారు పట్టుకుపో. కాస్త నెయ్యీ, మజ్జిగా కూడా పెట్టిరా."

తన వంట ఎంతమంది మెచ్చుకుంటే అవ్వగారికి అంత సంతోషం. శ్రీనివాసరావు గంజి పరిశోధనలు చేస్తున్నా నన్నప్పుడు తానుకూడా సహాయం చేస్తానంటామని ఆవిడకు నోటిదాకా వచ్చింది. ఒక గంజినేకాదు గడ్డినికూడా రుచిగా తయారు చెయ్యొచ్చు చేతి తీరు బాగుండాలేగాని?

## 3

పంకజం తండ్రి ప్రసాదరావుగారు భోంచేస్తున్నాడు. తల్లి వడ్డిస్తున్నది. పంకజానికి సంబంధం గురించి మాట్లాడుతున్నాడు.

"కుర్రాడిక్కడే డాక్టరీ చదువుతున్నాడు. తల్లిదండ్రు లిద్దరూ చిన్నతనంలోనే పోయారుట. పెద్దఅన్న పెంచాడు, చదివిస్తున్నాడు. కుర్రాణ్ణికూడా చూశా. ఫరవాలా. బాగా నేఉంటాడు," అన్నాడు ప్రసాదరావుగారు.

"పోనీరా. అంతగా అయితే పెళ్ళయినాక మనింట్లోనే ఉంటాడు. నేను మారీ అంటే పిల్లేకాదుట్రా నీకు ఆడదిక్కు? నీ కూతురూ, నీ అల్లుడూ నీ దగ్గిరే ఉంటారు, సరిపోతుంది. పప్పు కుదిరిందట్రా, నాయనా?"

"కుదరటమేమిటమ్మాయ్? అద్భుతంగా కుదిరింది."

"అట్లాగుట్రా, నాయనా. చెవగొట్టా నేమో ననుకున్నాను సుమా. మరేంలేదు ఉప్పు జాస్తివేశా ననిపించింది. పప్పేమో ఎంతకీ ఉడకలా."

"ఒక్కనాటి కనుకోకు. దివ్యంగా ఉంది. ఏదీ ఇంకొక్క చుక్క వెయ్యా."

మరికొంచెం పప్పువేయించుకుని కలుపుకుని ముద్ద నోట్లో పెట్టుకోబోతున్న ప్రసాదరావు ఆగి, "ఎవరో వాంతి చేసుకుంటున్నట్టుందే?" అన్నాడు.

"ఆ శ్రీనివాసరావల్లే ఉంది." అన్నది పంకజం.

"ఇదేం ప్రారబ్ధం? ఊరినిండా కలరా! ఒసే, నువ్వెళ్ళకు."

కాని పంకజం అప్పుడే దొడ్లోకి పరిగెత్తింది. శ్రీనివాసరావు తిన్న అన్నమంతా వాంతిచేసుకున్నాడు. కడుపు అంత బాగాలేనివాడు పెట్టినదంతా ఎందుకు తినాలి? అతనిమీద ఆమెకు కోపమూ, అసహ్యమూ కలిగాయి. అరగనిది తినేవాళ్ళూ, చాతగాని పనికి పూనుకునేవాళ్ళూ అంటే ఆమెకెందుకో మంట.

ఈ మంటలో కూడా శ్రీనివాసరావు లేవలేనిస్థితిలో ఉన్నాడని తెలుసుకున్నది. దగ్గిరికి వెళ్ళి పట్టుకుని లేవదీసింది. గదివాకిట్లోకి తెచ్చి కూచోబెట్టి పుక్కిలించటానికి కాసిని నీళ్ళిచ్చింది.

"శ్రమ ఇస్తున్నాను," అన్నాడు శ్రీనివాసరావు అస్పష్టంగా.

"అన్నం తినకుండా మానేస్తే సరిపోయేది," అన్నది పంకజం.

"అప్పటికీ మానేశాను," అన్నాడు శ్రీనివాసరావు లేచి గదిలోకి వెళ్ళటానికి యత్నిస్తూ.

"జబ్బేమిటో డాక్టరుకు చూపించరాదూ?" అన్నది పంకజం.

"వద్దు, వద్దు! డాక్టరేం చేస్తాడు? జబ్బేమీ లేదు," అన్నాడు శ్రీనివాసరావు కంగారుగా.

కాని ప్రసాదరావుగారు పటుబట్టి డాక్టరును పిలిపించాడు. శ్రీనివాసరావుకు కలరా కాదని తేల్చుకునేదాకా ఆయనకు నిద్రపట్టేట్టు కనపడలేదు.

డాక్టరు వచ్చి శ్రీనివాసరావును పరీక్షించాడు. కలరా కాదన్నాడు. నీరసం తప్ప మరే జబ్బూ లేదన్నాడు. పాలూ, పళ్ళూ, మంచినీళ్ళలో గ్లూకోసూ ఇమ్మన్నాడు. ప్రసాదరావుగారు డాక్టరుచెప్పినవన్నీ తెప్పించాడు, పంకజం వాటిని శ్రీనివాసరావు గదికి చేర్చింది.

శ్రీనివాసరావు పంకజాన్ని చూడగానే లేచి కూచున్నాడు. అతనింకా నీరసంగానే ఉన్నాడు గాని అతని మొహంలో దైన్యం లేదు.

"ఎందుకివన్నీ ఈ గంజికేంద్రంలో?" అన్నాడతను.

పంకజానికి అర్థంకాలేదు. "డాక్టరుగారిప్పించమన్నారు. వద్దా?" అన్నదామె.

"ఇస్తే మహారాజుగా తీసుకుంటాను. కాని నాకు కావలిసిందిమటుకు ఇదికాదు."

"మరేమిటి?"

"శ్రీనివాసరావు నీరసంగా చిరునవ్వు నవ్వాడు.

"ఉద్యోగం! డబ్బు! తిండి! నాకే పొట్టమీద అన్నం తింటే ఇమడలేదు. అనవసరంగా డాక్టరును పిలిపించారు... మీకందరికీ నిష్కారణంగా శ్రమ అయింది."

తన జీవితంలో మొదటిసారి పంకజం ఇతని మాటలు నమ్మగలిగింది. ఆమె అతనికి కాసిని వేడిపాలు తాగటానికిచ్చి బత్తాయి ఒకటి వొలుస్తూ, "ఈ ఉద్యోగాలన్నీ అబద్ధమేనా?"

"అబద్ధం కాదు. నేను మద్రాసు సెక్రెటేరియట్‌లో పని చేశాను. ఆంధ్ర రాష్ట్రంతోబాటు కర్నూలుకు వెళ్ళాను. డేరాల్లో మకాం పెట్టాను. మా డేరాలో మొదట అయిదుగురం. ఒకడు రెండోరోజే ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి వెళ్ళాడు. మరి ఇద్దరు ఎవరినో పట్టుకుని మంచిచేసుకుని మా కొంపు కన్న మంచికొంపులోకి వెళ్ళిపోయారు. నాకు జ్వరంవచ్చి వొళ్ళు తెలియకుండా పడిపోయాను. బతికొన్నా, చచ్చానా అని అడిగినవాళ్ళు లేరు. మందూ లేదు, మంచినీళ్ళూ లేవు. వారంరోజుల అవతల నాకు జ్వరం తగ్గేసరికి నా సామానంతా మాయమయింది. నా ఆఫీసు పని మాత్రం నాకోసం పేర్చిఉంది. రాత్రింబగళ్ళు పనిచేసి ఆపని పూర్తి చెయ్యమన్నారు. ఆదివారాలు కూడా శెలవు తీసుకోవటానికి లేదన్నారు. రాజీనామా ఇచ్చి వచ్చేశా. ఇక్కడికి వచ్చాక ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజివాళ్ళు రెండు టెంపొరరీ ఉద్యోగాలిచ్చారు. నెలనుంచి ఊరికనే ఉన్నా. వారంనుంచీ తిండిలేదు. నాకు ఉద్యోగంలేదనీ, తిండి లేదనీ ఎవరితో మొరబెట్టుకోను? ఎవరిని చేబదుళ్ళడగను? ఒకనెల అద్దె నాలుగురోజులాలస్యంగా ఇస్తేనే నేను మీకంటో తేలికయిపోతానే? స్నేహితులదగిర చేబదుళ్ళు తీసుకుని ఇవ్వకపోతే ఏమవుతాను?"

"అవును, నిజమే," అన్నది పంకజం.

## 4

"ఏం, నాయనా? కాస్త లేచి ఎంగిలి పడతావా?" అన్నది అవ్వగారు గదిలోకి తొంగిచూసి.

శ్రీనివాసరావు గోమ్ముమీద పుస్తకం పెట్టుకుని పడుకుని ఏదో ఆలోచిస్తున్నాడు. గదిలో దీపం వెలుగుతున్నది.

"ఎందుకులెండి?" అన్నాడతను.

"ఎందుకేమిటి, నాయనా. నీకోసం తేలిగ్గా చేశా."

శ్రీనివాసరావు లేచాడు. అవ్వగారి వెంట వెళ్ళాడు. అవ్వగారు వంటింట్లో అతనికి పీటవేసి కూచోబెట్టింది.

"ఎవరూ ఇంట్లో లేనట్టున్నారే?" అన్నాడు శ్రీనివాసరావు.

"అమ్మాయికి ఏదో సంబంధంట. తండ్రి



"పండుగకు గాజులు"

ఎ. వి. ఎస్. ఆర్. జోస్యులు, (మంగళగిరి).

# గంజి కేంద్రం

కూతుళ్ళిద్దరూ చూడవచ్చారు. మొన్నటి శ్రావణ పౌర్ణమికి పదిహేడుకూడా వెళ్లాయి, పెళ్ళి చెయ్యొద్దా, నాయనా?" అన్నది అవ్వగారు వడ్డిస్తూ.

"కొంచెంగా పెట్టండి. అన్నానని కోప్పడకండి, అవ్వగారూ. మీ మూలంగానే నాకు పొద్దున అంత గొడవయింది."

"అదేమిటి, నాయనా?" అన్నది అవ్వగారు ఆదుర్దాగా.

"చాలా కొంచెంగా తిందామనుకున్నానుగాని, మీ చేతి మహాత్మ్యమేమిటో ఏదీ వదిలిపెట్ట బుద్ధికాలేదు. మరి కాకరకాయకూర చూశారూ? నా జన్మలో ఎన్నడూ అంత రుచిగా చేసిన కాకరకాయకూర తినలేదనుకోండి."

అవ్వగారి మొహం ఆనందంతో వికసించింది.

"కాకరకాయకూర బాగా కుదరాలా మరి?" అన్నదావిడ.

"బాగా అని మెల్లిగా అంటారేమిటి? నే నసలు కాకరకాయ నోటపెట్టను. అటువంటివాణ్ణి అపురాపురని తినేశాను. అంతా వాంతి అయిపోయింది. ఈ పూటైనా తేలిగ్గా తిననివ్వండి."

"ఏచ్చే, అసలు చేసిందేముందీ? కాస్త వెల్లుల్లి కారప్పొడీ, ఇంగువ చారూనూ. అన్నట్టు బచ్చలకూర పెసరపప్పులో వేశా. ఒక్కరవ్వ నాలిక్కి రాచుకుచూసి ఎట్లా ఉందీ చెబుతావూ?"

"వద్దులెండి."

"ఎంత, నాయనా, ఒక్క ముద్దంటే ఒక్క ముద్ద కలిపిచూడు."

"అద్భుతం! మీరు నలమహారాజును చంపిపుట్టారవ్వగారూ!"

లేదులేదంటూనే అవ్వగారు శ్రీనివాసరావుచేత చేసిన వంటకాలన్నీ తినిపించింది. ప్రతిదీ అద్భుతమే అన్నాడు శ్రీనివాసరావు.

"నువ్విట్లా అంటున్నావా? మావాడికొక్కడికీ నా వంటంటే ఎంతో ఇష్టం. నా మనవరాలికి మటుకు ఒకటీ నచ్చదు. ప్రతిదానికీ ఏదో వంక పెడుతుంది."

"ఒక్కొక్కళ్ళ తీరు!" అన్నాడు శ్రీనివాసరావు.

"బాగా చెప్పావ్," అంది ముసలావిడ.

తండ్రి కూతుళ్లు ఇంటికి తిరిగి వచ్చేసరికి తొమ్మిది దాటింది.

"ఆయన కన్నం పెట్టావా?" అని అడిగింది పంకజం అవ్వను చూస్తూనే.

"అతను తిని వెళ్ళి ఏ ఝామయింది? అయితే ఇంతకూ పెళ్ళికొడుకును చూశారుట్రా?" అన్నది అవ్వగారు.

"ఆ, చూడకేం?" అన్నాడు ప్రసాదరావుగారు.

"ఏమయిందేం?" అన్నది తల్లి.

"ఆయనకు పదివేలు కట్నం కావాలిట"

"ఆకలేస్తున్నది, అన్నం పెట్టవమ్మా," అన్నది పంకజం మాట మార్చటానికల్లే.

"పది వేలే!" అన్నది అవ్వగారు ముక్కుమీద వేలేసుకుని.

"అన్నం పెట్టమ్మా అంటూంటే?" అన్నది పంకజం చిరాగ్గా.

"ఆ! పది వేలతో ఇద్దరల్లుళ్లను కొనుక్కోవచ్చు," అన్నాడు ప్రసాదరావుగారు.

అన్నంముందర పంకజం రుసరుసలాడుతూనే ఉంది "ఏమిటే బచ్చలకూరపప్పు ఇట్లా పాడుచేశావ్......ఇది చారా కషాయమా?" అంటూ వంకలు పెట్టింది.

"ఒసే, నీకన్న ఆ అబ్బాయి ఎంత నయమే! అన్నీ అద్భుతంగా ఉన్నాయని తినేశాడు. నిజంగా ఎంత బుద్ధిమంతుడు! దీన్ని అటువంటివాడికిచ్చి ఇంట్లో పెట్టుకోరాదుట్రా? చిలకా గోరింకల్లే ఉంటారు?" అన్నది అవ్వగారు.

కాబోయే డాక్టరుగారి నిక్కు, నీలుగూ, బెట్టూ, భోషాణమూ ఇంకా మరిచిపోలేకుండా ఉన్న ప్రసాదరావుకు ఈ ఆలోచన దివ్యంగా కనిపించింది. ఆయన కూతురుకేసి చూశాడు. పంకజం ఏమీ విననిదానల్లే బాగాలేదని ఆక్షేపించిన పప్పుకూరే అపురాపురని తినేస్తున్నది. ★



# ఆశ ఖరీదు అణా

## గోరా శాస్త్రి

(మహానగరంలో ఒక గల్లీలో జనసమ్మర్దం ఎక్కువగా ఉన్నట్లు సూచించే ధ్వనులు. మోటార్లు, గుర్రం బళ్లు, సైకిళ్లు, రకరకాల వాహనాలధ్వనులు, ఇంకొంచెం దూరంలో-గాలిలో తేలివస్తున్నట్లు చర్చి గంటలూ - దేవాలయం గంటలూ వినిపిస్తాయి. ఇవన్నీ కలిపి - ఏదో అవ్యక్తమైన బెంగా, భయమూ - సూచిస్తాయి.)

ఒక యువకుడికంఠం: హాయిగా ఉంది యీ సాయంత్రం. రాత్రి పడినకొద్దీ యింకా హాయిగా ఉంటుంది. దీపాలు వెలుగుతాయి. పాపాయిలు నిద్రపోతారు, వాళ్ల తల్లులు కిటికీలదగ్గర నిలిచి వాళ్ల తండ్రులకోసం ఎదురుచూస్తారు - అంతా హాయిగా ఉంటుంది. మంచి యీ మహానగరంలో ఈ వీధి మరీ మంచిది. నా కెలా తెలుసు నంటూరా? నిన్నటినించీ యీ వీథిలో నేగా ఉంటూంట. ఇదే మా మేడ! చివారి అంతస్తు మీద చివారి గది నాదే! మొత్తం మేడలో యిరవై రెండు కుటుంబాలు కాపురం ఉన్నారు - నన్ను మినహాయిస్తే! అదిగో - ఆ మెట్లదగ్గిర కాపరం ఉన్నారే- ఆ తాత గారు ఉద్యోగంచేసి పింఛనీ పుచ్చుకున్నారు. నిన్న సాయంత్రమే ఆయనతో కొంచెం బాతాఖానీ వేశాను. ఆయన అన్నారూ—

తాత: ఏమంటావు నాయనా - నే చేసింది ఏం ఉద్యోగమంటావా? ఏదయితేనేం - సర్కారు నౌఖరీ చేశాను - ముప్ఫయిమూడు సంవత్సరాలు చేశాను. తొమ్మండుగురు పిల్లల్ని కన్నాను. ఇప్పుడు పింఛనీ యిచ్చేశారు.

యు: మంచిదే గద తాతగారూ! హాయిగా విశ్రాంతి తీసుకోవచ్చు!

తా: ఆ విశ్రాంతే దొరకడం లేదు అబ్బాయ్! ఇంకా నలుగురు కూతుళ్లకి పెళ్లి అవాలి. పెళ్లయిన యిద్దరు కొడుకులకి ఉద్యోగాల్లేవు - మిగిలినవాళ్ల చదువులకి డబ్బులేదు, ఇంకెక్కడి విశ్రాంతి నాయనా? అంచేతే ఏంతోచక అప్పు



# ఆశ ఖరీదు అణా



దప్పుడూ పాటలు పాడుకుంటాను......
పాటలంటే నీ కిష్టమేనా అబ్బాయ్?

యు: అందమయిన ఆడవాళ్లు పాడితే చాలా యిష్టంగా వింటానండి!

తా: బుద్ధిమంతుడివి నాయనా! మీా యింటావిడ అందగత్తేనా?

యు: తప్పకుండా అందగత్తే అయుండాలి మరి - ఎంచేతంటే నాకింకా పెళ్ళి కాలేదు...మంచిది తాతగారూ మళ్ళీ కలుసుకుందాం. అదిగో ఎక్కడో రేడియో లోంచి మంచి సంగీతం వినబడుతూంది. వినండి!

తాత: మంచిది నాయనా! వెళ్ళిరా!

(క్షణమాత్రం శ్రావ్యంగా జంత్రసమ్మేళనం వినబడుతుంది.)

యువకుడు: విన్నారా అదీ సంగతి. తాతగారితో ఆట్టేసేపు మాటాడలేంగాని, ఆయన్ని తలుచుకుంటే సంతోషంగా ఉంటుంది. ఆయనా - భార్యా, తొమ్మండుగురు సంతానం - అందరూ హాయిగా రెండుగదుల్లో కాలక్షేపం చెయ్యడం - ఒకళ్లనొకళ్లు ఆప్యాయంగా, సావిత్రీ మీనాక్షీ, సుబ్బయ్యా, గోపాలం, కృష్ణవేణీ, పెద్దన్నయ్యా, యిలా పిలుచుకోవడం అంతా బాగులేదూ?

కృష్ణవేణి అంటే జ్ఞాపకం వస్తోంది - మా మేడలోనే పెరటి భాగం గదిలో ఓ అమ్మాయి కాపరం ఉంది. తల్లీ, అన్నయ్యా - లేక తమ్ముడో మరి! - ఉన్నటున్నారు. ఎక్కడో ఉద్యోగం చేస్తోంది.



భోగి మంట

వి. ఎస్. రాజు, (కూచిపూడి)

పేరు కృష్ణవేణి కాదుగాని - అయితే బాగుండును! అంత చక్కటి తలకట్టు - మోకాళ్లదాకా వేలాడే జడ! అదిగో - ఆ అమ్మాయే కాబోలు - వస్తోంది!

(హలో! హలో! హలో! అనుకుంటూ దూరంనుంచి దగ్గరగా అమ్మాయి వస్తుంది.)

అమ్మాయి: హలో! మీరేనా మేడగదిలోకి కొత్తగా వచ్చింది?

యు: అవునండి. నిన్న సాయంత్రమే దిగాను.

అ: మరేటు. మా ఇందిర చెప్పింది. రాత్రల్లా గదిగోడలకి మేకులు కొడుతూనే ఉన్నారు. ఆ చప్పుడుతో రాత్రల్లా తనకి నిద్ర పట్టలేదు. కాని కొంచెం జాగ్రత్తగా ఉండండి. గోడలకి మేకులు కొడితే ఇంటాయన ఊరుకోడు.

యు: ఏం?

అ: (నవ్వుతూ) ఏవేవిటి? బంగారు గోడలు చెడిపోవూ? మీరు గోడకి కొట్టే ప్రతి మేకూ తన వీపుమీద కొట్టినట్టే అతను బాధపడతాడు. అబ్బా! బాగా చీకటయి పోయిందే - మబ్బులు కూడా ముంచుకొస్తున్నాయి. మార్గశిర మాసపు చలీ - యీదర గాలీ - బాగుందిగదూ! ఇలాంటప్పుడు నడిచి వెళ్ళి హాయిగా రెండో ఆట సినిమా చూసి, తిరిగి ఇంటికి నడిచి రావాలనిపిస్తుంది.

యు: సినిమాలో మనం విన్న ఆఖరిపాట లోపలలోపల పాడుకుంటూ - ఏం?

అ: సరిగ్గా నేననుకుంటున్నదే చెప్పారు. మీకు పాటలంటే యిష్టమేనా?

యు: పాడేవాళ్లు బాగుంటే పాటా బాగుంటుంది.

అ: (నవ్వుతూ) అయితే మా ఇందిర పాట ఎప్పుడేనా వినిపిస్తానుండండి...సరే వస్తానండీ! అమ్మయ్యో! ఏవిటా బాజాలు?

(చావుబాజాలు దూరంనుండి దగ్గరగా వస్తాయి.)

యు: ఎవరో మహారాజు కైలాసానికి వెళ్ళిపోతున్నాడు...

అ: నేనింట్లోకి పోతాను బాబూ! అలాంటివంటే నాకు భయం!

(బాజాలు తీవ్రంగా వినిపిస్తాయి.)

(బాజాలు అలా అలా దూరం అయిపోయి, మళ్లీ గల్లీలో వాహనాల చప్పుళ్లూ, జనసమ్మర్దం అవి వినబడతాయి.)

యు: వెళ్ళిపోయింది అమ్మాయి, పేరు అడుగుదామనుకున్నాను. భయం వేసింది, ఎందుకో, మన భయాలన్నీ యిలాగే ఉంటాయి. ముక్కూ మొహం ఎరగని నాతో నిర్భయంగా జంకూ గొంకూ లేకండా మాటాడింది. బాజాలువిని హడలిపోయి తుర్రుమని లోపలికి పారిపోయింది. కొందరికి చావంటే భయం, మరికొందరికి

బతుకంటే భయం... ఎక్కడికో యీ మనుషులంతా? ఎన్ని కార్లు ఎన్ని కార్లు? వాటిల్లో అందమైన ఆడవాళ్ళూ, ఖరీదైన మగాళ్లూ - ఎవళ్లో వాళ్లంతా? ఎక్కడికి వెడుతున్నారు అంత హడావిడిగా? రంగురంగుల పానీయాల మత్తుందనాల్లోకి - తాంబూలాల సువాసనల్లోకి - అగరు ధూపాల అరమోడ్పు కన్నుల అవతలి గటులకి.

[సైకిల్ బెల్ చప్పుడు]

ఒక పడుచువాడు: హలో! కొంచెం దారి యిస్తారా? సైకిల్ గుమ్మంగట్టు దాటించి లోపలికి తీసుకుపోతాను! - లోపలి వాటాలో ఉంటున్నాం లెండి!

యు: తప్పకుండా!

పడు: థాంక్స్.. మీరేనా మేడగదిలోకి కొత్తగా వచ్చింది?... పొద్దున్న యధాలాపంగా చూశాను. మీరే అనుకున్నాను. కుటుంబంతో నే వచ్చారా?

యు: లేదండి, ఇంకా పెళ్ళికాలేదు.

పడు: ఓహో... ఒస్తానండీ, మావాళ్ళు కనిపెట్టుకుంటారు. కనిపిస్తూనే ఉంటాలెండి. నేను బాంకులో పనిచేస్తున్నాను. మీ ఎకౌంటు ఏ బాంకిలో ఉంది?

యు: నా ఎకౌంటండీ - నా జేబులోనే ఉంటుందండి. పైగా అది ఖాళీగా ఉండే సమయాలే ఎక్కువ.

పడు: బాగా చెప్పారు!

(కొస్త దూరంనుంచి 'లోపలికి రావేంరా నాయనా' అని ఒక ప్రౌఢ స్త్రీ కంఠం.)

పడుచువాడు: ఒస్తానండీ! మా అమ్మ పిలుస్తోంది. మా ఆవిడ కూడా కనిపెట్టుకుంటుందీ...

(దూరంనుండి రేడియోలో జంత్రసమ్మేళనం సన్నగా వినబడుతుంది.)

మా పైవాటాలో వాళ్లు లెండి... కూతుళ్లకు పెళ్లిళ్లు చెయ్యరు గాని యిరవైనాలుగ్గంటలూ గ్రామఫోను పెట్టు కూర్చుంటారు... ఇందిరా, ఆనందలక్ష్మి... ఆహా... పేరు గొప్ప ఊరు దిబ్బా అన్నాడు...

(జంత్రసమ్మేళనం తీవ్రంగా వినబడుతుంది.)

యు: ఇందిరా, ఆనందలక్ష్మి! ఎంత మంచిపేరు! ఎందుకో మరి యీ సైకిల్ రూగుడికి నచ్చలేదు. పెళ్ళిగాని అమ్మాయిలూ, బ్యాంక్ ఎకౌంట్ లేని నాలాంటి వాళ్లూ - అతనికి నచ్చరు. అలా నచ్చని వన్నీ ఏరి పారేయగా అతనికి మిగిలింది చాలా చిన్నిలోకం అయుండాలి - తనూ, తనకుటుంబం, ఉద్యోగం-ఇంక్రిమెంటూ, తమ్ముడి ఉద్యోగం - చెల్లెలి పెళ్ళి - అంత చిన్నలోకాన్ని పదిలంగా రూపాయి కాగితంలో పొట్లంగట్టి మర్యాద బ్యాంకులో డిపాజిట్ చేసేసి ఉంటాడు... ఇందిరా - ఆనందలక్ష్మి! వాళ్లగురించి కొంచెం తెలిస్తే బాగుండును! నేను గోడలకి మేకులుకొడితే ఆ ఇందిరకి నిద్రాభంగం! ఇప్పుడేం చేస్తున్నారో వాళ్ళు?!

* * *

లక్ష్మి: ఇందిరా! ఇందిరా!

ఇం: (ప్రవేశిస్తూ) ఏం లక్ష్మి!

లక్ష్మి: అన్నయ్యింకా రాలేదేమే? ఇంత రాత్రయిందీ! నాకెందుకో భయం వేస్తోంది.

ఇం: వస్తాడు. జేబులో కానీ కూడా లేదాయె. ఎక్కణ్ణించి నడుచుకుంటూ రావాలో!

లక్ష్మి: అమ్మకి కొస్త కునుకు పట్టినట్టుంది. నువ్వెళ్ళి భోజనం చెయ్యరాదూ? వెళ్ళు. నేను కూర్చుంటాను అమ్మదగ్గిర... తరవాత మళ్ళీ బార్లీ నీళ్ళూ అవీ కలపాలా!

ఇం: నాకేవిటో ఆకలిగా లేదు లక్ష్మి! అక్కడ నాన్నకి జెయిల్లో గంజినీళ్ళూ - ఇక్కడ అమ్మకి జబ్బు మంచంమీద బార్లీ నీళ్లూ.

లక్ష్మి: ఆవేశావేం? అన్నయ్యకి ఉద్యోగంలేదు, మనకి పెళ్ళిలేదు - లిస్టు చాలా ఉంది.

ఇందిర: అదికాదు లక్ష్మి - తలుచుకుంటే నవ్వాలో ఏడవాలో తెలియడం లేదు - ఉన్న ధైర్యం ఏవిటంటే ఇంతకన్న అట్టడుక్కి వెళ్లడానికి యింకేం వుందని!

లక్ష్మి: అలా అనకు. దిగినకొద్దీ సముద్రం లోతు, ఎక్కినకొద్దీ ఆకసం ఎత్తూ -



"గొబ్బిళ్లో గొబ్బిళ్లు"

వి. ఎస్. రామ్, (కూచిపూ

 

# ఆశ ఖరీదు అణా



అలా ఉంటూనే ఉంటాయి. వెళ్లి భోంచేసి రావూ?

ఇం : ఏం భోజనమే! ఆకల్లేదు. అలా పడుకోవాలని ఉంది. మెలుకువ కంటె నిద్ర నయం. మంచి కలలైనా వస్తాయి.

లక్ష్మి : ఏమిటి హామీ? తీరా చేసి పీడ కలలు వస్తే!

ఇం: చంపేశావు! మేలుకుంటే నీడ, నిద్రపోతే పీడ! ఏ దారి మరి.

ల : రెండింటికీ మధ్య ఏదో మగతగా బతికేస్తే సరి!

ఇం : అంతేనంటావ్! సరేలే...ఇప్పుడు చేస్తున్నదీ అంతే...హాయిగా ఎవరైనా పాడితే బాగుండును! ఏదైనా ఒక పాట — మైమరపించేది, హాయనిపించేది...

ల : పాడిన కాస్సేపూ బాగుంటుంది. ఆ తరవాత?

ఇం : కాస్సేపు బాగున్నా చాలు...





పోనీలే...నాన్న యీ నిముషాన జైల్లో ఏం చేస్తున్నాడో?

ల: నిద్రపోవడానికి ప్రయత్నిస్తూ ఉంటాడు.

* * *

యు: నిద్ర రావడంలేదు ఎంత ప్రయత్నించినా! ఎంచేతో తెలియదు! నిజంగా తెలీదా? పొద్దున్నించీ కడుపు మాడిపోతుంటె నిద్ర ఎలా వస్తుంది? ఉంగరం అమ్మేస్తే వచ్చిన డబ్బు గది అద్దె ఎడ్వాన్సుకే చాలలేదు. మిగిలింది నేనూ నా బొమ్మలూ! వాటి నెవడూ కొనడు. పిచ్చి బొమ్మలు. గోడమేకులకి అలా వేలాడవలసిందే! ఎటొచ్చీ మేకులు కొడితే ఇందిర నిద్రపోయింది. బొమ్మలు మాస్తే కృష్ణవేణి మాడలిపోతుం దనుకుంటాను. వియోగం, దుఃఖం, గులాబీ తోటలో కాలసర్పం — ఇలాంటి బొమ్మలే ఎందుకు వేస్తానో చెప్మా? ... ఎలాగైనా కృష్ణవేణికి ఆ బొమ్మలు చూపించాలి. మళ్ళీ కృష్ణవేణి అంటున్నానూ!—ఆఅమ్మాయి పేరేమిటో?..

* * *

కృష్ణవేణి: ఆ అబ్బాయి పేరేమిటో! — ఏవిఁరా అన్నయ్యా— ఆయన పేరేవిఁటి?

అన్నయ్య: ఎవరి పేరే?

కృష్ణ: అదేరా — పై మేడ చివరిగదిలో కొత్తగా దిగాడే...

అన్న: ఎవడో సుబ్బారాయుడు. మన కెందుకొచ్చిన గొడవ పడుకుందూ — అర్థరాత్రి కావస్తోందీ—

కృష్ణ: (నవ్వుతూ) భలేవాడివిరా, సాయంత్రం ఎనిమిదింటికే చీకటంటావేవిఁట్రా ఖర్మ! కాస్సేపు కూర్చుని ఏవేనా కబుర్లు చెప్పరాదూ! అమ్మ కప్పుడే మూడో ఝాము నిద్ర.

అ: చెప్పడానికి నాకేం కబుర్లుంటాయి— బెంగెట్టుకు ఛస్తుంటేను! ఎందుకూ పనికిరాని చవట వాజెమ్మని...కాణీ ఆర్జించలేనివాణ్ణి!

కృ: పోనీలేరా...ఆ గొడవంతా దేనికిప్పుడూ...ఎవరార్జిస్తేనేం. ఏదో యిలా బతుకొస్తున్నాం సంతోషించమూడదూ?

అ: నీకేం చెపుతావు...నీమట్టుకు నీకేదో గొప్పగా ఉన్నట్టుంది కాని...నీ చేత ఉద్యోగం చేయించవలసిన ఖర్మ పట్టిందంటే — అమ్మకి ఎంత రంపపు కోత — నాకెంత అవమానం—

కృ: మొదలెట్టావా పురాణం! ఈ నాలు ఘడియలైనా నన్ను కాస్త తృప్తిగా ఊపిరి పీల్చుకోనియ్యవ్. తెల్లారగట్ల లేచి వంట పని. పగలల్లా ఆఫీసులో బండచాకిరీ. ఇంటి కొచ్చాక మళ్ళీ వంట.

అ: ఆ తరవాత తీరిగ్గా కూర్చుని అల్లా అబ్బాయి పేరేమిటీ, యిల్లీ అబ్బాయి పేరేమిటీ అని ఆలోచన్లు. దేవుడి ధర్మమా అని నాకు ఉద్యోగమే దొరికితే—

కృ: తక్షణం నన్ను ఉద్యోగం మాన్పించి యింట్లో కూచోబెడతావు. అంతేనా? అక్కడికి కాని నీకు మనశ్శాంతి ఉండదు. ఏం మనుషులంరా మనం? సగం చచ్చిన మనుషుల్ని గాని ప్రేమించలేం; నా బతుకులో ఏ మారుమూలైనా కాస్త సంతృప్తి మిగిలిపోతే దాన్ని విసిరి అవతల పారేసేదాకా నీకుతోచదు. నన్ను నువ్వు ఇంతగా అభిమానించకపోయినా బాగుండును! కాస్తయినా సుఖపడేదాన్ని!

* * *

యు: అప్పుడే సందడి తగ్గిపోతూంది. మేడలో దీపాలు ఒకొక్కటే ఆరిపోతున్నాయి. పాపాయిలు నిద్రపోయారు. వాళ్ళ తల్లులూ నిద్రపోయారు; హాయిగా. ...ఒంటరితనం ఎంత భయంకరం! చేతిలో కానీ లేదు. అయినా రేపు ఎలా గడుస్తుందన్న భయం లేదు. తిండి లేకపోయినా అంత బాధ లేదు. ఎంత ఆకలి రాత్రయినా తెల్లారక తీరదు. అలాగే శాశ్వతంగా కన్నుమూస్తే మరి చింతే లేదు. కాని యీ ఒంటరితనం! ప్రపంచంలో నా అన్నవాడు ఒక్కరు — ఒక్క ప్రాణి లేకపోతే ఏందారి? ఏవిటో భాగారంలో శేషంలా నేనొక్కణ్ణి యిలా మిగిలిపోయాను! — తిండికోసం వెతుక్కుంటూ...పింఛను తాతగారల్లే ఉందే? ముసలాయనకి నిద్ర పట్టడంలేదు కాబోలు!

తాత: ఏం నాయనా! ఇంకా నిద్రపోలేదూ!!! మేడముందు పచార్లు చేస్తున్నావ్!

యువ: లేదు తాతగారూ! ఏవిటో నిద్రపోవాలనిపించడంలేదు! రోడ్డుమీది వింతల్ని చూస్తూ — పిచ్చిగా ఆలోచిస్తూ —

తా: నిద్రపో నాయనా! నిద్రపో! మేలుకుంటే ఏవుంది — బెంగలూ భయాలూ తప్ప!

యు: మరి మీరు నిద్రపోలేదే తాతగారూ?

తా: నిద్ర! నాకు ఏకంగా ఒక్కసారే నిద్ర! పెద్దకోడలు ప్రసవవేదనలో ఉంది. చిన్నకోడలుకి జ్వరం! ఆ తీవ్రంలో ఒకటే పలవరింతలు! చేతిలో కానీ లేదు. అవునా! ఇలాంటప్పుడు నాకెందుకో నవ్వొస్తుంది! నేనన్నవ్వితే మాధర్మపత్నికి కోపం. మనం దరం అసలు ఎందుకు పుట్టామూ అన్న

ప్రశ్న యిప్పుడు తేల్చమంటుంది- యీ అర్ధరాత్రి! ఎలాగుందంటావ్?

యు: దివ్యంగా ఉంది. పోనీ కాస్సేపు యిక్కడ కూర్చొని కబుర్లు చెప్పుకుందాం.

తా: అలా అన్నావు బాగుంది. ఉండు, ఓ చుట్ట వెలిగించి నీకు నా అనుభవాలన్నీ చెపుతాను. చూడూ నువ్వు చుట్ట కాల్చ గలవా?

యు: కాల్చగలను గాని ఈ సెప్పుడూ కాల్చేవి బీడీలు. ఉన్నాయిలెండి నా దగ్గిర...

తా: ఏవో ఒకటిలే! కాల్చడం ప్రధానం. మీ అమ్మా నాన్నా ఏపూళ్లో ఉన్నారు నాయనా?

యు: స్వర్గంలో!

తా: మంచిది. ఎక్కడో అక్కడ ఉండడం కావలసింది...సరే, యిల్లాలు లేదని నిన్ననే చెప్పావు. పోనీ ఏదైనా ఉద్యోగం చేసుకుంటున్నావా?

యు: అదీ లేదండి! ఇచ్చేదాతెవ్వడూ కనబడ్డం లేదు.

తాత: ఇంకేం! సుఖపడ్డావ్. వీలయిన కాడికి ఉద్యోగాలు చెయ్యకండా బతకడానికి ప్రయత్నించు. ఇదంతా ఉత్త మాయ నాయనా! నేను చేసి చూశాను - ముప్ఫయిమూడు సంవత్సరాలు - చివరికి ఏం మిగిలింది?

యు: ఏం మిగిలిందండి?

తాత: చెప్పానుగా! శరీరంలో రకరకాల జబ్బులూ, తొమ్మండుగురు పిల్లలూ, వాళ్లకి నామీదుండే వొల్లమాలిన అభిమానం! ఇదీ నా ఆర్జన!

యు: జరిగిందానికంతికీ యిప్పుడు విచారిస్తే ఏంలాభం చెప్పండీ!

తాత: భాభా! ఎంతమాటన్నావు! విచారమా! అది నా జన్మలో లేదు. జరిగింది చెప్పానంతే. లాటరీ వేశాం, ఓడిపోయాం! ఇంకోరకం లాటరీఉందేమో ప్రయత్నించి చూడమంటున్నాను.

యు: కనీసం ఇదంతా లాటరీ అని మీ నమ్మకం?

తా: అది నా అనుభవం. సిద్ధాంతం కాదు. చూడబ్బాయ్! నా తత్వానికి పరిపడని విషయాలు నాచేత పేలిస్తున్నావు. మామూలు విషయా లేమైనా చెప్ప... భోజనం అయిందా?

యు: ఎప్పుడో అయిందండి. మళ్ళీ ఎప్పుడో తెలీదు.

తాత: చాలా విషయాలు అలా తెలియకుండా వుంటేనే మంచిది. ప్రతిదీ తెలిసిపోతే ఆరోగ్యం బాగుండదు ... ఎవరదీ ఆ చీకట్లో? (గట్టిగా) ఎవరక్కడా?

కృష్ణమూర్తి: (సమీపిస్తూ) నేనండి - కృష్ణమూర్తిని - ఎరగరూ - బాంకులోపని.

యు: ఓహో - ఇందాక సైకిల్ తీసుకెళ్ళారు మీరేనా?

కృ: మరేనండి! కొత్తసైకిలు - కొని యింకా నెల కాలేదు...అది సరేకానీండి, యిప్పు డెక్కడేనా దుకాణాలుంటాయా, దుకాణాలు?

తాత: ఎందుకు నాయనా ఆ కంగారూ? ఏవొచ్చింది? ఏందుకాణం కావాలి?

కృ: మా ఆవిడండి...ఇందాక భోంచేసే వరకూ హాయిగానే ఉంది. ఉన్నట్టుండి వచ్చేశాయండి బాబూ! చంపేస్తోంది!

యు: ఏవొచ్చేశాయి?

కృ: మెల్లిగా అంటారేవిటండీ బాబూ!- చస్తూంటేనూ! తుమ్ములండీ తుమ్ములు! ఏక తుమ్ములు! దానిమీద జలుబూ! ఊపిరాట్టం లేదనుకోండి! ఏంచెయ్యమంటారు తాతగారూ?

తాత: ఓ అరగంట ఊపిరి పీల్చడం మానెయ్యమనండి - అదే తగ్గుతుంది!

కృ: అదెలా కుదురుతుందండీ! చెప్పండీ! దుకాణాలు! ఉంటాయా?

యు: ఉంటే ఏంచేస్తారు?

కృ: ఏదైనా మందు కొనుకొస్తాను. వెంటనే మందుపడితే మంచిది చూడండి!

యు: ముందు తక్షణం ఏంచేశారు?

కృ: ఏంచెయ్యనూ? స్వెటరు తొడుక్కొమన్నాను. తలకి మఫ్లరు చుట్టుకోమన్నాను.

తాత: అబ్బే! అలా అశ్రద్ధ చేయకండి.

కృ: అయితే ఇంకేం చెయ్యమంటారు?

తాత: కిటికీ తలుపులన్నీ వేశెయ్యండి. ఒక్క పిసరుగాలి తగిలినా ప్రమాదం——

కృ: అవునండి - అసలే అర్భకురాలు.

తాత: నాకు తెలియకుటయ్యా రోజూ చూస్తున్నానుగా అవునా - గదినిండా సాంబ్రాణి పొగవేసి దీపాలన్నీ వెలిగించెయ్! ఆ తరవాత మందుల షాపునుండి మందు కొనుక్కెళ్లు!

కృ: అలాగేనండి! వెళ్లొస్తాను మరి!

యు: చూడండి! ఇంకో చిన్న జాగ్రత్త తీసుకుంటే ఇంకా మంచిది. మీ యింట్లో గరుడపురాణం వుందా?

తాత: ఇప్పుడప్పుడే కాదులే అది - నే చెప్తాగా-ముందునువ్వు వెళ్ళిరా నాయనా!

కృ: ఒస్తానండి మరి!

యు: అభిమానం అంటే అలాగుండాలి తాతగారూ! నాకే గనక యిలాంటి నాన్నుంటేనా?

తాత: ఉంటే?

యు: బతుకు యింతకంటె యింకొంచెం రుచిగా ఉండేదేమో!...మా నాన్న ఏం చేసేవాడో తెలుసా తాతగారూ! ఇంట్లో ఎవరికైనా కాస్త జబ్బుగా ఉంటే వెళ్ళి వీధరుగుమీద కూర్చునేవాడు. అమ్మకి జ్వరంవొస్తే కోరి తెమ్చుకున్నావని పట్టుకు తన్నేవాడు.

తా: సబబుగానే వుంది. జబ్బు తెచ్చుకోవడం నేరం - నేరానికి శిక్ష వేసేవాడు - తప్పేం?

యు: బాగా చెప్పారు. ఈ ధర్మసూక్ష్మం నాకిన్నాళ్లూ తెలియలేదు.

తా: సరే - ఒక్కసారి లోపలికివెళ్ళి పరిస్థితి ఎలా ఉందో చూసొస్తాను. ఇంక వెళ్ళి పడుకుంటావా?

యు: నిద్ర రావడంలేదు. మీరు వెళ్ళి రండి. బహుశా మీరు తిరిగి వచ్చేవరకూ యిక్కడే ఉంటాననుకుంటాను...చెప్పలేను.

తా: సరేలే - నిద్రపో. దాన్ని మించిన సుఖం లేదు.

*   *   *

యు: అంటాడు తాతగారు. కాని నిద్ర రావద్దూ! ఆ అమ్మాయి - కృష్ణవేణి- చెప్పినట్లు యిలాంటప్పుడు రెండో ఆటో, లేకుంటే మూడో ఆటో, సినిమాచూసి నడిచి యింటికివస్తే ఎంత హాయిగా ఉంటుంది! సినిమాకి డబ్బులే ఉంటేనా!- అంతిపనీ చేసుండేవాణ్ణి. ఇన్ని కబుర్లూ చెప్పి యీపాటికి గుర్రుపెట్టి 'నిద్రపోతూ ఉండుంటుంది. ఆ ఇందిర ఎవరోగాని ఆవిడకే యివాళ నిద్రాభంగం ఉండకూడదు మరి!   *   *   *

కృష్ణవేణి: ఇందిరా?

ఇందిర: ఏం కృష్ణవేణీ! రా, లోపలికి రా! ఇంత రాత్రివేళ వచ్చావేం? ఏదైనా కావాలా?

కృ: అబ్బే - ఏం తోచక వచ్చాను. నిద్రపోతున్నారా? అమ్మ వంట్లో ఎలా వుందీ?

ఇం: అలాగే ఉంది. ఆయాసం పొద్దున్నకంటే ఎక్కువైంది.

కృ: అయ్యో పాపం! లక్ష్మేదీ?

ఇం: అమ్మ గదిలో ఉంది. పిలవనా?

లక్ష్మి: (ప్రవేశిస్తూ) ఏం కృష్ణవేణీ! ఇంకా నిద్రపోలేదేం? పగలల్లా ఆఫీసులో కష్టపడి - మళ్ళీ సాయంత్రం అందరికీ వండివార్చి——

కృ: ఏవుందీ! మామూలు గొడవే! రాను రాను బతుకంటే అసహ్యం వేస్తోంది.

లక్ష్మి: కొత్తగా ఇప్పుడేం వొచ్చిందీ? అన్నయ్య పురాణమేనా?

కృ: అదే. వాడు సరిగ్గా రెండువందలుయేళ్ళక్రితం పుట్టవలసినవాడు. ఆ పొరపాటుకి శిక్ష అనుభవిస్తున్నది నేను. అమ్మ సరేసరి - తన పక్షవాతం జబ్బు తలుచుకొని మురిసిపోతూ మంచంమీద ఉంటుంది. మరో ప్రపంచయుద్ధం ఒస్తేగాని అన్నయ్యకి ఉద్యోగం దొరికేటట్టు లేదు. అం వాడికెందుకో నామీద కసి. నా అంటే మళ్ళీ అభిమానమేం.

# ★ ఆశ ఖరీదు అణా ★

ఇం: ఊరుకుందూ - వింటాడేమో.

కృ: లేదులే. పెట్టవలసిన శాపాలన్నీ పెట్టేసి యిప్పుడే నిద్రపోయాడు. మళ్ళీ పొద్దున్న కాఫీ వేళకిగాని లేవడు.

లక్ష్మి: దేనిమీదొచ్చినదీ రభస?

కృ: ఆఁ - మేడగదిలో ఎవరో ఆయన కొత్తగా దిగలేదూ? ఆయన ప్రసంగం తీసుకొచ్చేసరికి వచ్చింది దుమారం. వాడి గొడవ నాకెందు కంటాడు. అని మళ్ళీ మా పురాణం అంతా ఏకరువు పెట్టి తను సంసారాన్ని పోషించగల్గిన ఉత్తరక్షణం నన్ను ఉద్యోగం మానిపించేస్తానంటాడు.

ఇం: పోనీ అప్పటిసంగతి అప్పుడే చూసుకుందాం అనలేకపోయావా?

కృ: (కోపంగా) అంటానంటాను. అనను మరి! ఆడవాళ్ళకి సహగమనం మాన్పించారే అని విచారించే మనిషి వాడు ...(కంఠం మార్చి)...అంతే ఇందిరా... మనం ఎంత అభిమానంగా చేతులు చాస్తామో అంత స్వార్థంగా వెనక్కునెట్టేస్తా రంతా.

లక్ష్మి: ఎప్పుడూ యిలాంటి విషయాలు లెక్క చెయకుండా నిబ్బరంగా తిరిగే దానివికదా, యివాళేం యింత బాధపడిపోతున్నావు?

ఇం: కృష్ణవేణికి ముసిలితనం వచ్చేసింది.

కృ: ఎంతకాలమని పోట్లాడుకురాను చెప్పు లక్ష్మి! ఏనాటికైనా వాళ్ళు నన్ను అర్థంచేసుకోకపోతారా అన్న ఆశతో యిన్నాళ్ళూ నెట్టుకొచ్చాను; అవస్థలు పడుతునే. కాని, ఇందాకటితో వెన్నెముక విరిగిపోయింది.

ఇం: అన్నీ మరిచిపోయి హాయిగా నిద్రపోదూ! తెల్లారే సరికి మళ్ళీ హాయిగా వుంటావు.

కృ: ఆశ పూర్తిగా పోయింది. వీళ్ళు నాకేమేనా అదృష్టం ఉంటే దాన్ని పెంచుకోనివ్వరు. దురదృష్టాన్ని తుంచుకోనివ్వరు. సగం చచ్చిన నల్లిలా యిలా బతకమంటారు. పైపెచ్చు కుటుంబంకోసం ఆమాత్రం త్యాగం చెయ్యలేవా అంటారు. ఎవరికి త్యాగం? దేనికి త్యాగం? జల్లెడలో పోసిన నీరులాగ ఆ త్యాగం గాలిలో హరించి పోతుందిగాని - ఎవరికీ తులమెత్తు లాభం చెయ్యదు.

లక్ష్మి: ఇందిరా అమ్మకి నిద్రపట్టిందా?

ఇం: ఆఁ, కొస్త కన్నుమూసి నిద్రపోయింది?

కృ: అన్నట్టు మరచిపోయాను. ఏమిటో నా గొడవ నాది. ఎలావుంది అమ్మగారికి?

ఇం: చెప్పానుగా ఇందాక! అలాగే ఉంది. ఆయాసం కొస్త ఎక్కువైంది.

లక్ష్మి: అన్నయ్యింకా రాలేదు - ఎంచేతో!

కృ: అదేవిటే? ఇంత రాత్రయినా రాకపోవడమేమిటే?

లక్ష్మి: ఏం చెప్పను. వాడి ధోరణి అంతా అదో మాదిరి. ఇంకా మేవే నయం. వాడు బొత్తిగా పిరికి. అడుగడుగునా మేమే ధైర్యం చెపుతూ ఉండాలి. నాన్నని తలుచుకొని అన్యాయంగా జైలు కెళ్ళిపోయాడే అని ఏడుస్తాడు. అమ్మని తలుచుకొని బాధపడతాడు. ఇటు మమ్మల్నిద్దరినీ చూసి కన్నీళ్లు కారుస్తాడు! ఎక్కడైనా కొస్త టెంపరరీ ఉద్యోగమైనా దొరుకుతుందేమోనని అలా తిరుగుతున్నాడు.

కృ: పాపం! ఇంత రాత్రయిందికదా, భోజనం లేకండా ఎక్కడ తిరుగుతున్నాడో!

ఇం: లక్ష్మి! నేను కొస్త వీధిదాకా వెళ్ళి చూసిరానా?

లక్ష్మి: చూసిరా! కొస్త బయటి ప్రపంచమేనా కనబడుతుంది. నేను అమ్మదగ్గర ఉంటాను.

కృ: పద ఇందిరా! నేనూ వస్తానూ!

ఇం: మీ అన్నయ్య కోప్పడరూ?

కృ: ఏడిశాడు, పద, అంతగా అయితే పీక పిసికేస్తాడు. ఆపైన ఏమీ చెయ్యలేడు గదా! అదే హాయి. ఈ క్షణాన్న నేను కోరుకుంటున్నదీ అదే.

ఇం: ఆలెక్కని నేను ఏనాడో రైలు కింద పడిపోయి ఉండవలసినది. ఇటువంటి వాటికి నేను విరుగుడు కని పెట్టాను. నువ్వూ అది నేర్చుకో.

కృ: ఏవిటది?

ఇం: కష్టాలు మరీ ఎక్కువై పోయి, భరించలేనంత దుఃఖంవస్తే - వెంటనే కళ్లు మూసుకొని నిద్రపో, మళ్ళీ నువ్వు మేలుకొనేసరికి—

కృ: కష్టాలు కరిగిపోతాయా?

ఇం: అలా అనలేను. కాని, మనస్సు కొంచెం తేరుకుంటుంది. కష్టాన్ని భరించే శక్తి కొంచెం కోలుకుంటుంది.

కృ: పద - కొస్త బయటి ప్రపంచం యీ రాత్రి ఎలాఉందో చూద్దాం...మీ అన్నయ్య ఎక్కడ తిరుగుతున్నాడో సుమా.

*　　　*　　　*

యు: వీధి యించుమించు నిర్మానుష్యంగా ఉంది. అంతటా ఒంటరితనం నిస్సహాయం. వీధిలాంతర్లు కూడా భయంగా, జాలిగా వెలుగుతున్నాయి. ఏమిరాత్రియిది! గాలిలో కనరాని గడుసుదెయ్యాలు - భూ దివమ్ముల మధ్య యీదుతున్నాయి - అన్నాడట ఎవరో, అలాగే ఉంది...ఆఖరిసారి భోంచేసి ఎన్నాళ్ళయింది చెప్మా! రెండు రోజులయింటుంది. ఇలా ఎన్నాళ్ళు గడుస్తుంది?...ఏమో ఎవరికి తెలుసు, ఎవరో నన్ను ఓడించేశారు. మరి నెగ్గడం అసంభవం. చేతులు జోడించి నమస్కరించి, చల్లగా వప్పుకోవడమే మంచిది...

తాత: ఇంకా యిక్కడ పచార్లు చేస్తున్నావా నాయనా?...ఏం అలా ఉలిక్కిపడ్డావ్?

యు: మీరా? ఏవిటో పరాగ్గాఉన్నాను. రండి తాతగారూ - రండి. ఎలాఉంది యింట్లో?

తా: అచ్చు బయట ఎలా ఉందో యింట్లోనూ అలాగే ఉంది. నువ్వు వినలేదా?

యు: లేదే! ఏమిటే?

తా: (వ్యంగ్యంగా) ఏవిటేవిటి వెర్రివాడా! కొత్త సృష్టి, నవజీవన చైతన్యం. మా కోడలు ప్రసవించింది. ఆడపిల్ల, ఏడుపు వినలేదూ? మేడ పునాదులు కదలిపోయేట్టు ఏడుస్తోంది నాయనా!

యు: ఎంత ఆశ్చర్యం?

తా: ఏవిటాశ్చర్యం?

యు: మేడలో జనాభా ఉన్నట్టుండి హఠాత్తుగా పెరిగిందన్నమాట!

తా: ఎవరే......ఎవరా చీకట్లో?

ఇం: నేనండీ తాతగారూ! ఇందిరని... నేనూ, కృష్ణవేణీనీ...

కృ: జనాభా అంటున్నారేవిటి?

యు: తాతగారికి మనవరాలు పుట్టిందట ...మీ పేరు నిజంగా కృష్ణవేణేనా?

కృ: నిజమే. అదే నా పేరు-ఏం?

ఇం: మా అన్నయ్యగాని కనబడ్డాడా తాతగారూ?

తాత: లేదమ్మా! ఇంకా యింటికి రాలే?

ఇం: రాలేదండి!...పొద్దున్నగా యిల్లు విడిచి వెళ్ళాడు. ఏవిటో కంగారుగా ఉంది.

తాత: భయపడకమ్మా! వస్తాడులే!

యు: ఎలాగుంటాడండీ మీ అన్నయ్య?

ఇం: సన్నగా పొడుగ్గా ఉంటాడు - కళ్లలో ఎప్పుడూ భయం పెట్టుకుని. ఏం?

యు: ఆఁ. ఏంలేదు. మా స్తే పోల్చుకుందికి అడిగాను.

ఇం: మీరేనాండి మేడగది అద్దెకి తీసుకుంది?

యు: అవునండి.

ఇం: మీ గది గోడలనిండా బొమ్మలు వేలాడదీశారే? అవన్నీ మీరు రాసినవేనా?

యు: అవన్నీ నేను సృష్టించిన పాపాలేనండి. అందుకే యిపుడు విచారిస్తున్నాను.

కృ: విచారం దేనికి?

యు: బొమ్మలు రాయడం బదులు సకోడీల దుకాణం పెట్టుకున్నా బాగుండిపోవునని. ఇంతకన్నా హాయిగా బతికి ఉందును.

కృ: ఓహో! అయితే మీరూ మాములోవాళ్ళేనన్నమాట. కాదనుకున్నాను!

యు: ఎంచేత అనుకున్నారూ?

కృ: ఏమో-కారణం చెప్పలేను. అన్నిటికీ కారణాలు చెప్పగలమా? ... మీరు బొమ్మలు ఎందుకు వేస్తారో చెప్పగలరా?

యు: ఆఁ. ఈ ప్రపంచంలో ఏది చూచినా నాకు బాధాకరంగానే కనిపిస్తుంది. ఆ బాధ నలుగురూ పోల్చుకుంటే అందరం కలిసి ఏమైనా చెయ్యకలమేమో అని ఆశ. అవన్నీ బొమ్మలు వేసి చూపిస్తాను - అందుకే.

తా: వెర్రినాయనివి. అలాంటివి మానెయ్ ...అందరూ ఝడుసుకుంటారు. మనిషుల్లోని మంచినీ, లోకంలోని ఆనందాన్నీ బొమ్మలు వేసి చూపించు - చేతనయితే.

ఇం: ఆయన బొమ్మలు కిటికీలోంచి తొంగిచూస్తే నాకూ అలాగే అనిపించింది. ఆర్టిస్టుగారూ! మరిచిపోయిన ఆశల్ని నూతనంగా జ్ఞాపకంచేసే బొమ్మల్ని వేయగలరా?

యు: అందుకు నాలో కొన్ని ఆశలుండాలిగద!

ఇం: మీలో ఏ ఆశలూ లేవా?

యు: లేవు. ఈరాత్రితో అన్ని ఆశలూ హరించుకుపోయాయి. ఇక నిలబడే శక్తి లేదు. వెళ్ళిపోవాలని ఉంది.

తా: ఎక్కడికి?

యు: అవతలి గట్టుకి.

కృ: నాకూ అలాగే అనిపిస్తోంది. ఎవరైనా సహాయం చేస్తే బాగుండును.

తా: అక్కడికి యిద్దరయారు. నువ్వు ఇందిరా?

ఇం: అన్నయ్య రాగానే నాకు నిద్రపోవాలని ఉంది.

యు: తాతగారూ! ఆ...అటుచూడండి ...ఎదురుగా ఆలాంతరు స్తంభంపక్క నీడలా!

తాత: నీడ అయుంటుంది!

యు: నీడ వెనుక వస్తువుండాలి కద! గంటనించీ చూస్తున్నాను. నాకేమిటో చిత్రంగా వుంది. అదేమిటో వెళ్ళి చూద్దామా?

(మోటారుకారు అకస్మాత్తుగా బ్రేక్ వేసి ఆగినచప్పుడు)

యు: / ఇం: / కృ: } అరె! అరె! ఏమిటది!

తా: ఏక్సిడెంటులా ఉంది! వెళదాం పదండి!

(పదండి! పదండి! పాపం! ఎంతపని! అనుకుంటూ వెళతారు)

తా: ఎవరదీ! కారువాడు పారిపోయాడే!

ఇం: అయ్యో! అయ్యో! మా అన్నయ్య తాతగారూ!

కృ: మీ అన్నయ్యా!

యు: ఎంత పనీ!

ఇం: అన్నయ్యా! మాటాడవేం అన్నయ్యా! (గట్టిగా. భయంగా) అన్నయ్యా!

తాత: భయంలేదమ్మా! ఉండు. ఏం నాయనా!

అన్నయ్య: (నెమ్మదిగా) భయంలేదు ఇందిరా. దెబ్బ తగలలేదులే. నడుం బెణికింది అంతే. కారుకి తగలలేదు. ఇవతలే పడిపోయాను.

తాత: నెమ్మదిగా లేచి రెండడుగులు వెయ్యి, నాయనా! నువ్వు కొంచెం చెయ్యి అందించు...ఇక్కడ యీ పచ్చికమీద కాస్సేపు కూర్చుందాం రండి!

ఇం: ఏమిటన్నయ్యా యిదంతా!

అన్న: చెడిపోయింది. అంతా చెడిపోయింది. ఆ కారుకిందపడి హాయిగా చచ్చిపోదాం అనుకున్నాను. ఫలించలేదు. వెంట్రుకవాసిలో తప్పిపోయింది...ఇంకోమారు ప్రయత్నించి చూస్తాను.

తాత: ఉద్ధరిస్తావ్.

కృ: అక్కడికి మీతో యిద్దరం అవుతాం. నేనూ అలాంటిపని చేద్దామనే వీధిలోకి వచ్చాను.

యు: ఇద్దరు కాదు ముగ్గురం - ఇందాకటినుంచి నా ప్రయత్నమూ అదే.

తాత: పరమేశ్వరా! ఏమి మేళం యిది. ఏమొచ్చింది యీ రాత్రి మీ అందరికీ?

అన్న: ఇంకా ఏంరావాలి తాతగారూ? మా కుటుంబం సంగతి తెలీదా మీకు?

కృ: తాతగారికి నా సంగతీ తెలుసు.

యు: నాసంగతి ఎవరికీ తెలీకపోయినా, నాకు బాగా తెలుసు.

తాత: తెలుసు నాయనా తెలుసు. మీ అందరి సంగతీ తెలుసు. ఈ నాలుగు ముక్కలూ వినండి. మీరంతా జీవితంలో దగాపడ్డ తమ్ముళ్లూ చెల్లెళ్ళున్నూ. బతకడం అంటే మీకు భయంగా ఉంది. మనవన్నీ చల్లారిపోయిన సంసారాలు. అవును. అంతమాత్రంచేత?

అన్న: పరిస్థితులన్నీ ఒక్కసారి చీకటయిపోతే ఏం చెయ్యాలి తాతగారూ?

తాత: వెర్రివాడా, చావడానికి లక్ష కారణాలుంటే బతకడానికి కోటి కారణాలుంటాయి. నాసంగతే తీసుకోండి. గంపెడు సంసారం. అందరూ మూర్ఖులు. స్వార్థపరులూ - జబ్బులు - అన్నీ సమస్యలే. కాని - కాని - ఏది ఏమైనా బతకడంలో ఎంతో మాధుర్యం ఉంది నాయనా! లోకాన్ని పోల్చుకోండి. మీలోని జీవన [illegible] పోల్చుకోండి. ముందు మీకందరికీ కావలసింది ధైర్యం. మనలో ఏవొక్కరి కుటుంబం తీసుకొన్నా నికృష్టంగానే ఉంది. అంతమాత్రాన మనల్ని మనమే అసహ్యించుకుంటామా? జీవితంలోని ఆనందాన్ని పోల్చుకుందికీ, దుఃఖాన్ని సానుభూతితో చూడడానికీ ప్రయత్నించండి. నిస్సహాయతని అసహ్యించుకొనే మనుషులున్నారు లోకంలో. మీరూ అలాగే అయిపోకండి. బిచ్చగాడిని వాడి దారిద్ర్యానికి, పిల్లవాడిని వాడి తల్లి తండ్రుల మూర్ఖత్వానికి నిందించకండి.

కృష్ణ: అయితే బతికి చూడమంటారు.

తాత: విధిగా! కుర్రవాళ్లు - పడుచుతనంలో ఉన్నారు.

అన్న: మీరు యిన్నేళ్లు బతికారు గదా! మీరు అనుభవించిన ఆనందం ఏమిటి?

తా: బోలెడంత! - వర్షాకాలం గొడుగేసుకుంటే ఆనందం. ఎండాకాలం చన్నీళ్లు స్నానం చేస్తే ఆనందం. శీతాకాలం దుప్పటీ కప్పుకుంటే ఆనందం. బతకండి నాయనా. అబ్బాయీ, నువ్వు బొమ్మలు వేస్తావుకదూ? వెయ్యి. లోకంలో నువ్వు చూసిన ఆనందాన్ని సుఖాన్ని, మనిషిలోని మంచినీ - బొమ్మలుగా చిత్రించు. కృష్ణవేణీ! ఇందిరా - మీరిద్దరూ మీలోని స్త్రీత్వానికి సాఫల్యాన్ని కలిగించుకోండి. ఎవరికీ, దేనికీ భయపడకండి. మీరు వినవలసిన పాటలు, ఇంకెన్నున్నాయో చూడండి.

కృష్ణ: / ఇందిర: } నిజమేనండి.

తాత: అబ్బాయీ - నువ్వు కారుకింద పడిపోవాలనుకున్నావు-తప్పిపోయినందుకు ఇప్పుడెంత హాయిగా ఉందో చూశావా?

యు: అబ్బ ఎంత చలిగా ఉంది - తెల్లారవస్తోంది కాబోలు.

తాత: అవును. మీకందరికీ బతకడం నేర్పుతానుండండి.

(కాఫీ, కాఫీ అంటూ గంట వాయించుకుంటూ మనిషి)

ఏయ్ అబ్బీ; కాఫీ ఎంత?

అబ్బి: అణా బాబూ.

తా: అందరికీ తలకో గ్లాసూ ఇయ్యి. తాగండి అందరూ——...తాగారా? ఇప్పుడెలా ఉంది?

కృ: ఇలా తెల్లారుఝామున రోడ్డుమీద లాంతరు కాఫీ ఎప్పుడూ తాగలేదు. ఎంత బాగుంది. నీళ్ళ కాఫీయే అనుకోండి. అయితేనేం - ఇలా తాగడం బాగుంది.

ఇం: మరే! ఎందుకో ప్రాణం లేచి వచ్చింది. మీరు గొప్పవాళ్లు తాతగారూ.

తా: చూశారా మరి. మనిషికొక్క అణాతో అందరికీ మళ్లీ ఎంతఆశ వచ్చిందో.

కృ: మరిచిపోయిన ఆశలు మళ్లీ జ్ఞాపకవొస్తున్నాయి...తెల్లవారుతోంది.

యు: ఇంకో నూతన ప్రభాతం!

మధ్యచిత్రము కర్రముగ్గు, పేరు సాలెగూడు. ఇరువైపులనున్నవి ముత
పేరు చిడుతలు. అంచు రత్నాలముగ్గు, మారేడు దళములు.

"ప్రాతః కాలమునందు గోమయం దెచ్చి
అలికిన అత్యంత పాపములు బాయు.
ముగ్గున పద్మములు పెట్టి రెవరైనా
మూడు లోకంబుల ముక్తులై యుంద్రు.
పద్మాన పంచవన్నెలు గూర్చి రెవరైనా
లెక్కలేని పుణ్యఫల మనుభవింత్రు."



జాప్రదేశముల అలంకరించు
అష్టదళ పద్మము

చిత్రకారుడు —
గొల్లపల్లి
వెంకటేశ్వర
రావు



# సంక్రాంతి బాల

కవికొండల వెంకటరావు

1

వామనుడు మావాడు
బలుడు మావాడు!
కోసిన చేలోను
చిరుకప్ప గంతె!
కుప్పక్రింద కలుగు
ఎలుక యిప్పించె!
సంకురాతిరి బాల
భోగి పిడకలు తెచ్చి
పొద్దున్నె మంటేసె!
ఆ రోజు భోగిగా
అంద రారగించి!
పులగమూ బెల్లంబు
పొదుపుగా మఱిగి!

2

వామనుడు మావాడు
బలుడు మావాడు!
మరునాడు బొబ్బట్లు
వరుసగా తినిరి
కనుమనాడూ వారి
కనబడకపోయె!
సంకురాతిరిబాల
తా ప్రేలుపెట్టి
గారికి బ్రాగుంచి,
బుగ్రోంచె బలిని!
బలుడు ఆదారంట
పాతాళ మేగె
వామనుడు భక్ష్యంబు
విందారగించె!

3

సంకురాతిరి బాల
చక్కన్ని బాల!
ముత్యాల ముగ్గులా
ముద్దుల్ల బాల!
రతనాల రాజనాల
రంగుల్లబాల!
సాలుసాలున వచ్చి
వరవి మూన్నాళ్లు
తెరవు చూపించేని
తెనుగుదేశాన!

లముగ్గులు,



రత్నాలముగ్గు,
బ్రహ్మముడి

# సంక్రాంతి

## (సంగీత రూపకం)

ప్రయాగ
కోదండరామశాస్త్రి

పాత్రలు:

కవిత
జనత
ప్రభుత
శాస్త్రవేత్త
సేనాపతి
అంగారకుడు

**కవిత**

చూడు చూడు తెల్లదాలు
చుక్కల వలకంటి మీలు,
ఆకాశపు బొంగరాలు
రాకాశి సంగడీలు ..
నింగి వన్నెల విసనకర్రా
రంగురంగుల రాణిరా,
వలిమిఱుల్ మేలుముసుగు వేసి
మిలమిలల్ విరిసేనురా!
చూడు చూడు తెల్లదాలు
చుక్కల వలకంటి మీలు



దూడా బసవన్న

సి. వి. నారాయణ, (ఒంగోలు)

**శాస్త్రవేత్త:**

కవితా, చాలు నీ కల్పన;
కలగటానికేం, సత్యం
కనిపెట్టటమే మహాత్వం
కదా—అదే నాకు నిత్యం!
ఆకాశపు బొంగరాలు
అగుపిస్తున్నా యిప్పుడు;
అదే నేను చూస్తున్నా,
అదే ఆలోచిస్తున్నా!
జగతి వికాసంకోసం
జనత విలాసంకోసం
ఆకాశపు బొంగరాల
అంతు కనుక్కుంటాను!

**జనత**

ఆకాశపు బొంగరాలు
ఆడుకోను పనికొస్తాయా?
రాకాశి సంగడీలు
మాకోసం దిగి వస్తారా?
యుగాలుగా చూస్తున్నాం
తెగుతుందేమో ఈ చెర,
యుగాలె గడుస్తున్నా
తెగది లేదీ సంకెల!
జనమంతా మేమంతా
దినగండపు నిండు బ్రతుకు
మోయలేక మోయలేక
మోస్తున్నాం, చస్తున్నాం!
చావుకూ బ్రతుకుక్కూ నడి
సంధ్యలోని అంధ్యంలో
కష్టాలను మోస్తూ, దుః
ఖాలను నెమరేస్తున్నాం!

**శాస్త్రవేత్త**

జనతా, మీకోసం నే
కనిపెట్టిన వెన్నో కద
తీగలోకి తేజస్సును
దించి నించి నానుగదా!
దేశకాల పాత్రల స్వా
ధీన పరచినాను గదా!

**జనత**

ఏమోలే, అవి అన్ని
శ్రీమంతుల వింతలులే!
జనమంతా మేమంతా
దినగండపు నిండు బ్రతుకు
మోయలేక మోయలేక
మోస్తున్నాం, చస్తున్నాం!

**ప్రభుత:**

ఎవరు? ఏమి ఆందోళన?
చస్తున్నారా? ఏం మోస్తున్నారని?
బ్రతుకులు మోస్తున్నారా?
పాపం, దింపెయ్యండి, బరువు!
శాస్త్రవేత్తా, పోనీలే
వాళ్ళమాటల కేం?
గ్రహాంతర ప్రయాణానికి
కావలసిం దింకా ఏమిటి?

విమానాలు విజృంభించి
విహాయసం చూస్తున్నై,
అణుశతఘ్నులాకాశపు
టవధులు పరికిస్తున్నై;
ఆలస్యం దేనికి
అనుమతించు!
క్షణంలో చంద్రగోళం
జనంతో నింపుతాం!

శాస్త్రవేత్త:
ఔను ప్రభుతా
అంతే అనుకున్నాం:
అయినా, అనుమానం పెద్దది
ఆకాశం చూసినకొద్దీ
ఆలోచన కవసరమున్నది
అనుమానం ధ్రువపడుతున్నది!

ప్రభుత:
అన్నీ తయారై
అనుమానం ఏమిటి?
అన్నిటికీ సిద్ధమై
ఆలోచన లేమిటి?

శాస్త్రవేత్త:
అదే తేలలేదింకా
అదే ఆలోచిస్తున్నా—
చంద్ర మండలం చుట్టూ
చక్రాకృతులై ఏవో
వియచ్చర ప్రకృతులై
విలాసించు తున్నై...

ప్రభుత:
అవి ఏవో పొగ మబ్బులు
ఆ లోకపు మంచు జడులు;
ఆలోచన లెందుకయ్యా,
అణు శతఘ్నులుండగా?

శాస్త్రవేత్త:
బలవ ద్వ్యసనంలో
భయం తప్పని సరి!
అవి మబ్బులు కావుసుమా,
ఆ లోకపు విమానాలు!
ప్రళయాణు శతఘ్నిగోళం
ప్రయోగించి చూచాను;
ప్రక్కకొదిగి తప్పుకుంటూ
పయనం సాగిస్తున్నై...

ప్రభుత:
చంద్ర మండలం మీద
జనం లేరనుకున్నాం;
జనం లేని విమానాలు
చరించటం సాధ్యమా?

శాస్త్రవేత్త:
సాధ్యమో అసాధ్యమో...
సాధ్యం కాదని ఏమిటి?
స్వరూపాలు కన్పిస్తున్నై,
శబ్దం వినవస్తున్నది!

కవిత:
నింగి వన్నెల విసనక్రా
రంగు రంగుల రాణిరా...
అగుణమై సగుణాత్మకమ్మై
అవధి లేకే సావధికమై
రూపరస గంధాది కమ్మల
రూపమై దరిసేనురా...
నింగితారలై నిలిచిన
నిర్గుణ తేజఃపుంజం
వేల లధిగమించేనో,
నేలకు దిగివచ్చేనో...
చూడు చూడు తెల్లడాలు
చుక్కల వలకంటి మీలు,
ఆకాశపు బొంగరాలు
రాకాశశి సంగడీలు...



పరుగులుతీసే ప్రతిబింబాలు — ఫొటో:— కె. ఎస్. కామరాజు, (విశాఖపట్నం).

# సంక్రాంతి

నింగివన్నెల విసనకర్రా
రంగు రంగుల రాణిరా...

శాస్త్రవేత్త:
కవి వాక్యం విన్నావా ప్రభుతా,
కల్పనలో పొదివిన వాస్తవత!

ప్రభుత:
ఓ నతిదేమో
అంటున్నాడు...
అతని ఊహాలన్నీ అంతే
అతనికి తెలీవు బహుశా -
అందుకే కవిత్వమంటే
అందరికీ ఔదాసీన్యం;
అందుకే కవిత్వమంటే
ఆకాశం గగనం శూన్యం!

శాస్త్రవేత్త:
కవివాక్యం నిజం కాదను;
కాదని ప్రయోజనం లేదు!
మరోలోకం మనుషులు
మనపై కను వేశారేమో,
ధరిత్రిచే నిరంతరం
పరిశీలిస్తున్నారేమో,
చంద్రమండలం చుట్టూ
చరించే విమానాలు
కుజగ్రహంనుండి విడిచి
మజిలీ చేశాయేమో?

ప్రభుత:
అంగారకగోళంపై
అనుకొన్నది దండయాత్ర;
దారిలోని శశిమీదనె
పోరైతే మరీ నయం!
అణు శతఘ్ని గర్జనలో
అణుగోళపుటగ్నులలో
అంగారక జనసంఘం
పొంగు తరిగి లొంగుతుంది!
వారివిమానాలె మనకు
దారిచేసి పెడతై;
హతశేషులు బానిసలై
అనుసరించుతారే!
ఆలస్యం తగదింకా
ఆలోచన ఎందుకయా?

శాస్త్రవేత్త:
భయంకరం దారుణమీ
పరిస్థితిని మరువబోకు!
అంగారకు చిచ్చుకంటి
కద్దు కలదె ఎదురొడ్డిన?

ప్రభుత:
భయం తగదు; దండనీతి
పట్టున జాప్యం కూడదు!
శత్రువుకంటె ముందర
శతఘ్ని ఝళిపింతు మిపుడు!

శాస్త్రవేత్త:
అయినా మన విమానాలు
ఆకాశ మధఃకరించి
శశిబింబం చేరుతవో
శరిసగాన అగుతవో...
ఇది వినోదవేళ కాదు,
అదిగో పగలా దిగు పొగ!
కనుము దూరదర్శినిలో
విను దూరశ్రవణికలో...
[అతిదూరాన విన్పడే అస్పష్ట ధ్వనులు]

ప్రభుత:
మనమైపే దిగుతున్నై
మనపైకే వస్తున్నై...
సేనానీ! సేనాపతీ!
సేనలు సిద్ధం చెయ్యి!
అణుశతఘ్నులన్నీ ఇట
అహర్నిశం కాపుంచుము!
దిగే విమానం సగంలో
పొగలెగ్రక్కుతూ పడాలి!
అంగారకు డెవడైనా
అవనిమీద అడుగిడితే
అతిడా క్షణ మాయుధాగ్ని
కాహుతియై పోవాలి!...
ఓ ధరా కుమారులార,
ఓ పరాక్రమార్కులాగ,
జనులారా, ఘనులారా,
సన్నాహం కండయ్యా!...
కవులారా, రవులారా,
కంఠం విప్పండయ్యా!...
కుటిల వ్యూహం పన్నిన
కుజగ్రహం బారినుండి
ధాత్రీ మాతను గండం
తప్పించను రండయ్యా!
జనులారా, ఘనులారా,
సన్నాహం కండయ్యా..
కవులారా, రవులారా,
కంఠం విప్పండయ్యా...

కవిత:
నింగి తారలై నిలిచిన
నిర్గుణ తేజః పుంజం
వేల లధిగమించేనో
నేలకు దిగివచ్చేనో
చూడు మాడు తెల్లడాలు
చుక్కల వలకంటి మాలు

ఆకాశపు బొంగరాలు
రాకా శశి సంగడీలు
కారు చీకటులు క్రమ్మిన
కాటికి నేలపై కాంతులు
కత్తులవలె దిగు నేమో
కరుణ హత్తుకొను నేమో
నింగి వెన్నెల విసనక్రా
రంగు రంగుల రాణిరా,
వెలి మొయిల్ మేల్ముసుగు వేసీ
మిలమిలల్ విరిసేనురా...

ప్రభుత :
మాతృధాత్రిపై భక్తి
మరచిన కవనం దేనికి?
కవులారా, రవులారా,
కంఠం విప్పండయ్యా!
జనులారా, ఘనులారా,
సమరానికి, జన విముక్తి
సమరానికి, అరిసూదన
సమరానికి సాగండయ్యా...

జనత :
జనవిముక్తి సమరాలని
సమరాంతక సమరాలని
శాంత్యుద్యమ సమరాలని
సవన పశువులం మేమా?
ఎన్నో యుద్ధాలకొరకు
ఎందరమో చచ్చితిమే,
విరిగిన ఎముకలు మాపై
విజయ మెవరిదో ఐనది!
ఏ సమరం మాకెందుకు
ఏదేమయినా కానీ—
మా దుస్థితి మారదు కద,
మా సంకెల తెగదు కదా?
గెలుపైనా ఓడైనా
ఫలితంలో మా శోకమే!
జనమంతా మేమంతా
దినగండపు నిండు బ్రతుకు
మోయలేక మోయలేక
మోస్తున్నాం, చస్తున్నాం!

ప్రభుత :
ఆ మాటా నిజమే మరి,
అవసరాలు తీరలేదు;
అయినా ధాత్రీమాతకు
అపచారం చేస్తారా?
ఓ ధరా కుమారులార,
ఓ పరాక్రమార్కులార!
జనవిముక్తి సమరానికి
సాగండీ మున్ముందుకు!

జనత :
అపచారం ఉపచారం
అన్నీ మా శోకమేలే;
ఉపచారం చేసినపుడు
ఒరిగిన సౌఖ్యం ఎక్కడ?
ధరాకుమారుడవు నీవె,
ధరాధినాథుడవు నీవే!
పరాక్రమం చూపుకో,
పరాక్రమణ బాపుకో!
గెలుపైనా ఓడైనా
ఫలితంలో మా శోకమే!

సేనాపతి :
సేనానిని నే - ప్రభుతా,
సేన సర్వసన్నద్ధం!
వియత్పథం విలోకిస్తూ
శతఘ్ని లావులిస్తున్నై,

# ★ సంక్రాంతి ★

విహాయసం గాలిస్తూ
విమానాలావరిస్తున్నై,
నడగొండలవలె టాంకులు
కడల క్రమ్ముకుంటున్నై,
కడలి కెరటమై గుర్రపు
దడము తెరలి వస్తున్నది,
ఎల్లెడలా నిండి బలం
పెల్లుబుకుతు దుముకుతోంది...
సేనానిని నే - ప్రభుతా,
సేన సర్వ సన్నద్ధం!
[వివిధ సేనాదళాల విన్యాసాల
కోలాహలం]

ప్రభుత :
అజయ్య మీ సైన్యబలం
అజేయులం మానవులం :
విజయమొ వీరస్వర్గమొ
వీరవరుల కొకే బాట!
వెనుజూపిన పిరికిపంద
మన గూడదు మన నేలను,
వీరులైన వారలనే
విజయలక్ష్మి వరిస్తుంది!
మొన చెదరక నిలిచి గెలిచి
మనుడయ్యా, చిరకాలం!
ఇది ధాత్రీమాత ఆజ్ఞ,
ఇది మానవజాతి నీతి!
[మళ్లీ సైనిక విన్యాసాలు]

శాస్త్రవేత్త :
అవిగో...
అంగారక విమానాలు
ఆకాశం దిగివస్తున్నై,
మిడుతల పెనుదండులాగు
కడలొరసి వస్తున్నై...
అనంత వేగంతో అవి
అవని వంక దిగుతున్నై,
అణు కవచము లలవరించు
కొనుడయ్యా సేనానులు!
ఫిరంగు లాకాశానికి
గురిపెట్టండయ్యా!
వ్యవధి లేదు,
వ్యవధి లేదు!...

ప్రభుత :
ఫిరంగులూ విమానాలు
విరజిమ్మండి నిప్పులు!
వ్యవధి లేదు,
వ్యవధి లేదు!...
[విమానాల ఫిరంగుల మరతుపాకుల
మోతలు : విమానాల ఝుంకారం]
ఆకాశంనిండా మంటలు
అరాతుల కదే కుంపటి;
అగ్గిలోకి దూకే మిడుతలు
అంగారకు లిక మిగులరు!

శాస్త్రవేత్త :
విను నిప్పులకుంపటిలో
కనలక క్రాగక నేలకు
అవతరించుతున్నారే,
అంగారకు లరుగరుగో...

ప్రభుత :
కాదయ్యా శాస్త్రవేత్త
కనులువిప్పి కాంచుమహో...
వాహనముల దొరగి చచ్చి
పడిపోయే పీనుగులవి,
విమానాలు మండి మాడి
విరిగిపడే పీనుగులవి!
అంగారకు లిక నేలకు
అవతరించు మాట కల్ల...
[ఫిరంగుల ధ్వనులు]

శాస్త్రవేత్త :
అన్ని దెసల వలముకొన్న
అగ్నిగోళముల కాంతుల
నడిమి నీలి జల్లెడలో
పలుసులై దిగేరు చూడు!
ప్రభుతా జాగ్రత, జాగ్రత!
పరాకువిడి, పరాక్రమించు!

ప్రభుత :
సేనానులు, సైనికులూ,
చెదరకండి! బెదరకండి!
పురి వలపటి దీటవంక
కురిపించండీ నిప్పులు!!
శత్రువలే దిగుతున్నారు
సాహసం ప్రదర్శించండి!
అణు పరమాణువూ అస్త్రలతో
కణకణమని మండవలె,
దిగినవాడు బొగ్గువలె
పొగ గ్రక్కుతు నుసి కావలె!
[ఫిరంగుల తుపాకుల ధ్వనులు]

సేనాపతి :
అజేయులం, సైనికులారా,
అగ్గి బావుటా విప్పండి!
సాహసులై ఇక కదలండీ,
జయించి ముందుకు సాగండీ!
చుటు ముటండి,
పట్టి కొట్టండి!
ప్రభుతి మనకు వనుకవుంది;
భయంలేదు పదండి!
[సైనిక కోలాహలం]

శాస్త్రవేత్త :
అరుగో మన సైనికులపుడే
ఇరు మొనలై దరిసిరి శత్రుల;

చుట్టుముట్టుకొన్నారదె,
పట్టువడుదు రంగారకులిక!
బందీలను పట్టుకోండి!
బానిసలను పట్టుకోండి!
[తుపాకుల ధ్వనులు]

ప్రభుత :
అగ్నివాన లాపండీ,
అవకాశం ఇస్తున్నాం:
అంగారకులార, మీరు
లొంగిపోండి—మంచిది!
వ్యర్థంగా చావకండి,
బ్రతుకు తీపి వదలకండి!
తెలిసో తెలియకో నేలకు
దిగితే దిగినారులే,
తక్కిన విషయాలన్నీ
తరువాత విచారిస్తాం!
అంగారకులార, మీరు
లొంగిపోండి! మంచిది...

అంగారకుడు :
ప్రభుతవు నీవేనా?
నీ పరాక్రమం చావున్నది!
జన్మించిన ప్రతి జీవికి
చావే నీవలని వరం!
అణువిచ్ఛిత్తి నెరింగిన
ఘనత యేమి ఇదియంతా?...
ప్రయోగించి నీ శతఘ్ని
ఫలం లేదురా! కృతఘ్న...

ప్రభుత :
ఫిరంగులూ విమానాలు
కురిపించండి నిప్పులు
టాంకులూ పటాలాలు
దూకండీపై పైకి...
క్షమించకండి, క్షమించకండి!
శత్రువుల జయించండి!
[మారణాయుధాల అట్టహాసం క్షణం విని
పించి శాంతిస్తుంది.]

అంగారకుడు :
అయిందా ప్రభుతా అట్టహాసమంతా
అణుశతఘ్ని ఏమయిందో చూశావా?
లొంగితే మంచిదన్నావు,
లొంగకుంటే ఏమిటి?
బానిసలు కావాలి నీకు,
బానిసలం కాము మేము!
ఏమంటూ విప్పవు చెప్పవు,
ఇంకా లొంగమనేనా?

ప్రభుత :
దేవలోకంనుండి వచ్చిన
దేవతలు మీ రౌదురేమో...

అంగారకుడు :
నీవే భంగపడుతున్నావు;
నీ సేనలో కల్లోలం చూడవు!
పశుబలం తప్పితే నీకు
పరమార్థం లేదు!

ప్రభుత :
తోచకి సేవకుకు చేసిన
దోషముల మన్నింపరే!...

అంగారకుడు :
అవనినుండి రవిమీదకు
పయనించే పరమాత్ములు
గౌతమ శంకరులు క్రీస్తు
మామూదులు మా నేలకు
వచ్చి పంచిపెట్టిన త
త్త్వసుధాతితో మేల్కొని
కుజగ్రహం క్రూరత విడి
జీవం వికసించుతోంది!
ఆ మహాత్ము లుదయించిన
అవని మాకు పుణ్యభూమి!
అయితే వారలతో నే
ఆ పుణ్యం పూడిందని,
శాంతి సౌఖ్యములు లేవని,
జ్ఞానం కొడిగట్టిందని,
పశుబలం జయించిందని,
పాపం పడగెత్తిందని
తెలియలేదులే, ప్రభుతా,
తెలిసి తిరిగిపోతున్నాం...

ప్రభుత .
మీ రెన్నిన మహాత్ములందరు
పేరెన్నిక గన్నారిక్కడ:
వారి పేర్లమీదే మేము
పరిపాలన సాగిస్తున్నాం!
శాంతి సౌఖ్యములు కొల్లలుగా
జనత జ్ఞానవికసిత మిన్నట!

జనత :
యుగాలుగా చూస్తున్నాం
తెగుతుందేమో ఈ చెర,
యుగాలే గడుస్తున్నా
తెగేది లేదీ సంకెల!
చావుకూ బ్రతుక్కూ నడి
సంధ్యలోని అంధ్యంలో
కష్టాలను మోస్తూ, దుః
ఖాలను నెమరేస్తున్నాం!
జనమంతా మేమంతా
దినగండపు నిండు బ్రతుకు
మోయలేక మోయలేక
మోస్తున్నాం, చస్తున్నాం!

అంగారకుడు :
జనంలో అదే చేతనత్వం,
జయస్తే ధరాపుణ్యభూమీ!...
[విమానాల ధ్వనులు]

శాస్త్రవేత్త :
అదేమి టాకాశంలోకి
అంతలోకే ఎగిరిపోతున్నారు?...

ప్రభుత :
పోనీలే అదే మంచిది;
ఈ గండం తప్పిం దిప్పుడు!...
సైనికులూ, సేనానులు!
జయభేరులు మ్రోగించండీ,
జయకేతన మెత్తండీ!
శత శతఘ్ను లొక్కసారి
సారించండి దిక్కుల!
అజయ్య మీ సైన్యబలం
అజేయులం మానవులం!
జయభేరులు మోగించండీ,
జయకేతన మెత్తండీ!...
[జయభేరీధ్వనులు : వివిధవాద్య కోలా
హలం . ఫిరంగుల చప్పుడు]

కవిత ·
నింగితారలై నిలిచిన
నిర్గుణ తేజఃపుంజం
వేలలధిగ మించినదో,
నేలకు దిగివచ్చినదో...
కారు చీకటులు క్రమ్మిన
కటికి నేలపై కాంతులు
కత్తులవలె దిగివవిలే,
కరుణ మాత్తుకొన్నదిలే...
చూడుచూడు తెల్లడాలు
చుక్కల వలకంటిమీలు,
ఆకాశపు బొంగరాలు
రాకా శశి సంగడీలు...
నింగివన్నెల విసనకర్రా
రంగు రంగుల రాణిరా,
వలిమెయిల్ మేల్ముసుగు వేసి
మిలమిలల్ విరిసేనురా...

[అంతరిక్షంలో ఇటీవల కనిపిస్తున్న 'Flying Saucers' మరో గ్రహం తాలూకు గస్తీసేనలనే శాస్త్రజ్ఞుల అనుమానం దీనికి ఆధారం.]

★

# నీడలు




## రాచకొండ విశ్వనాథశాస్త్రి

పదిగంటల రాత్రి.

సూర్యం తప్పించి మిగతావారంతా గది వెనక నడవలో పడుకున్నారు. గదంతా గలీజాగా ఉంది. సర్దికట్టిన సామాన్లు అడ్డదిడ్డంగా పడిఉన్నాయి.

గది మధ్యని ఒక తాటాకుల చాపమీద ఒక పాతకాలపు సందుగుపెట్టె, మినుకు మినుకు మనే ఒక చేతిలాంతరూ ఉన్నాయి. సూర్యంకూడా ఉన్నాడు.

"పెళ్ళాం పిల్లలూ, డబ్బా డవాలా! కొన్నాళ్ళు కట్టకట్టుకొని తిరగడం, చివరకి ఎక్కడో అక్కడ విడిపోడం" అనుకున్నాడు సూర్యం, సాధారణంగా అటువంటి సందర్భాల్లో అందరూ అనుకొనేట్టుగానే.

దాదాపు ఇరవైసంవత్సరాలు, ఓ కంపెనీ వారి ఆఫీసులో, ముక్కవాసన వేసేగదిలో, వెల్తురు అందని ఒక మూలని కూర్చొని టైపిష్టుగా పనిచేసిన వెంకటసూర్యం ఒక ఏడాదినుంచీ ఆపని చెయ్యడంలేదు.

కంపెనీ ఉంటేకదూ, అందులో పని చెయ్యడానికి?!

ఎక్కడో ఎవడో మోసం చేస్తాడు. ఎక్కడెక్కడో, ఎందరెందరో దెబ్బ తింటారు. మంచు మాయమయినట్టుగా కంపెనీ దివాలా తీసి మాయమయింది. వెంకటసూర్యం వీధినిపడ్డాడు.

తరువాత ఈ సంవత్సరమంతా ఎలా గడిచిందో భగవంతుడెరుగును. అంతా ఒక యుగంలా నడిచింది. ఒకపీడకలలాగడిచింది.

మరింక దాని గురించి ఆలోచించి వగచి ప్రయోజనం లేదు.

"మన పరిస్థితి ఇంకా నయమే."

ఏదో మళ్ళీ ఓ ఉపాధి అంటూ ఒక ఏడాదికైనా దొరికింది. ఒడ్డునపడేసిన చేపల్లా ఇంకా కొట్టుకుంటూనే ఉన్నారు మిగతా వాళ్ళంతా.

కొత్త నౌకరి దొరికిందన్నమాటేకాని ఎక్కడ దొరికిందంటారు?

మూడువందలమైళ్ళ దూరంలో.

ఉడుకురక్తం ఉన్నప్పుడు "ఎక్కడైతేనేం!" అనిపించేది. అప్పుడు ధీమాగా కాలం గడపగలిగేవాడు. అంతా అడ్వెంచరస్‌గా ఉండేది. ఇప్పుడు ఏదో ఒక రస్తాని బండీ లాగడం అలవాటయిపోయింది. అందులోనూ పోయేకాలమే కాని వచ్చేకాలం కాదు. ఇటువంటప్పుడు పొట్ట చేత్తో పట్టుకొని, బండెడు సంసారాన్ని ఈడ్చుకొని, ముక్కూ మొహం ఎరగని పరాయి దేశానికి, అంతదూరానికి పోవాలంటే గుండె నీరుకారిపోతోంది.

ఆలోచించి వగచి ప్రయోజనం లేదు.

తిండికోసం పశువులు కొండలకైనా పోయినట్టు, కొరడావులకైనా పోసాహసించినట్టు, ఎక్కడకైనాసరే, ఎంత దూరానికైనా సరే, ఈ పిలా జల్లా, ఈ డబ్బా డవాలా, ఈ బాదరబందీ అంతా నెత్తిని వేసుకొని "అలో లక్ష్మణా" అనుకొని పోవలసిందే

కానీవయ్యా, ఏం చేస్తాం!

పనికొచ్చేవైనా మోసుకు వెళ్ళలేనివన్నీ అమ్మి పారేశావు కదా. విలువగల వస్తువులకి కాళ్ళొచ్చి ఏనాడో ఇంట్లోంచి నడిచి పోయేయికదా. ఆనాడు చెమటోడ్చి సంపాదించగా మిగిలినవో, ఈనాడు చెయ్యిజారి తెచ్చినవో, లేక గిన్నే ముంత అమ్మగా వచ్చినవో, ఏవో నాలుగు రాళ్ళున్నాయి కదా రేపు సాయంకాలం ఆ ఎలుగురు పిల్లలూ, నువ్వూ, నీ ఆడదీ, టిక్కెట్లు కొనుక్కొని సామాన్‌తో సహా గాడీ ఎక్కుతారు. ఎల్లుండి అక్కడెక్కడో దిగుతారు. ఏ చెట్టుకిందో, ఏ సత్రంలోనో ముకాం పెడతావు. అక్కడ మరో చీకటి కొట్లో నువ్వూ నీ టైపుమెషీనూ తయారు.

బతకపోవు ఫరవాలేదు.

బతకపోయినా ఫరవాలేదు, నీ పెళ్ళానికీ పిల్లలకీ తప్పించి.

ఇహ, నీ తరవాతివాళ్ళ మాటా అడుగుతావు?

అంతటా వినిపించే పాట విన్నావు కదూ. "ఎవరికి వారే యమునా తీరే"

రాత్రి పదిగంటలే అయింది. నిశ్శబ్దంగా ఉన్నది గది ఎర్రగా, నిశ్శబ్దంగా ఏడుస్తున్నవి గదిగోడలు. మూలనున్న సామానంతా పైకి తర్లిపోవడం చేత, ఏళ్ళతరబడి భద్రంగా దాగున్న చెత్తా చెదారం అంతా ఎక్కడిదక్కడే, ఏం చేయాలో తోచనట్టు, ఉండిపోయింది. తారు పూసిన రెండు కిరసనాయిలు



ప్లేట్లూ, అరువన్నెండు పులిమిన ఒక దేవ
దారు పెట్టే, ఒక గోనెసూటాా, కొబ్బరి
తాళ్ళ మడతల్లో మూలుగుతున్నాయి.

సూర్యానికి నిద్ర రావడంలేదు. అతనికి
సంబంధం ఉన్నంతవరకూ ఆ పూరి కది
ఆఖరి రాత్రి.

“ఈ పూటికి రేపు పాసెంజర్లోనూ,
ఎల్లుండి మరో పూళ్ళోనూ ఉంటాం.
ఇవాళ, రేపు, ఎల్లుండి. ఖర్మ నడుస్తోంది.
కాలం కరిగిపోతోంది” అనుకొంటూ
ఇందుకు పెట్టె తలుపు తెరిచేడు సూర్యం.

అందులో ఏవేవో ఎన్నెన్నో కాయి
తాలున్నాయి. ప్రాణాలు ఉండవలసిన
కాయితం ఏదైనా సరే అందులో ఉన్న
దన్నమాటే.

ఈ కాయితాలేమిటో చూసి, పనికి
రానివేవో అంటించిసారేయవచ్చు. అబ్బా,
ఎన్ని కాయితాలున్నాయి!

నూనె పట్టినవి, పురుగులు కొట్టినవి పైకి
తీస్తుంటే చాలా కాయితాలు వస్తు
న్నాయి.

ఉత్తరాలు, ప్రత్యుత్తరాలు, బిల్లులు,
రశీదులు, సర్టిఫికేట్లు, తాఖీదులు, చిరు
నామాలు, పూర్తి పరిష్కారం చేసిపుచ్చు
కున్న ప్రానోట్లు, లాయర్లు పంపిన కొన్ని
నోటీసులు, పంపిన ప్రత్యుత్తరాల నకళ్ళు,
అంకెలు, పద్దులు, మనియార్డర్ల రశీదులు,
శుభలేఖలు, వగైరా వగైరాలు. ఒకటి ఏక
దాని వెనక ఒకటే వస్తున్నాయి తీస్తుంటే.

ఇదేదో జాతక చక్రం.

సంవత్సరం, మాసం, తిథి, వారం,
నక్షత్రం, నక్షత్రపాదం, ఘడియ, విఘ
డియ, లగ్నం, దశా శేషం.

ఎవరిది?

చిరంజీవి వేంకట సూర్యనారాయణ
జాతక చక్రం ఇది.

పొగబట్టిన గోడలకి వేసిన సున్నం
అరగా వచ్చే రంగులా పాతగా, ఎర్రగా
ఉంది కాయితం. నాలుగు వైపులా పసుపు.
ముద్దగా పసుపులో శ్రీకారం. శుభం
శుభం.

సూర్యం పుట్టినప్పుడు తాత వేయించిన
చక్రం కాబోలు. తాటాకుల మిద్దెయింట్లో,
నూనెదీపం దగ్గర కూర్చొని, చుట్టకాలుస్తూ
ఏ పంతులో రాసి ఉంటాడు. వాసన
చూస్తే పాతవాసన వేస్తోంది.

ఎంతటి పాతమనిషి ఈ వెంకటసూర్యం!

“ఈ అరువదియున్నూ తెలుగు సంవత్స
రముల పేళ్లు” “ఈ పన్నెండున్నూ తెలుగు
మాసముల పేళ్లు” అనే మాటలే తనకి
జ్ఞాపకం ఉన్నవి. సంవత్సరాలవీ, నెలలవీ,
పేర్లు మాత్రం ఎగిరిపోయేయి. ఇంగ్లీషు తేదీ
గుర్తుకు తెచ్చుకోవాలిప్పుడు.

పుట్టినరోజు ఎప్పుడు వస్తుందో బాగా
గుర్తుంచుకొని, దానికోసం కాచుకూర్చొని,
ఆ సుదినానికి స్వాగతం చెప్పి, సాగనంపిన
కాలం ఏనాడో పోయింది. ఇప్పుడు అది
ఏరోజో, వస్తుందో లేక వెళ్ళిపోయిందో
గుర్తుకు తెచ్చుకోవాలి.

ఊఁ, అవును. మూడురోజులా అయింది
సెప్టెంబరు ఇరవై దాటి. అంటే మనకి నలభై
అయిదేళ్లు దాటియున్నమాట.

కాలం కరిగిపోతోంది. కాయితం పాత
వాసన వేస్తోంది. మరికొద్ది దినాలకి మనం
ముసలికంపు కొడతాం.

అయితే నలభయ్యయిదేళ్ళు దాటిపో
యాయా?

వెళ్ళేయి. వెళ్ళకేం చేస్తాయి!

వెళ్ళిపోతోన్న ఈ రోజులన్నీ ఎక్కడికి
వెళతాయి చెప్పు.

ఏళ్ళన్నీ ఏట్లోకి వెళ్తాయి. మనమంతా
కాట్లోకి పోతాం.

జాతకచక్రం పాతబడి కాయితాల్లోకి
పోయింది. పెట్టెలోంచి మరికొన్ని కాయి
తాలు పైకి వచ్చాయి.

ఒక కవరు.

జిల్లాల బ్రాంచి పోస్టాఫీసు ముద్ర



# నీడలు



పక్కనే జలందర్ కంటోన్మెంట్ పోస్టు ముద్ర. రెండవ పక్క అడ్రెసు: AT. 17645. నాయక్ వెంకటరమణయ్య, నెం. 7, అనిమల్ ట్రాన్స్‌పోర్టు కంపెనీ, జలందర్.

కవర్లోంచి లాంతరు వెలుగులోకి భయపడుతూ వచ్చింది ఈ ఉత్తరం. పంధొమ్మిదివందల పదహారో సంవత్సరంలో సూర్యం మేనమామ సూర్యం తండ్రికి రాసిన జాబిది. "అయితే ఆ తరవాత కాబోలు, నాయన హావల్దారవడం, తరువాత చచ్చి చెడి జమేదారవడమూను"

ఈ ఉత్తరం నడుస్తోంది: "...అక్కయ్యకి పత్యం పెట్టేరు. మంచంమీంచి లేచి ఇంట్లో కొంచెం తిరగాడగలుగుతోంది. చి॥ సూర్యం స్కూలుకి వెళ్తున్నాడే కాని రెండురోజులకి ఒకసారి జ్వరం తగుల్తోంది. వాడి కోసం గాలి పోసుతుందేమోనని భయపడి పోతున్నాం. ఇది ఇలా ఉండగా, మా పెద్దమ్మ మా అమ్మని ఎందుకో రమ్మని కబురు చేసింది. నిల్చున్నపాటున మా అమ్మ అక్కడికి పరిగెట్టింది. ఇహ ఇంట్లో చాకిరీ చేసేవాళ్ళెవరూ లేరు. నా ఆడమనిషి ఎటువంటిదో నీకు తెలుసుకదా. అందులోనూ దానికి ఎడపిల్ల. అందుచేత అన్నీ నేనే చూసుకొని చేసుకోవలసి వస్తోంది. నువ్వు సొమ్ము పంపిస్తున్నట్టు లోగడ రాసేవు. ఇంతవరకూ సొమ్మూ లేదు. నీదగ్గరనుంచి మళ్ళీ కబురూ లేదు. ఇక్కడ పరిస్థితులు ఎంత ఇరకటంగా ఉన్నాయో నువ్వోక్కసారి వచ్చిచూస్తే తెలుస్తుంది..."

అక్షరాల నలుపు ఇప్పుడు తెలతెలపోతోంది. కాని, అప్పట్లో ఎంతో నల్లగా మెరిసిన ఈ అక్షరాల్ని చూసుకొని నాయక్ రమణయ్య ఏమనుకొని ఉంటాడు? ఊహించవచ్చు. కాని, గడచిన చిక్కుల గురించి ఇంకా ఊహాలెందుకు?

ఈ ఉత్తరాల్లోని ఈ పాత విచారాలన్నింటినీ చాపమీది చరిత్రలో కలిపెయ్. అంతా కలిపి అఖర్న తగలెట్టవచ్చు.

కాయితాలకి మడతలు విడుతున్నాయి. మడతలు మళ్ళీ పడుతున్నాయి. చాపమీదికి వెళుతున్నాయి.

నాయనకి అమ్మ సాష్టాంగదండప్రణామములాచరించి వ్రాయుంపించిన ఉత్తరముల అంశములు చి॥ వెంకటసూర్యాన్ని ఆశీర్వదిస్తూ బాగా చదువుకోమని చెప్తూ నాయనరాసిన జాబులు. మూడో ఫారం క్వార్టర్లీ పరీక్షలో వచ్చిన మార్కుల లిస్టు. ఇంగ్లీషులో ఇరవై కి సైన్సులో పన్నెండు. "శనివారం మెయిల్లో వస్తాను. అన్నివిషయాలూ మాట్లాడుకోవచ్చు" అని ఎవరో ఎక్కణ్ణుంచో పంపిన కార్డు. ఉద్యోగానికి దరఖాస్తు పెట్టగా వచ్చిన ఒక జవాబు. జవాబు రాని ఒక అర్జీ. ఎవరిదో అడ్రెసు. ఏవో అంకెలు. ఇదేదో శుభలేఖ.

"...చిరంజీవి వేంకట సూర్యనారాయణకు... చిరంజీవి సౌభాగ్యవతి రాజరత్నమ్మను యిచ్చి వివాహము జరిపించుటకు పెద్దలు నిశ్చయించినారు గాన, ఏతత్ శుభ ముహూర్తమునకు..."

పెద్దలు నిశ్చయించిన, ఒకనాటి నడిరాత్రి శుభముహూర్తాన్నే జరిగిన ఈ పెళ్లి మాటకూడా తలపెటకూడదు.

ముసిబొగ్గులా తయారైన రాజరత్నమ్మ రామనామస్మరణ చేసుకొని ఇప్పుడిప్పుడే పడుకున్నది.

అన్ని పెళ్ళిళ్ళూ శుభముహూర్తాల్లోనే జరుగుతాయి. కాదని ఎవరన్నారు.

వరసగా కాయితాల్ని చూడ్డమే కాని పూర్తిగా చదవకుండా మరికొన్ని కాయితాల్ని తీసి కిందనిపడేసి "ఇంకా ఎన్ని ఉన్నాయి?" అనుకొంటూ పెట్టెలోకి చెయ్యిపెట్టి తీసేసరికి సూర్యం చేతిలోకి పాతఅట్ట ఒకటి వచ్చింది.

అట్టని దీపానికి దగ్గరగా పెట్టి చూసేడు సూర్యం.

'విరిగిన ఇటికలూ, రాలిన పెంకులూ తప్ప ఇంకేం ఉంటాయి' అనుకొని అడుగుపెట్టిన పాడుపడిన ఇంట్లో ఓ గదిలో గోడని రంగులపటాలు—పాతవే అనుకోండి—కనిపిస్తే ఆశ్చర్యపోయినట్టుగా ఆశ్చర్యపోయేడు సూర్యం తన చేతిలోని పాతఅట్టని చూసి.

చూసేడు. కొంతసేపు చూసేడు. మరి కొంతసేపు చూసేడు. చాలా సేపు చూసేడు.

నెలదినాల కిందట ఒక పిక్చర్ చూసేడు సూర్యం. 'మనసేమీ బాగులేదు. పోనీ కాస్సేపు సినిమాలో కూర్చొని వద్దాం' అనుకొని బయల్దేరి వెళ్లేడు. టిక్కెట్టు తీసుకొని హాల్లోకి వెళ్ళి కూర్చున్నాడు' లోపల ఎవడూ లేడు. హాలంతా శవాలకోసం ఎదురుచూసే శ్మశానంలా ఉంది. చివరికి ఎలాగైతేనేం ఓ పాతికశవాలు కాబోలు చేరేయి నెమ్మదిగా. దివ్యాదివ్యామనే థియేటర్లో చాలా సేపుదిక్కులు చూస్తూ కూర్చోగా ఆట ఆరంభించేరు. ఆరంభించేక తెలిసివచ్చింది సూర్యానికి ఆ పిక్చరు తనిదివరకు చూసిందేనని.

ఇరవై సంవత్సరాల పైచిలుకు అయుండవచ్చు, ఆ చిత్రాన్ని మొదటిసారి చూసి. అప్పట్లో అది చాలా పాప్యులర్ పిక్చర్. తిరిగి చూస్తోంటే, "ఇదేనా అప్పుడు ఎంతో బావున్నదనిపించిన చిత్రం!" అనే ఆశ్చర్యం కలిగింది.' చనిపోయినవారందర్నీ పిలిపించి తిరిగి తెరమీద కెక్కించినట్టుగా, మిక్కిలి బాధాకరంగా ఉంది.

అయ్యయ్యో ఇదేనా ఆ చిత్రం!

ఇందులో నటిస్తున్నవాళ్లు కొంతమంది బతికే ఉన్నారు. ఇప్పటికీ సినెమాల్లో నటిస్తూనే ఉన్నారు. కాని, అప్పటికీ ఇప్పటికీ ఎంత మార్పు! ఇందులో ఎంతో పాతగా కనిపిస్తున్నారేకాని, ఎంతలేతగా ఉన్నారు! ఈ బొమ్మలో కనిపిస్తూన్నట్టుగా వాళ్ళిప్పుడు లేరు. మళ్ళీ ఎప్పటికీ ఉండరు. కొంతమంది ఏదోవిధంగా ఉండనైనా ఉన్నారు.

కాని, మిగతావాళ్ళంతా ఏరీ?

రాణీగారి పెంకె తమ్ముడి వేషం వేసిన కుర్రవాడే కాబోలు ఆమధ్య అకస్మాత్తుగా చనిపోయేడు. తాగుడువల్ల అయుండవచ్చు. రాజభటుల్తో మాట్లాడ్డానికి సరదాపడే ఆడపిల్ల వేషం వేసిన ఆడపిల్ల ఆరోజుల్లో అందరికీ అభిమానతార. పెళ్లిచేసుకొని, మరి పికరేకుండా పోయింది. నవ్వుముఖంతో నటిస్తూన్న ఆ హీరో, ఆ సచివోత్తముడి కుమారరత్నం, అతనే ఈమధ్య ముసలి విలన్ పాత్రలు ధరిస్తున్నాడు. అష్టకష్టాలూ పడే ఆ బానిస పాత్ర ధరించినవాడు మరింక తెరమీద తిరిగి కనిపించనేలేదు. హీరోయిన్‌గా నటిస్తూన్న ఆ లేడికళ్ళ లేతపిల్లనే ఎవడో ఫిలిం ప్రొడ్యూసరు ఘోరంగా దగాచేయగా ఆమెకి ముఖం తిరిగి మతి చెడింది. దయగలవారెవరో చేరదీసి పోషిస్తున్నారు. అమాయకంగా అమిత విశ్వాసంతో పనిచేసే ఆ రాజానుచరుడి పాత్ర ధరించినవాడు ప్రస్తుతం ఈ వూళ్లోనే అడుక్కుతింటున్నాడు. మరి మిగతా వాళ్ళంతా? ఏమో ఏమయ్యారో! అంతా జేపికలే.

సుమారు ఇరవై సంవత్సరాల క్రితం ఆనాడు చూసినప్పుడు ఈ చిత్రమే ఎంతో బావున్నదనిపించింది. ఆనాటి రాత్రి సినెమా అయ్యాక బైటకి వచ్చేసరికి వెన్నెల తడిగా, చల్లగా ఉంది. తువ్వాలు కప్పుకొని, కథలో, హీరోయిన్నీ, సరోవరం దగ్గర దృశ్యాన్నీ తల్చుకొని నడుస్తూంటే మనసంతా వెచ్చగా కరిగింది. ఉత్సాహంతో వళ్లంతా వేడెక్కి తేలికపడింది.

కాని, ఎంతోకాలం అయ్యాక, ఎప్పటిదో అయినట్టి ఆ చిత్రాన్ని తిరిగి చూసినప్పుడు "అయ్యయ్యో" అనిపించింది. మనసుకి ఎంతో కష్టంతోచింది. ఏనాడో జరిగిపోయిన సంఘటనలో పాల్గొని ఎక్కడెక్కడికో చెదిరిపోయిన వ్యక్తులనందర్నీ బలవంతాన రప్పించి ఆ సంఘటననే తిరిగి జరిగింపించినట్టుగా ఉంది. అసలా సంఘటనే అర్థరహితం. అందులో పాల్గొన్న వ్యక్తులంతా అసమర్థులు. బొత్తిగా అనుభవం లేనివాళ్లు. వారికి చేతకాని, వారు చేయలేని పనులు వారిచేత బలవంతాన చేయించినట్టుగా ఉంది. వారుచేసే ఆక్రందనలా ఉన్నాయి వారు పాడిన పాటలు.

ఎందుకు వాళ్లనంతా అలా కష్టపెట్టడం? అర్థంలేని ఈ చిత్రాన్ని ఎందుకుతీయడం? చూసేవాళ్లు ఎందుకు చూడ్డం?

లాంతరు వెలుగులో కనిపిస్తోన్న ఆ పాత అట్టమీది ఫోటో చూస్తోంటే సూర్యానికి అదేరీతిగా ఆలోచన వెళ్తోంది. అదేరీతిగా "అయ్యయ్యో" అనిపిస్తోంది. అదేరీతిగా కష్టంగా ఉంటోంది.

చాలా సంవత్సరాల క్రితం, ఒకరోజున, గోడని వేళ్లాడే ఈ ఫోటో తాడు తెగి కిందనిపడింది. 'ఫ్రేం' విరిగింది. అద్దం బద్దలయింది. పిల్లలు తీసి పాడుచెయ్యకుండా రతనమ్మ తీసి ఈ పెట్లో పడేసిఉండాలి. తను దానిసంగతే మర్చిపోయేడు.

"ఇంటర్మీడియేట్ క్లాస్, ఫస్టియర్, 1926-27"

# ★ నీడలు ★

అని అట్టమీదఉన్న అక్షరాల్లో, అంకెల్లో, కొన్ని కనిపించకుండా పోయేయి. మిగతావి కనిపించకుండా పోతున్నాయి. అట్ట, చాలాచోట్ల, పిన్నులతో పొడిచినట్టు తూట్లు పడింది. ధూళితో నిండిన ఫోటోకాయితపు మెరుగంతా పోయింది. అంచులన్నీ పురుగు తినేసింది.

ఆ గదిలో, ఆ సమయంలో, ఆ లాంతరు వెలుగులో ఆ ఫోటోకూడా ఒక బతికి చెడ్డ మనిషిలా దీనంగా ఉంది. సాల్వేజ్ సామాన్లలోకి విసిరేసిన పనికిరాని పాత వస్తువులా ఉంది. వెలవెలపోతోంది.

ఫోటోలో ఉన్న అరవయ్యేడుగురు వ్యక్తులూ రకరకాలుగా ఉన్నారు. నవ్వుతున్నారు. నవ్వబోతున్నారు. సీరియస్‌గా ఉన్నారు. మూతులు బిగించి చూస్తున్నారు. నోళ్లు తెరచుకొని కూర్చున్నారు. అంతాకూడా వెలవెల పోతున్నారు.

సున్నంలేని గోడలమీద లాంతరు వెలుగు అర్చుకుపోతోంది. ఫోటోమీద కూడా అంతే. అందుచేత లాంతర్ని కొంచెం దగ్గరగా లాగేడు సూర్యం.

ఇంటర్మీడియేటు మొదటి సంవత్సరపు ఆఖరిరోజుల్లో, సెలవులముందు తీసిన ఫోటో అది.

ఎలా ఉండేవి ఆ సంవత్సరపు తొలిరోజులు ?

ఎలా ఉండడం ఏమిటి ? ఆ సంవత్సరం అంతాకూడా తొలిరోజుల్లోనే గడిచిపోయింది.

నిజంగా ఆరోజులు అంటూ ఎప్పుడైనా ఉండేవా ?

తెర. తెరవెనక తెర. దానివెనక తెర. తెరలు తెరలుగా సంవత్సరాలు జరిగిపోయేయి. దూరంలో కనిపిస్తోంది చిన్నదిగా ముచ్చటగా ఒక కాలేజీ. కాలేజీలో కనిపిస్తున్నారు ఉత్సాహపూరితులైన యువకులు.

నిర్మానుష్యంగా ఉన్నట్లనిపించే పాతకాలపు భవనాల్లో వరసగా పొడవుగా గదివెనక గదులుంటాయి. గదులన్నీ చీకటిగా ఉంటాయి. గది గదికీ ఎదురెదురుగా ఉన్న తెరుచుకొన్న ద్వారాల్లోంచి దూరంలో ఒక చిన్న పెరడు కనిపిస్తుంది. అక్కడ తెల్లటి తులసికోటలో గుబురుగా పెరిగిన తులసిమొక్క ఉంటుంది. ఒకపక్కకి పచ్చటి బంతిపూల మొక్కా, దానివెనకనే ఒక సన్నజాజి తీగా కనిపిస్తాయి. అక్కడ సీతాకోక చిలకలు ఎగురుతూ ఉంటాయి. అక్కడ ఎండ పచ్చగా ఉంటుంది. తులసికోటకి కొంచెం ముందుకి తళతళ మెరిసే ఇత్తడి బిందె ఒకటి బోర్లించి ఉంటుంది. బిందెమీద కూర్చొని ఒక అందాల ఆడపిల్ల ఏదో ఆలోచిస్తూ ఉంటుంది.

ఇంటి పొడవుకీ ఉండే ద్వారాల్లోంచి, గదులచీకటిలోంచి చూస్తోంటే ఆ పెరడు అతి నిశ్శబ్దంగా, ఎంతో మనోహరంగా, నిజంగా అక్కడ లేనట్టుగా, మూగ సినీమాలా, తెరమీది రంగుబొమ్మలా, నిద్రలో వచ్చిన సుఖమైన కలలా ఉంటుంది.

ఆ తొలిరోజుల కాలం అలాగే కనిపిస్తోంది చింకిచాప మీద, మినుకుదీపం దగ్గర కూర్చొన్న సూర్యానికి ఆ సమయంలో.

రెండు సంవత్సరాలు దండయాత్ర చేసి మూడవయాత్రలో "మెట్టు" దాటి ఇంటర్లో ప్రవేశించిన రోజులవి.

ఎన్నెన్నో కొత్తముఖాలు కనిపిస్తాయనే ఉత్సాహంతో కాలేజీకి వెళ్లడం; కళకళ్లాడే కాలేజీకి వెళ్లేసరికి కొత్తకొత్త ముఖాలు కనిపించడం; అంతటితో ఆ ఉత్సాహం ఇంకా ఎక్కువ అవడం——

బొమ్మల కొలువు పెట్టేముందు చెల్లాచెదరుగా పడేసిన బొమ్మల్లా ఉన్నారంతా. ఈ బొమ్మరంగు బావుంది. ఆ బొమ్మవేషం బావుంది. ఈ బొమ్మ ఎక్కడిది ? ఆ బొమ్మ ఏ వూరిది ?

అందరితోనూ మాట్లాడాలని ఉండడం; కొందరితో మాట్లాడ్డానికి మొహమాటపడ్డం; తమ హైస్కూల్ నుంచి వచ్చినవారంతా కలిసి అల్లరిచేయడం; అంతా కోలాహలంగా ఉండడం.

అదంతా కలకాదు. ఆరోజులు నిజంగా ఉండేవి. ఈబొమ్మల్లో మనుష్యులు నిజంగా ఉండేవారు.

ఈ లాంతరు వెలుగులో ఈ తూట్లుపడ్డ పాత అట్టమీద కనిపించే ఈ బొమ్మలే. ఈనీడలే ఆ రోజుల్లో కాలేజీలో ఎంతో గల్లంతు చేసినది.

యాభై ఉన్నాయి, గల్లంతుచేసిన నీడ బొమ్మలు.

మిగతావాళ్లు ?

ప్రిన్సిపాల్, లెక్చరర్స్ అండ్ ప్యూన్స్!

ప్రిన్సిపాల్ గారూ లెక్చరర్లూ దిగువని కుర్చీల్లో కూర్చున్నారు. వారివెనుక, వారికి ఎగువకి మూడు వరసల్లో మిగతావారంతా ఉన్నారు. మీది వరసలో చెరోపక్కా, వంక పాగాలు పెట్టుకొని, మీసాలు దిద్దుకొని నిల్చున్న వాళ్లిద్దరూ కాలేజీ ఆఫీసు బంట్రోతులు. ఎడమవైపు నిల్చున్నవాడు ఫోటోలో కొద్దిగా చెదిరేడు కాని కాలేజీలో మాత్రం కదలకుండా స్తంభంవార నిద్రపోయేవాడు. ప్రిన్సిపాల్ పిల్చినా సరే బూతులు తిట్టుకోకుండా లేచేవాడు కాడు. రెండో వైపు నిల్చున్నాడే, అతడి కొడుకు మీదే ఆ రోజుల్లో ఏదో పోలీసుకేసు ఉండేది. అందుచేత ఇతనెల్లప్పుడూ బెంగగా కనిపించేవాడు. ఆ కేసు ఏమయింది? ఆ కొడుకు ఎక్కడున్నాడు? ఈ ప్యూన్స్ ఇద్దరూ ఏమయేరు?

ముందుండే కుర్చీల వరసలో మధ్యగా కూర్చున్న పెద్దమనిషే కాలేజీ ప్రిన్సిపాల్. బుట్టపాగా. అంగారుబొట్టు. నవ్వుముఖం. లాంకోటు. పంచె. మేజోళ్ళు. బూట్లు. అప్పటికే కాని యాభయ్యేళ్లుంటే ఇప్పటికింకా బతికిఉంటాడా? ఆరోజుల్లో తన మనవరాలికోసం కాలేజీలో చదివే తనకులం పిల్లలందర్నీ పిల్చి భోగట్టా చేసేవాడు. ఆయన వెనకనే ముంగిలా ముఖం పెట్టుకొని నిల్చున్న 'లెక్కల కుర్రాడు' చివరికి ఆ పిల్లకి తాళి కట్టి దానికొంప ముంచేడు. ప్రిన్సిపాల్ గారే కాని బతికి ఉంటే, మనవరాలి పెళ్లిగురించి తల్చుకున్నప్పుడు ఆయన ముఖంలో నవ్వన్నది కనిపించబోదు.

ప్రిన్సిపాల్‌కి ఎడమవైపున ఏడుగురు లెక్చరర్లు. కుడివైపున ఏడుగురు లెక్చరర్లు వారిలో ఎక్కువ మందికి పాగాలూ, మీసాలూ, లాంకోట్లు, పంచెలు. అంతా భారీగా ఉండే మనుష్యులు. ఆ రోజుల్లో ఎంతో పెద్దవాళ్లలా, జీవితంలో బాగా పండిపోయిన వాళ్ళలా కనిపించేవారు. ఈ బొమ్మలో చూస్తే కొందరే ముసలివాళ్ళలా కనిపిస్తున్నారు. కొందరిది నడివయసు. కొందరిది యవ్వనం.

ప్రిన్సిపాల్ గారికి కుడివైపున, కెమేరా వైపు చూడ్డానికి భయపడి కొంబోలు నేల వైపు చూస్తూ, సూటు తొడుక్కొని కూర్చున్నాయనే ఇంగ్లీషు లెక్చరరు. బొమ్మ చూస్తే ముప్పయ్యేళ్ళవాళ్ళా ఉన్నాడు. క్లాసువైపు చూడ్డానికి భయపడే కొంబోలు, ఎటూ చూడకుండా ఏదో విధంగా పాఠం గొణిగేసేవాడు. శ్రీరామచంద్రా, ఇతగాణ్ణెందుకంతగా బాధపెట్టేవారా స్టూడెంట్సంతా?!

కుర్చీల్లో ఒక చివరికి, ఎడమకి కూర్చున్న వారిద్దరికీ అరవపాగాలున్నాయి. మీసాలు లేవు. తెలుగువాళ్ళల్లా లేరు, కారు. ఆఇద్దరూ "ఫిజిక్స్ కెమిస్ట్రీలు". "మమ్మల్ని తిట్టండి కావలిస్తే కొట్టండి. కాని, అయ్యలారా, మమ్మల్ని బతకనివ్వండి" అన్నట్టుగా చేతులు కట్టుకొని, నోళ్ళు కొంచెం వెళ్లడవేసుకొని బెదురుగా చూస్తున్నారు.

ఇంగ్లీషు లెక్చరరు పక్కనే "క్రూరాత్ముడజామీళుడు" రీతిగా కనిపించే ఆయనే జువాలజీ చెప్పలేని లెక్చరరు. వెడల్పు ఛాతీ, భయంకరమైన మీసాలు. సున్నపుతట్టలాంటి పాగా. అతను మిక్కిలి మంచివాడు, నెమ్మదైనవాడు. అతని దురదృష్టం ఏమిటో కాని అతనొక "పెళ్ళాల పులి" అయిపోయేడు. పెళ్లాం రావడం, పెళ్ళాం పోవడం. ఆరీతిగా అతని కప్పటికి ముగ్గురు భార్యలు చనిపోయేరు. తరువాత, నాల్గవతూరి వచ్చిన భార్య అతనిపాలిట పెద్దపులి అయింది. సూర్యం పూాలే ఆమెది.

ఆమె వచ్చిన తరువాత ఈ "పెళ్లాలపులి"నే ట్రెయిన్లో ఒకసారి చూసి పోలికే పట్టలేక పోయేడు సూర్యం.

కుడివైపు చివరినుండి ఒకటవ, రెండవ కుర్చీలలో వరుసగా కూర్చున్నవారు తెలుగు,



 **నీడలు** 

సంస్కృత పండితులు. లాంకోట్లు, పంచలు, పాగాలు. సంస్కృత పండితునిది కొంచెం ముసలి ముఖం. కాని బాగుగా గీసిన ముఖం. మంచి తిథి, మంచి వారం, మంచి నక్షత్రం, అన్నీ మంచిగా జతపడిన ముహూర్తంలో వచ్చే మంగలి కత్తికోసం ఎదురుచూసే ముఖం తెలుగు పండితునిది. వాళ్లిద్దర్నీ ఎవ్వరూ లెక్క చేసేవారు కారు. వారిద్దరూ ఎవ్వర్నీ లెక్క చేసేవారు కారు. "దేశభాషని తూలనాడేవారంతా చంకనాకి పోతార్రా వెధవాయిల్లారా" అంటూన్నట్టుగా ఉన్నారు సంస్కృత పండితులు. "బావగారు బాగా సెలవిచ్చేరు, మాతృభాషని తూలనాడే వెధవల గతికూడా అంతే" అంటున్నట్టుగా ఉన్నారు ఆంధ్ర భాషోపన్యాసకులు.

పండితుల పక్కనే టీ. బీ. తో బాధ పడే హిస్టరీ లెక్చరర్ కూర్చున్నారు. అతని పక్కని కూర్చున్నందువల్ల టీ. బీ. ఎక్కడ అంటుకుంటుందోననే భయం చేతనో అన్నట్టు ఊపిరి బిగబట్టి కూర్చున్నాయన లాజిక్ లెక్చరరు. అదుగో మాథమెటిక్స్ లెక్చరరు. మనుష్యుల్లో ఎద్దువంటివాడు. లెక్కల్లోకూడా అంతే.

లెక్చరర్ల వెనక మూడు వరసల్లో నిల్చున్నారు విద్యార్థులు.

ది అండర్ గ్రాడ్యుయేట్స్!

మొదటివరసలో నేలని ఇరవయ్యొక్క మంది, ఆ వెనక బల్లలెక్కినవారు పద్దెనిమిది, ఆ మీదికి ఇంకా ఎత్తయిన బల్లమీద, బంట్రోతులిద్దరూ అంగరక్షకులుగా చెరో పక్కా ఉండగా నిల్చున్న స్టూడెంట్సు పదకొండుగురు.

ఎవరు వీరంతా?

వీరే ఆనాటివారంతా.

అలా చూస్తోంటే మనసులో చెరిగిపోతోన్న గుర్తులు మళ్లీ కుదటబడుతున్నాయి. పోలికలు దొరుకుతున్నాయి. వెనుకటి భోగట్టాలు, సంగతులు, జ్ఞప్తికి వస్తున్నాయి.

దాదాపు ఇరవయ్యేడు సంవత్సరాల క్రితం, ఒకనాటి సాయంకాలం, కెమెరా క్లిక్ చేసిన అరక్షణంలో రకరకాలుగా నిల్చొని చూస్తోన్నవారంతా అలాగే నిలబడి ఇంకా అలానే చూస్తున్నారు.

ఎక్కువమంది పల్చటి లేతమీసాలవారు. కొంతమందిది ఫ్రెంచికట్, ఒకనిది బొద్దు మీసం, కొంతమంది మిగతావారికంటె వయసులో బాగా పెద్దవాళ్లు. ఆ రోజుల్లో ఎంతో ఉత్సాహంగా ఉన్నవారే వీరంతా. ఆ ఛాయలు కొందరి ముఖాల్లో కనిపిస్తున్నాయి. ఎంతో అల్లరి చేసేవారు. వాళ్లి అల్పప్రజ్ఞలకి గొప్పపడిపోతూ ఉండేవారు. స్వల్పాతి స్వల్ప విషయాలకి తెగద్వేషించుకోనేవారు. అందరూ కూడా మధురమైన కలలు కనేవారు. చిన్నవో పెద్దవో ఆశలు పెట్టుకొనేవారు.

వారిలో చాలా మందికి పీడకలలు తప్పించి కలలన్నీ ఎగిరిపోయేయి. ఆశలు అడియాసలయేయి. కాకపోతే ఆశలుగానే నిల్చిపోయేయి. కొంతమంది జీవితాలు మండి తగలడ్డాయి.

అల్పమైనదే అనుకోండి, కాని, ఏమయిపోయింది వారి ప్రజ్ఞ? ఏదీ వారి ఉత్సాహం? ఏరీ; వీరంతా ఎక్కడున్నారు? ఏ మారుమూలల్లో ఇరుక్కున్నారు? ఏ విధంగా బతుకుతున్నారు? ఏయే విధాల బతకలేక చస్తున్నారు? ఒక్కొక్కర్నీ చూడబోయి, అందర్నీ ఒక్కమాటుగా, మధ్యమధ్య ఒక్కొక్కర్నీ ప్రత్యేకంగా, అందర్నీ మళ్లీమళ్లీ చూస్తున్నాడు సూర్యం.

మీదివరసలో రెండు ఫెజ్ టోపీలు కనిపిస్తున్నాయి. ఒకతను ఏదో ఖాన్. పద్యాలు బాగా చదివేవాడు. ఈమధ్య ఆముదాలవలస స్టేషన్లో శవాకారంలో ప్రత్యక్షమయేడు. రెండో అతని పేరు ఏదో ఆచారి. క్లాసులో ఒక గర్ల్ స్టూడెంటైనా, ఆఖరికి మన సీనియర్స్‌కి ఉండేలాటి కాకిలాటి పిల్లయినా లేదుకదా' అని ఎప్పుడూ గోలపెట్టేవాడు. అతనికిప్పుడు అరుగురు ఆడపిల్లలు. 'ఛస్తున్నాననుకో భాయీ' అని ఒకసారి కనిపించి నప్పుడు చెప్పేడు. ఎక్కడో ఏ అరపైడెభ్భైరూకలకో అరవచాకిరీ చేస్తున్నాడు. మధ్యవరసలో తెల్లటిటోపీ పెట్టుకున్న కుర్రవాడి పేరు? రామారావ్. ఆ రోజుల్లో వాళ్ళనాన్న "కాంగ్రెస్‌లో కలిసిపోయేడు." ఇతను "కమ్యూనిస్టుల్లో కలిసిపోయే"డని ఆమధ్య ఎవరో చెప్పేరు. ఆ వరసలోనే అతని పక్కనే వస్తాదుల్లా నిల్చున్న ముగ్గురూ బంతాట బాగా ఆడేవారు. వాళ్లిపక్కని నిల్చున్న ఆరుగురూ పిలకలకి తాళ్ళు కట్టుకొని ముగ్గురేసిచొప్పున "కంబైన్డ్ స్టడీస్" చేసేవారు. పరీక్షలకీ, వాళ్లి ప్రాణాలకీ లంకె. చదివి పాసవక పోతే వాళ్లకి మరే ఆధారం లేదు. చదువు మీద బ్రతకవలసినవాళ్లు చచ్చేట్టు చదవక తప్పదు. ముందు వరసలో ఎడమచివర గుండులా నిల్చున్నవాడికి చదువుసంధ్యల్తో పనిలేదు. వాడికి అప్పట్లో ఇద్దరు ముండలుండేవారట. ఆ వరసలోనే రెండవచివర నిల్చున్నవాని గుండే కనిపిస్తోందికాని పిలక కనిపించడంలేదు. ఆ పంతులుకి అప్పటికి

ముగ్గురే పిల్లలు. ఆ వరసలోనే అతని పక్కగా వరసగా ఈవెనింగ్ డ్రెస్‌లో నిల్చున్న అయిదుగురూ అయిదుగురు మనుష్యుల కొడుకులు కారు. అయిదుగురు ఆఫీసర్ల కొడుకులు. వాళ్ళల్లో వాళ్ళకి పడక పోయినా పైకి కలిసి కట్టుగా తిరిగేవారు. అదే వరసలో ముంగిముఖం వాని కుడిపక్కని ఏమీ ఎరగనట్టు నిల్చున్న ఈడురాని కుర్రవాడు పెద్ద చదువుకి ఇంగ్లండు వెళ్ళేట్ట. వెళ్ళాడ్డం 'దొరసాన్ని' పెళ్ళాడేట్ట. ఇప్పుడు ఇరాన్‌లోనట పనిచేస్తున్నాడు. అతగాడి పక్కనే ఉన్నవాడు పల్చగా ఉన్నాడు. జాలిగా చూస్తున్నాడు. అతను హాస్టల్లో చివరిగది కిటికీలోంచి ఎల్లప్పుడూ సముద్రంలోకి చూస్తూ ఉండేవాడు. బొద్దుమీసాలవాడు మూడవవరసలో మధ్యకి నిండుగా నిల్చున్నాడు. అతను, పాపం, మిక్కిలి అమాయకుడు. అతని ఎడమపక్కని నిల్చున్న అతని ప్రాణస్నేహితుడిది పొంగ ముఖం, దింపుడుమూపు. వాడి పక్కనే నిల్చున్నవాడు పల్చగా పొట్టిగా పిల్లిలా కనిపిస్తున్నాడే కాని అతనికి కనపడ్డ ఇంగ్లీషు వాణ్ణల్లా కాల్చేద్దామన్నంత కోపం ఉండేది. అతనికి ఎడమగా నిల్చున్నవాడు, కాలేజీలో ఏ మీటింగు జరిగినా తన పిల్లి గొంతుకతో ప్రార్థన పాట పాడి తీరవలసిందే. వీరిలో ఎవరో కాని ఒక కవి ఉండాలే. కనిపించడేం?

లాంతరు వెలుగు తగ్గుతోందా అని అటు వైపు అనుమానంగా చూసి ఫోటోని దీపానికి ఇంకొంచెం దగ్గరగా పెట్టి చూసేడు సూర్యం.

ఫోటోలో ఉన్న వారిలో చాలామంది ఉత్సాహంతో, ఏ కొద్దిమందో కొంత భయంతో, మొత్తంమీద అందరూ కూడా ఎక్కువ క్యూరియాసిటీతో చూస్తున్నారు.

"వారిభవిష్యత్తులోకి కాబోలు"

మా జీవితాల్లో ముందుకి ఏంజరుగుతుంది? ఏంజరుగుతుందో ఏమైనా కనిపిస్తోందా? అన్నట్టుగా అంతా చూస్తున్నారు.

ఆగకుండా ఎక్కడికో ఎగిరిపోతోన్న కాలంలోంచి లాగి నిలవేసి ఈ ఫోటోలో ఈరీతిగా బంధించిన ఆ ఆగిపోయిన ఆ ఒక్క అరక్షణంలో తమ భవిష్యత్తులోనివి ఏం కనిపించినట్టు వారికి?

నిజంగా కనిపిస్తే ఇలా ఉండరే వీరంతా!

ఆనాటి సాయంకాలం వారికి చాలా విషయాలు కనిపించి ఉండవు. ఎన్నో సంగతులు తెలిసి ఉండవు. ఊహించుకోనైనా ఉండరు. ఆరోజు తరువాత ఈ మధ్యకాలంలో వారి జీవితాల్లో జరిగినవి, తాను తెలుసుకొన్నవి, చాలా విషయాలు స్ఫురణకి వచ్చేయి సూర్యానికి.

తన కొడుకుమీద కేసు ఏమవుతుందో,



సాతాని జియ్యరు

కార్యంపూడి కృష్ణమూర్తి, (పేరాల).

ఆ ఆఫీసర్ ఫ్యాన్‌కి; తన మనవరాలి గొంతు కోసేవాడు తన వెనకనే ఉన్నాడని, ప్రిన్సిపాల్ గారికి; పెద్దపులి తన నాలుగో పెళ్ళాం రూపంలో వస్తుందని, ఆ జూఆలజీ లెక్చరర్‌కి; తిండిలేక చస్తానని, మధ్యవరసలో ఉన్న ఆ పొడవాటి కుర్రవానికి; ఈర్ష్యతో, కావేషీతో, కత్తుగట్టి తన కుడి కాలు విరగ్గొడతారని, ముగ్గుర్లోనూ మధ్యనున్న ఆ ఫుట్‌బాల్ ఛాంపియన్‌కి; బికారైయి బిచ్చమెత్తుకుంటానని, పైవరసలో పిల్లిలా కనిపించే పడుచువానికి; లోకానికొక ఆఖరి ఉత్తరంరాసి ఆత్మహత్య చేసుకొంటానని, కిటికీలోంచి ఎప్పుడూ సముద్రంలోకి చూసే ఆ పల్చటి పిల్లవానికి, మూడో కూతురు ముండమోస్తుందని, ఆ పిలక పంతులుకి; ఆరుగురూ ఆడపిల్లలే పుడతారని ఆ ఆచారికి; వర్క్‌షాప్‌లో కుడిచెయ్యి తెగిపడుతుందని, రెండోవరసలో నలుగులా నిల్చున్న చిన్నవానికి; పక్కనే నిల్చున్న తన ప్రాణస్నేహితుడే తన భార్యని చెరుపుతాడని, ఆ బొద్దుమీసాల వానికి—

తెలియవు. ఆ సాయంకాలం ఆయా విషయాలు వారెవ్వరికీ తెలియవు.

ఏం జరుగుతుందని చూస్తున్నారో ఆ కాలం అప్పుడే చాలామట్టుకు జరిగిపోయింది. వారెదురుచూస్తోన్న ఆ భవిష్యత్తు వారిలో చాలామందికి పెనుభూతం అయింది.

"ఈ కుర్రవాడిక్కూడా అంతే"

చివరివరసలో కుడివైపు 'బంట్రోతు' పక్కనే నిల్చొన్న కుర్రాడు చేతులుకట్టుకొని, తలకొంచెం ఎత్తి "ఏముంది నా జీవితంలో?" అన్నట్టుగా, మిక్కిలి కుతూహలంతో చూస్తున్నాడు. కుడివైపుకి ఎత్తుగా లేచిన క్రాపింగు పక్కలకి పోగా జారిన కనుబొమలు కొంచెం విప్పారినకళ్లు కిందికి దిగుతూ ఎత్తుగా లేచిన ముక్కు. ఒక్కరవ తెరుచుకొన్న నోరు ఏం కనిపించింది. ఆ సమయంలో ఆ కుర్రవాడికి?

ఏం చూసేడో!



పెళ్లి ఊరేగింపు

ఫోటో :—టి. సత్యనారాయణ, (పిప్పర).

కాని, ఆ క్షణంలో, భవిష్యత్తులోకి చూస్తోన్న అతడి కళ్ళకి పైపుమెషీన్లు మాత్రం కనిపించి ఉండవు.

ఊఁ హూఁ! అవి కనిపించలేదు.

అంతేకాదు.

తల తిరుగుడు సుబేదార్ మేజర్‌కి లంచ కామాలాగిన తనతండ్రి జెయిలుకి పోతాడనీ, అంతటితో ఆ దుకాణ తను చదువాపవలసి వస్తుందనీ, ఆ వెంటనే టైప్ రైటింగ్ నేర్చుకోవలసి ఉంటుందనీ, ముక్కుపొడవ వేసే గదుల్లో ఉద్యోగం చేయక తప్పదనీ, తాళి కట్టి తెచ్చుకున్న పువ్వులాటిపిల్ల, వత్తిలా ఎండిపోతుందనీ, ఇద్దరుపిల్లలు ఎలా వచ్చిన వాళ్లు అలా పోతారనీ, ఇంట్లో నోళ్ళన్నీ ఎప్పుడూ తెరుచుకొనే ఉంటాయనీ, కంపెనీలచేత మనుష్యులు దివాలా తీయిస్తారనీ, నడివయసు దాటేక నట్టడవిలో కొత్త కాపురం పెట్టవలసి వస్తుందనీ......

చాలా విషయాలు కనిపించలేదు. చాలా భోగటాలు తెలియవు ఆకుర్రవాడికి ఆ సాయంకాలం.

పదిగంటల రాత్రి చాలా సేపయింది దాటిపోయి.

ఫోటోలో ఆ కుర్రవాణ్ని కొంతసేపు చూసి, సందుగుపెట్టె మూతకి లోపలి భాగంలో ఉన్న కిలాయి పోయిన అద్దానికి ముఖాన్ని దగ్గరగా పెట్టుకుని ఒక్కసారి చూసుకొన్నాడు.

చూసుకొని "అయ్యో! పోలికే లేదు" అనుకున్న సూర్యానికి జ్ఞప్తికి వచ్చింది ఒక విషయం.

గుంపులుగుంపులుగా చేరిన జనమంతా సంబ్రమంగా నిల్చొని చూస్తూఉంటారు. కళ్లకి గంతలు కట్టుకొని, మధ్యని కూర్చున్న కుర్రవాణ్ని, పాటు ఫిడేలు వాయించడం టక్కున ఆపిన గారడీవాడు వేస్తాడు ప్రశ్న.

"అబ్బాయ్! సూర్యకళా? చంద్రకళా?"

గారడీవాని ప్రశ్న. గుంపులో కుర్రవాడి కెదురుగా నిల్చొన్న వెంకటసూర్యం చెవుల్లో గింగురుమంది. ఇప్పటికీ గింగురుమంటోంది.

ఏమంటాడు ఆ కుర్రవాడు? తనని చూపిస్తే ఏమంటాడు?

"ఉస్తాద్‌జీ సూర్యకళా కాదు. చంద్రకళా కాదు. ఇది ప్రేతకళ"

ఫోటోని మరొక్కసారి చూసి, దాన్ని పక్కగా పెట్టి నిట్టూర్చిన వెంకటసూర్యం, పెట్లోంచి మిగతా కాయితాల్ని మెల్లగా తీయనారంభించేడు.



# మానస వర్ణం

.........

ఏమేం పని చేస్తావు ?
ఏమైనా రాస్తావూ ?
రాగం తీస్తావూ ?
వినేదెవరు నీ రాగం?
దెవెదె దెయ్యాలా!
దేదేదే దేవుళ్లా!
వెలుతురా? చీకటా?
మనిషిలోని సంధ్యాకాలం
భూతాన్ని జాతాన్ని
ఒక్కమాటు చూస్తుంటే
గీతాన్ని వింటాడెవ్వడు?
కూర్మం — విష్ణువు
ఆకాశం — శివజట
అరవిందం — మదనబాణం
రామాయణంకృతయుగంకోడిగుడ్డు
ద్రౌపది అయిదున్నరతలల ఆడది
రంభ — అరటిచెట్టు
కాళిదాసు — ఇరమ్మదం
గెబ్ — భూదేవత
నట్ — ఆకాశదేవత
షు — గాలి
రా — సూర్యుడు
మేమంతా మెరిగినవే
మేమంతా తిరిగినవే
ఈఈఈ మండలాలు
ఆఆఆ మండలాలు
చెవుల్లో కుండలాలు
వాడిలోగల తండులాలు,
మేం వినని కొత్తపాట
సుడిగుండంలాంటి పాట
సూది ముక్కులాంటి పాట
చుక్కడొక్కలోని పాట
సూదంటురాతి పాట
శూన్యగృహంలోని పాట

సుఖం అనే ఆడదాని
ముఖం అనే పద్మంలోని
బుగ్గలనే రేకులపై
దంతక్షతం లాంటి జీర
నఖక్షతం లాంటి కోర
ఆ కోరల క్రింది బాధ
గోర్వెచ్చని బాధ.
ఆ బాధకీ సుఖానికీ
అంతరం వుందో లేదో!
ఆ అంతరంలో ఆవర్తం
ఆవర్తంలోని పాట
పాట అనే పీటమీద
మాట అనే మూటపెట్టి
ముడి విప్పితే
ముక్కోటి దేవతలు
వాళ్లు మాట్లాడేది తెలుగు
వాళ్ళ చేతుల్లో పారా పలుగు
వాళ్ళేం వ్యవసాయం చేస్తారు ?
వాళ్లు మనకేం సాయం చేస్తారు?
వాళ్లు గాలిలా వీస్తారు
వాళ్లు పూలలా పూస్తారు
ఆకాశాన్ని అరచేతిలో చూస్తారు
కొత్త ఇల్లు ఈమధ్యే
కట్టుకున్నారు వాళ్లు
ఆ ఇంటిని గూర్చి పాట
అంటావా? వింటాను.

కొత్తయింటి పాట
సంక్రాంతి పూట
భోగి భోగి భోగీ
భోగి భోగి భోగీ
భోగిమంటల నాలికలలో
పైరుపంటల మాలికలలో
కండబలిసిన
నిండుయౌవన మండ నిలిచిన
యువకులంతా యువతులంతా
పతాకాలు ప్రతాపాలు
చేతుల్లో ముఖాల్లో
ఒకేరీతిని మురిసిపోగా
ఒయ్యారంగా విలాసంగా
తెలంగాణా పథాల్లో
కళాకాంతులు వికాసింపగా
ఒకరినొక్కరు వెన్నుపొడిచే
దుష్టబుద్ధులు మానుకోసి
భోగిమంటల వెలుతురుల్లో
లాగి జీవితరథం వాళ్లు
సాగిపోయే యువాంధ్రప్రజ
యువాంధ్రప్రజ, నవాంధ్రప్రజ
నవాంధ్రప్రజ, యువాంధ్రప్రజ
కొత్త యింటి పాట
సంక్రాంతి పూట.

★

# పండగ పుంజులు

లక్షశ్లోక సమన్వితమైన మహాభారతము, హరివంశము, అష్టాదశ పురాణములనూ, యింకా యివిగాక బ్రహ్మసూత్రములు వగైరాలనూ, వీటినన్నిటినీ మొత్తంగా, వేద విభాగకర్తయైనటువంటిన్నీ వేదవ్యాసుడని పిలువబడేటటువంటిన్నీ, కృష్ణద్వైపాయనుడనే ఒకేఒక వ్యక్తి, ఒకే చేత రచించి గుట్టలు పోసినట్టున్నూ, యీ మహాగ్రంథములన్నీ ఒకే కాలమందు ఆవిర్భవించినట్టున్నూ, పామరులే కాక పండితులుకూడా అంటూ వుండటం పరిపాటి. ఈ అభిప్రాయం భాషా సంప్రదాయం గాని, రచనా సంప్రదాయం గాని అవగతం చేసుకోని వెర్రిధోరణిలో వున్నదని - అస్మదాదు లెవరేనా, పొరపాటున నోరు జారి అంటే, ఆ పండిత ప్రకాండులు, ఆమెయిని, మాజీ పాకిస్థాన్ ప్రధానిలా పిడికిలి బిగించి 'జిహాద్' ప్రకటించి చంపేస్తారు. అచేతన పదార్థాలైన ఈ రకం మూఢవిశ్వాల వదన గహ్వరాల్లో చేతన పదార్థములైన మానవులం యిరుక్కుని "హృతమత్స్య శిశువు"*ల్లా ఎంత గిజగిజ గింజుకున్నా తల వూడిరాక సదమద మౌతున్నాం. ఈ రకం మూఢవిశ్వాసాల ఫలితం యేమిటంటే, ప్రాచీన గ్రంథాల్లో, ఎవరు, ఏ గ్రంథాన్ని, ఎప్పుడు, ఎందుకు వ్రాశారో తెలియకుండా పోయి, మొత్తం ప్రాచీన వాఙ్మయమంతా దోవా డొంకా తేలని ఒక దుర్గమారణ్యంగా తయారై దాని యొక్క ప్రయోజనాన్ని యే ఒక్కడూ పొందలేకపోవటం.

ఇంతకూ చెప్పవచ్చిం దేమిటంటే ఈ అష్టాదశ పురాణాలలో ఎవరు, ఏ కాలంలో, దేన్ని రచించిందీ మనకు ఖండితంగా తెలీదు. తెలుసుకొనే ప్రయత్నానికి యెవడేనా పూనుకుంటే విజ్ఞాన పరిరక్షకులైన పండిత ప్రకాండులు వాణ్ణి ముక్కలు విరగబొడవటానికి ఉపక్రమించుతారు. ఈ స్థితిలో ఆ జోలికి పోవటం ప్రమాదకరం గనుక ప్రస్తుతానికి ఆ విషయాన్ని వదిలేద్దాం.

ఎవరే గ్రంథాన్ని రచించినా ఒక్కటి మాత్రం మనం ఒప్పుకుతీరవలసివుంది. నెత్తిమీద ఒయ్యారమొలికే నెమలిపింఛమూ, మెళ్ళో పులిగోరు పతకం, కటిపైన పట్టు పీతాంబరం, దానిమీద చిరుగంటలుతాపిన బంగారుబిళ్ళల గజ్జెల మొలత్రాడూ, చేతిలో పిల్లనగ్రోవీ, పిల్లనగ్రోవిమీద యేలపాటలు వాయించుతూ, క్రీగంట చిలిపి చూపులు వెదజల్లుతూ, ఒక తండా తండా, కుచ జఘన భారాలసలైన మదించిన ఘూర్జరాంగనలను వెంటేసుకుని యమునాతీర వనాంతరాలలో స్వైరవిహారం చేసే దేవుణ్ణి సృష్టించిన మానవుడు ఎవడేనా గాని, నిజానికి గడుగ్గాయి పిండమనే ఒప్పుకుతీరాలి. ఆడజాతిమీద మొగజాతికి వుండే ఆబనంతా ఆ రూపంలో మూర్తీభవింపజేశాడు.

అతనికంటె ఘనుడు ఆచంటమల్లన్న - బ్రహ్మవైవర్తపురాణకారుడు యీయన కంటే ఒకమెట్టు పైకెక్కి మహావిష్ణువును సహితం మింగిపారేసిన గోలోక కృష్ణున్ని సృష్టించటమే గాక అలాంటి పులిబిడ్డవంటి మొగాణ్ణికూడా బాహుపంజరంలో పొదివిపట్టుకుని ఊపిరిసలుపకుండా ఉక్కిరిబిక్కిరి చేయగలిగిన రాధాదేవిని సృష్టించాడు. 'ఢీ' అంటే 'ఢీ' మగజాతి సవాలును అందుకుని తలక్రిందులు చేసిన స్త్రీ మూర్తిని సృష్టించాడు. మగవాడిమీద ఆడదానికుండే తమిదీరని కాంక్షనంతా ఆ స్త్రీ మూర్తిలో పోతబోశాడు.

ఈ పరమార్థ విషయాన్ని అందించకపోతే, ఈ తెలుగుజాతి తరించదేమోననే బెంగతో బ్రహ్మవైవర్తపురాణాంతర్గతమైన శ్రీకృష్ణజన్మ ఖండమనే ఈ ఘట్టాన్ని గోపీనాథ కవిచేత, పనిబూని తెలుగు చేయించారు మన తెలుగు జమీందారొకరు. జనానికి తిండీ తిప్పలూ లభ్యమౌతున్నాయా లేదా అనే విషయములో ఈ జమీందార్లకు ఆసక్తిలేకపోయినా, ఈరకం వాఙ్మయాన్ని సృష్టించే విషయంలో మాత్రం, యెందుకో గాని తగని యావ-వెతికి వెతికి ఈరకం గాథల్ని.



* "హృతమత్స్యశిశు శిశుక్రీడార్థమత్స్యీ మాత్రభ్యర్థనా వైభవాప్తిలోడి, మత్స్యీయాంగనా శరీరాప్తి కృష్ణార్పణమ్మ"

పడుతోన్నా వుంటారు. ఒక వేళ తెలుగులో చెప్పించినా, ఈ గ్రంథంలోని పరమార్థ విషయం అజ్ఞానులైన ఈ తెలుగు వారు అర్థం చేసుకోగలరో లేదో అనే శంకతో, ఆ కవిగారిచేతనే దీనికి వ్యాఖ్యాన రూపములో 'బ్రహ్మానంద శతక' మనే మరో పవిత్ర గ్రంథాన్ని కూడా రచింప చేశారు.

వీరందరి సంగతీ యేమిటిగాని, ఈ బ్రహ్మానంద శతకాన్ని అచ్చువేసి, అది దాని మొహం మెరగని కుర్రగాళ్ళకు అమ్ముకుని సొమ్ముచేసుకున్న ప్రచురణకర్త మాత్రం, గుడినీ గుళ్లో లింగాన్ని కూడా మింగగల పరమ లౌకికుడు.

ఆధ్యాత్మికరంగ విషయం యిలా వుండగా, ఇక సాంఘిక రంగంలో, కోడి పందాల వినోదాన్ని ఊహించిన అనాది పురుషుడెవడో గాని ఈ అందరినీ తలదన్నిన వాడైవుండాలి. మానవ జాతిలో వుండే హింసా ప్రవృత్తిని నిసితంగా అర్థం చేసుకుని, తత్పరితృప్తికి గాను ఈ మహా వినోదాన్ని సృష్టించ గలిగాడు. నోరులేని అల్పప్రాణులైన జీవాల కాళ్లకు పానలుతీర్చిన వాడికత్తులు గట్టి వాటిని ఒండొంటిపైన పురిగొల్పి అవి పరస్పరం తెగనరుక్కు చస్తుంటే, ఆ హింసా కాండనంతా ముచ్చటగా చూసి ఆనందించుతున్నారు మానవులు — గౌతమబుద్ధుడూ గాంధీజీ పుట్టిన ఈ దేశంలో కూడా! ఎవరెన్ని బోధలు చేసినా కంఠశోష గాని మానవ ప్రకృతిని మార్చటం ఎవరితరం. ఇతరులు హింసపడుతుంటే చూసి ఆనందించకుండానూ, యితరులు కులాసాగా బ్రతుకుతుంటే, కుళ్లుమోతుతనం వచ్చి లోలోపల యేడవకుండానూ, యెవడాగగలడు సామాన్య మానవులలో — సర్వమోహాలకూ అతీతులైన కొందరెవరో ప్రత్యేక పురుషులుంటే వుండవచ్చుగాక.

తక్కిన మానవు లందరి సంగతీ ఎలావున్నా, తెలుగుజాతి నిర్మించుకున్న మహోజ్వల జాతీయచరిత్ర కంతకూ ఈ కోడిపందాలే ప్రధాన ప్రాతిపదికగా కనుపించుతున్నయ్. బ్రహ్మనాయుడేమి, బాలచంద్రుడేమి, తాండ్ర పాపయ్యేమి ఇతర వెలమదొరలేమి, తమ గౌరవాభిమానాల నన్నిటినీ కోడి కాలికత్తికి ముడిబెట్టుకుని వీరాధివీరులుగా, కీర్తి గడించుకున్నవారే. ఇక తక్కిన గల జమీందారుల మాట లెక్కేమిటి? పందెపు కోళ్ళనూ పావురాయిలను పెంచని యే జమీందారు మాత్రం కీర్తి గడించుకోగలిగాడు?

ఒక జమీందార్ల విషయమే గాదు, జాగ్రత్తగా పరిశీలించి చూస్తే కోడిపుంజు తత్వం జాతి నరనరాలలోనూ జీర్ణించిపోయి వున్నట్టు కనుపించుతుంది. సామాన్య ప్రజానీకం మాట యెలా వున్నా, ఆంధ్ర నాయకులలో మాత్రం ఈ కోడిపుంజుతత్వం విస్పష్టంగా గోచరించుతోంది. పుంజుల పోరాటం గాకపోతే ఈనాడు జరుగుతున్న యీ రభసంతా యేమిటనుకోవాలి. ఈ పుంజుతత్వాన్ని ఓపట్టాన విస్మరించుకుందామన్నా సాధ్యమయ్యే పనిగాదు. పిఠాపుర కుక్కుటేశ్వరస్వామి మన యిళ్ళ వేల్పు; యే తెల్లవారుఝామునో లేచి 'కొక్కొరోకో' అని కూసి యావదాంధ్ర జాతినీ మేలుకొల్పి జ్ఞాపకం చేస్తూ వుంటాడు.



వరి కుప్ప

ఫోటో: పి. వీరన్న, (విజయవాడ).

#  పండుగ పుంజులు 

ఆంధ్రజాతి జాతీయ చరిత్రతో ఇంత సంబంధంవున్న కోడిపుంజాలకు, ఆంధ్ర రాష్ట్ర అధికార ముద్రలో స్థానం లేకపోవటం హాస్యాస్పదమైన విషయం.

ఎవరో బౌద్ధులకు సంబంధించిన అశోకచక్రానికీ, అమరావతి స్థూపానికీ, ఆంధ్రజాతికీ సంబంధం యేమిటి? ఆంధ్ర ప్రభుత్వ అధికార ముద్రమీద, పోరాడుతున్న పుంజాలజతను చిత్రించితే ఆంధ్ర జాతి ప్రాచీనాధునాతన మహోజ్వల చరిత్రకంతకూ తగినట్టుగా వుండేది.

తెలుగు జాతికీ కోడిపందాలకూ వున్న అవినాభావాన్ని అవగతం చేసుకోవాలంటే ఇలా పొడిమాటల్లో చెబితేచాలదు. సంక్రాంతి పండుగలు నాలుగురోజులూ 'పొట్టిపాడి' గుంటకు వెళ్ళిచూస్తే తెలుస్తుంది. ఒక్క కోడిపందాల సంగతేగాదు. తెలుగుజాతిలో వుండే సర్వావేశాలను మీరు తేలికగా తెలుసుకోవచ్చు. తెలుగుజాతి అంటే యేమిటో మీకు కచ్చితంగా అవగాహనైపోతుంది. తెలుగుజాతి నిజస్వరూపాన్ని అవగతం చేసుకోవాలంటే లక్ష చరిత్ర గ్రంథాలు చదివీ, లక్ష పరిశోధనలు చేసీ వృథా...సంక్రాంతి పండుగల్లో అలా ఒకసారి 'పొట్టిపాడి' గుంటదగ్గిరికి వచ్చి చూస్తే ఎంతో విజ్ఞానాన్ని కరతలామలకం చేసుకోవటానికి సావకాశం వుంటుంది.

అదృష్టవశాత్తూ, బాల్యదశలో, నాకు, ఒక సంక్రాంతి పండుగనాడు ఆ పుణ్యక్షేత్రాన్ని సందర్శించే సావకాశం కలిగింది. స్వయంగా అక్కడికి వెళ్లి చూసేగల సావకాశం మీకు లేకపోవచ్చు గనుక, నాడు నేను చూసిన పరమార్థ విషయాలలో జ్ఞాపకమున్న వాటిని కొన్నిటిని టూకీగా మనవి చేసుకుంటాను.

పొట్టాడి గుంట బెజవాడ తాలూకాకు యించుమించు నడిబొడ్డునవున్న చిన్న కొలను. కొలనంటే నీళ్లూ నట్టా వున్నది గాదు. పూర్వం చిన్న చెరువుగా వుండేదేమో, తరవాత మీటవేసి పూడిపోయి చిన్న గుంటలా వుంది. ఈ గుంట చికినాల బొకినాల గ్రామాలకు సమీపంలో వుంది. ఈ గుంటకు సమీపంలో ఒక పెద్ద మామిడి తోట వుంది. అయ్యవార్లంగారి తోటలని గావాల్ను అంటారు. ఈ తోటకు చుట్టూ కంచకొలు వగైరాలేమీ లేవు. ఒక పెద్దమామిడిచెట్ల తోపు. బెజవాడ బందరు రైలు మార్గంలో తరిగొప్పల సేషన్లో దిగి మానికొండరోడ్డుపుచ్చుకుంటే మధ్యే మార్గంలో వుంటుంది. ఈ ప్రదేశం, చుట్టూవున్న గ్రామాలన్నిటికీ కూడలి. అందుచేత యీ వేడుకలనుపది గ్రామాలవారూ కలిసి, కమ్యూనిటీ కార్యక్రమంగా యిక్కడే యేర్పాటు చేసుకుంటారు. ఈ పొట్టాడి గుంట కోడిపందాలకు యింత ప్రాధాన్యత రావటానికి మరొక ప్రత్యేక కారణం కూడా వుంది. ఇటు తరిగొప్పలలోనూ అటు మానికొండలోనూ కూడా వెలమదొరలు వున్నారు. తరిగొప్పుల వెలమవారికీ, మానికొండ వెలమవారికీ ఈ పందాల విషయంలో చాలా పోటాపోటీగా వుండేది. అటు బొబ్బిలినుంచీ, యిటు పల్నాడునుంచీ, వందలాది ఖరీదు చేసే పందెపుకోళ్లను తెప్పించి, కుక్కుట శాస్త్రంలో విజ్ఞాన ధురీణులైన సాంకేతిక విద్యానిపుణులచేత వాటికి తగిన సైనిక శిక్షణ నిప్పిస్తూ వుండేవారు.

మా వూరునుంచి పొట్టాడిగుంటకు, పాటిచేల మీదుగా అడ్డదోవ వుండేది. పండగనాడు భోజనాలు ముగించుకుని కొత్త పంచలు కట్టుకుని నేనూ ఊళ్లో కొందరు మిత్రులూ పందాలు చూట్టానికి బయలుదేరాం.

చిక్కని తెమ్మంచు ముసుగులోనుంచి బద్ధకంగా నిద్ర మేలుకొని సూర్యభగవానుడు యిటూ అటూ కొస్త కొస్త మెసులుతున్నాడు. చేలపాటి చేలమధ్యగాబడి నడుస్తున్నాం. శెనగచేల మధ్యనుంచి నడుస్తుంటే అదో విచిత్రమైన అనుభవం— ఒళ్లంతా పులకలుదేరి, పళ్లు పులిసి నోటివెంట నీళ్ళు వస్తూవుంటయ్. వంగతోటల మధ్యనుంచి పోతూంటే కన్నుల పండువుగా వుంది. వంగగుబుర్ల మధ్య కలగాపులగంగా పెరిగిన మెరపచెటనుంచి యెర్రగా పండిన పండు మెరపకాయలు వ్రేలాడుతున్నయ్. వాటిమధ్య పండుగ సింగారపు పరిధవమంతా ఒలికించుకుంటూ మూడుముస్తాబులూ అయి బుగ్గను చెయ్యిబెట్టుకు నిల్చునున్న పల్లెటూరి పడుచుపిల్లలా విరియబూసిన ముద్దబంతి చెట్లు. ఈ తోటల మధ్యకు వచ్చేసరికే కూతవేటు దూరంనుంచి కుక్కుట సైన్యాల వీరాలాపాలుసముద్రసంఘోషణంగా వినిపించుతున్నయ్.

ఆ మామిడితోపుచుట్టూ, మూపుమేర దూరం ఎటుచూచినా, అప్పుడప్పుడే పూత బడుతూ, పసర్లు చిమ్ముతూన్న జనుపచేలు నిలువెత్తున పెరిగివున్నయ్. జనుపచేల మత్తువాసనలతో వాతావరణమంతా కైపెక్కినట్టుగా వుంది.

రంగు రంగుల కొత్తచీరెలు సింగారించుకుని, కొప్పుల్లో వాడెడు వాడెడు ముద్దబంతిపూలూ ఊకబంతిపూలూ చెరువుకుని ఒయ్యార మొలికించుతూ, వేలాది సంఖ్యలో, గ్రామీణ యువతులు, సరససల్లాపాలాడుకుంటూ, జనుపచేలల్లో నుంచి, సీతాకోకచిలుకల్లా తెరలు తెరలుగా బయటపడి మామిడితోపులోకి చేరుకుంటున్నారు. రంగు రంగుల కోడిపుంజుల్ని చంకనుబెట్టుకుని, మీసాలు మెలిబెట్టుకుంటూ పందెగాళ్లు గుంపులు గుంపులుగా వస్తున్నారు.

ఆ మామిడితోపు యావత్తూ యిసకవేస్తే రాలకుండా జనం కిటకిటలాడిపోతున్నారు. కర్నూలు తాత్కాలిక రాజధానిలో మోస్తరుగా నేవందలాది డేరాలుపన్ని, నానారకాల దుకాణాలూ పెట్టారు. పట్నాలెన్ని కట్టుకున్నా పల్లెటూళ్ళు ఎన్ని పెంపొందించుకున్నా తెలుగువాడు బంజారీ జీవితపు పాతవాసనలను వదిలించుకోలేడల్లేవుంది. కొత్త అవకాశం దొరికితే డేరాపన్నుకు కూర్చుంటాడు. కొత్త కోతలు పట్టడం ఆలస్యం, కంచరి డేరాలూ, కంట్రాకు నాటకాల డేరాలు, ఊరూరా వెలుస్తయ్. అందాకా యెందుకు అల్లంత దూరంలో ఆంధ్రరాష్ట్రం పొడకట్టిందో లేదో కర్నూలు కడపగుట్టల్లో కడగండ్ల డేరాలు పన్నుకుని పంబవన్నుకు కూర్చున్నాం. బంజారీ జాతి సరే! రక్తంలో జీర్ణించివున్న స్వభావం పుటం బెడితే మాత్రం మారుతుందా.

డేరా డేరాముందూ భోగిమంటలు వేసిన సెగళ్లు మండుతున్నయ్. నూనె మిఠాయి సరుకునుంచి, న్యూయార్కు అత్తరు సీసాలదాకా ఆ డేరాల దుకాణాల్లో అమ్ముతున్నారు.

సంక్రాంతిదినాల్లో ఆతోటల్లో అడుగుబెట్టిన ప్రతి మొగవాడూ నలయుధిష్ఠిరాది ప్రాచీన మహాపురుషుల కోవలోకి మారిపోతాడు, ప్రతి ఆడదీ విలాసవిభ్రమాలను ఒలికించుతూ రంభాద్యప్సరోగణంలో చేరిపోతోంది. అది స్థలమహాత్మ్యంగా చెపుతారు.

ఎక్కడికక్కడ ముఠాలు ముఠాలుగా కూర్చుని జూదమాడుతున్నారు. పైకి ఎగరేసిన రాగికానులతోపాటు మనుషులు కూడా చిత్తులుబోకులై పోతున్నారు. కిలకిలలాడేవాడు కిలకిలలాడితే మతాబా ముఖం వేసేవాడు మతాబా ముఖం వేస్తున్నాడు. కరెన్సీనోట్లు గాలిలో ఎగిరిపోతున్నయ్.

ఎక్కడో స్వర్గలోకముందనీ గోలోక

ముందనీ చెబుతారు గాని అయ్యవారంగారి తోటలకీ ఆ అమరలోకాలకీ యేవిటి తేడా? అక్కడికి జేరే ఆడా మగా అందరూ అమృతపీథులే. గోలోకంలో మోస్తరుగా అక్కడ రాసమంచాలు మాత్రం వుండవు గాని, చుట్టూవున్న జనపచేలన్నీ ఓ పెద్ద రాసమండలం. రాధాకృష్ణులు విశ్వరూపం ధరించి రాసక్రీడ జరుపుతున్నట్టు, పంచగుకొర సహితంగా విశ్వక్రీడ సాగిపోతూవుంటుంది. తోటల్లో ఆయామూలల్లో అమర్చిన రంగుల రాటాల మీద ఆడా మగా, జతలు జతలు గా కూర్చుని, రివ్వురివ్వన గాలిలో తిరిగి పోతూ మైమరచి ఒకళ్ళనొకళ్లు కౌగలించుకుని కేరిసలు కొడుతూవుంటారు.

చోటా నలయుధిష్ఠరులు చెర్ బొప్పాయి గుంకు దగ్గర చేరి, కానీ కానీ పందాలు వేసి, తరిఫీగు పొందుతూ వుంటారు.

ఏదో టూకీగా చెప్పి వదిలేయాలిసిందే గాని అక్కడి విచిత్ర విషయాలన్నీ అభివర్ణించాలంటే మొత్తం ఈ సంక్రాంతి సంచిక యావత్తూ చాలదు సరే గదా, ఇలాంటి సంచికలు వరుసని నాలుగు వెలువరించినా చాలదు. నిజానికి ఒక్క కోనాటను గురించి చెప్పాలంటే ఎంత గ్రంథం వుంది. 'ఇదిగో! నిన్నే ఏందా ఎగమోటూ? జిలుత్తావుంటేనే' అని ఒక అపర నలకూబరుణ్ణి పాట్టాడికుంట భూలోకరంభ పిలిచిన పిలుపు వెనకనూ, చూచిన క్రీగంట సూపు వెనకనూ దాగివున్న శృంగార మధుర గాథను అభివర్ణించాలంటే, ఎన్ని ప్రబంధాలు నిర్మించితే మటుకు తరుగుతుంది? మిగతా విలాస విభ్రమాల విషయం ఇలా ఇక వదిలేసి కోడిపందాల గోదాదగ్గర ఎత్తుకుందాం. ఈ కోడిపందాలలో కూడా తరతమ భేదాలను బటి చిన్నచిన్న పందాలు కొన్నీ, మరికొంచెం పెద్ద పందాలు కొన్నీ ఎక్కడికక్కడే సాగుతూ వుంటాయ్.

అసలు పెద్ద పందాలు తోటమధ్యను ఏర్పాటు చేస్తారు. వెలమ దొరలూ, పెద్ద కమ్మలూ యిత్యాదయః ఘరానా బాబులు పెంచిన జాతికోళ్ల పెద్ద పందాలకు యిది గోదా. కత్తెర గిరజాలూ, పొన్ను కర్రలూ, జరీ కండువాలూ—ఇత్యాదయః పరిధవాలతో వెలమదొరలు సపరివారులై గోదా చుటూ నిల్చునుంటారు. అలా సపరివార సమేతులై పందాలకు వేంచేయడం దేనికీ అని నేను పృచ్ఛ చేస్తే, అక్కడి ఒక పెద్దమనిషి: 'ఒకొక్క సమయంలో ఈ పుంజుల పోరాటంలో పేచీలు వచ్చి, ఈ సరంభం కర్రల వేటాట్రకిందా, కష్టల థరాట్రకిందా పరిణమించే ప్రమాదం



కొనకళ్ళ వెంకటరత్నం

ఏ గంటకు రమ్మంటావె కన్నెలేడీ !
ను
వ్వేడ కాచుకోనుంటావె వన్నెలాడీ !
పుగతోటకు నీళ్లుపెట్టి
బుగతగారి నేమరించి,
కోరుకొన్న మొగలిపొత్తి
కొండకోన వెతికి తెచ్చి,
అలసటతీరే తలికే
అద్దరేత్తిరవుతాది !
ఏ గంటకు॥

చీకట్లో నీ అందము
చిక్కవిడదు నా కంటికి
ఎన్నెలలో నీ రూపము
కన్నుచెదర గొడతాది;
చీకటి వెలుగుల సందున
చేరరావె చిన్నారీ.
ఏ గంటకు॥

మోటు సరుకుతోటగాలి
కాటేస్తే కసిరికసిరి,
నిమ్మతోట పరువానికి
నిలవలేక నిలవలేక,
నలుగుడు పడివస్తేను
వ్వాలిగిరాకు, ఆగిపోకు ;
ఏ గంటకు॥

చిలిపితనానికి పేగు
చెల్లెమ్మకు దారికేవు,
గుంటలకో నేటి మీద
గొబ్బెమ్మలు నిలిపింది.
అడుగు సడింగంటె చాలు
ఆనవాలు పట్టేస్తది !
ఏ గంటకు॥

సోగకనులు పట్టలేను
తిగమల్లె కడ వొద్దు;
కలిసిపోవు నీ బుగ్గలు
గులాబంట్ల వెనకొద్దు;
పూలపొంత పొదలచాటు
పొంచుని నను వంచింపకు.
ఏ గంటకు॥

పొదుపుకశల తమ్మయ్యకు
పొద్దోయిందని పాది,
పూసలోడు నేస్తాలకు
'పూ' కొట్లతో సిరిపెట్టి
కునికే చుక్కల వెలుగున
గుట్టు చప్పుడుగ రా సుమి !
ఏ గంటకు॥

# రాజీ.

నా ప్రాణం...

కనులవిందు వీనులవిందు
కావించే కమనీయ
చిత్రం...

# జెమిని

నిర్మాణం

జనవరి 30 వ తేదీన
ఆంధ్రదేశమంతటా
విడుదల కానున్నది

# పండుగపుంజులు

వుంటుందని సెలవిచ్చారు.

గోదా చుట్టూ, దొరా భృత్యుడూ, ఆడా మగా తేడా లేకుండా, వందలాది జనం క్రిక్కిరిసి నిల్చున్నారు. పందెగాళ్లు కోళ్లను జతజతలుగా తీసుకొచ్చి గోదాలో దింపుతున్నారు. యూపూరి దగ్గుసాయెబు వీటన్నిటి కాళ్లకూ కత్తులు గట్టి డబ్బు తీసుకుంటున్నాడు. దగ్గుసాయెబు చాలా చిత్రమైన వ్యక్తి. ఋతువులవారీగా యే పని యెప్పుడు చేస్తే తేలికగా డబ్బు వస్తుందో అతనికి తెలుసు. మామిడి పళ్లరోజులొస్తే మామిడితోటలు ఇజారా పాడతాడు. కల్లాల రోజులొస్తే కల్లాలలో నూసెనితాయి అమ్ముతాడు. పెళ్లిళ్లరోజులొస్తే ఊదువత్తులు తయారుచేస్తాడు. కోడిపందాలొస్తే కోళ్లకు కత్తులు గడతాడు.

పందెగాళ్ల గౌరవమర్యాదలూ, కోడిపుంజుల చావుబ్రతుకులూ యిప్పుడు దగ్గుసాయెబు చేతుల్లో వున్నయ్. అవతల కోడి చావటమూ యివతలకోడి చావటమూ నేది, ఇతను కట్టే కత్తిమీదా, కత్తిగట్టే పద్ధతిమీదా ఆధారపడివుంటుంది. ఏకోడి గెలవాలో, ఏది ఓడిపోవాలో, దగ్గుసాయబు, ముందుగానే నిర్ణయం చేసుకుంటాడు. లలాటలిపి అంటూ ఒకటి వుంటే, ఆ కోళ్ల లలాటలిపికీ, పందెగాళ్ల లలాటలిపికీ, దగ్గుసాయెబే విధాత. పలమవోరలు నూటిమాటికీ, దగ్గుసాయెబును అవతలికి పిలిపించుకుని యేదో ముట్టజెప్పుకుంటూ వుంటారు. దగ్గుసాయబు చేతిలోపడ్డ నోట్లకట్టలు కాలివెంటతిరుగుతున్న కొడుక్కు యిచ్చేసి, దగ్గుకుంటూ యేమీ యెరగనివాడులా, మళ్ళీ గోదాలోకి వస్తూవుంటాడు. బహిరంగంగా మాత్రం కత్తికి పావలా చొప్పున రుసుం వసూలు చేస్తూ వుంటాడు.

కాలికి కత్తిగట్టి కోడిపుంజును తీసుకువచ్చి, మరో రెండో కోడినియెదట మాపగానే దానికి రాజకీయ నాయకుల మనస్థితి వచ్చేస్తుంది. అవతల కోడిని ముందు చంపెయ్యకపోతే అది తననే చంపేస్తుందని భయం పుట్టుకొస్తుంది. అందుచేత ప్రాణాలకు తెగించేసి చావో బ్రతుకో తేలేదాకా పోరాడుతుంది. ఒళ్ళంతా రక్తాలోడిపోతూ అవసాన దశలో వుండికూడా, యెదటిపుంజును ఎలాగైనా చంపేసి తను ప్రాణం రక్షించుకోవాలని కోడిపుంజు చేసే ప్రయత్నం చూస్తే, జాలివేసి యేడుపుముంచుకొస్తుంది. సారంగపాణి క్షేత్రయ్యల బూతుపాటలను అభినందించటానికి ఎలాంటి ప్రత్యేకమైన మనస్థితివుండాలో ఈ హింసాకాండను



మగువ

—ఎ. వి. యస్. ఆర్. కోస్యులు.

చూసి వినోదించటానికి కూడా అలాంటి ప్రత్యేకమైన మనస్థితివుండాలి. మానవత్వం సంస్కృతీ యివి రెండూవుంటే సాగదు.

వందలాది కోళ్లు ఒకదాని వెంట ఒకటి వస్తున్నయ్. వచ్చిన కోళ్లను పొద్దుటేకని గుర్తులుగట్టే చుట్టూవున్న మామిడిచెట్లకు వ్రేలాడదీస్తున్నారు. తల పైకెత్తి చుట్టూ చూస్తే కసాయి దుకాణం మధ్య నిల్చున్నట్టు చికాకెత్తిపోయింది. పందెం గెలిచిన కోళ్లుకూడా ప్రాణాలు త్రాహి త్రాహిగా అటమటించుతూ గట్లమీద పడుకుని రొప్పుతున్నయ్. వాటికి ధోవిళ్లతో నీళ్ళుపట్టి సేవచేస్తున్నారు. పందాలు చూడటం మానేశాను. గట్టుమీద పడుకుని రొప్పుతున్న ఒక బొబ్బిలికోడి దగ్గరికి వెళ్లి కూర్చుని దాని ముఖంలోకి పరిశీలనగా చూశాను. బాధగా మూసుకుపోతున్న దాని కళ్లలో అనంతమైన వేదన. దాని బ్రతుకు అది బ్రతకలేక మానవుని చేతుల్లో చిక్కుబడ్డ అసమర్థజీవి, కుమిలి కుమిలి యేడుస్తోంది.

కలవారి వినోదాలకోసం కల్పించబడుతున్న కటిక యుద్ధాలలో పొట్టకూటికి గతిలేక సైనికుడుగా చేరి, దిక్కుమాలిన యే కొండగుట్టమీదనో దీనుడై ప్రాణాలువిడిచే సైనికుడికీ ఈ కోడిపుంజుకూ తేడా యేమిటి?





సైగల్ కంఠంలోంచి బాధలూ, బరువులూ తేనెల సోనలై ప్రవహిస్తాయి. ఈ దృశ్యం న్యూ థియేటర్సువారి "ప్రెసిడెంట్"లోది.

# అమరగాయకుడు

ప్రజాస్వామ్య భావాలు ప్రజా బాహుళ్యం అంతటా పరివ్యాప్తి చెందిన భారతదేశంలో ఈనాడు సినీమా కళకు ఉన్న ప్రశస్తి మరి దేనికీ లేదు. సంగీత సాహిత్యాలలో ఏకముఖమైన పరిశ్రమా ఎక్కువ ప్రజాదరణా సినీమాద్వారా చేకూరుతున్నాయి. పెద్ద భాషలలో చాలా ముఖ్యమూ, రాష్ట్రభాష అయిన హిందీలో అధికంగానూ ఈ అభివృద్ధి కనబడుతోంది. కేంద్ర ప్రభుత్వం ఏ విధంగా అయితేనేం ఇప్పటికే హిందీ సినీమాల భాషా సౌలభ్యం, కథాప్రశస్తి, గానమాధుర్యమూ వీటివల్ల హిందీ మాతృభాష కాని రాష్ట్రాల ప్రజల్లో హిందీకి పది పదిహేనేళ్ళ ఈమధ్య అనుకోనంత అధిక ప్రచారం లభించింది. ఆ ప్రచారం ఏ హిందీ ప్రచార సంఘము కల్పించగలిగేది కాదు. ఇది కన్యాకుమారి నుంచి కాశ్మీరందాకా గాంధారం నుంచి కలకత్తాదాకా ఒకే వేదికతో ప్రజానీకాని కంతటికీ ఒకే జాతికీ ఒకే దేశానికీ చెందిన వారమనే భావాన్ని కలిగించింది. ఇది రాజకీయ నాయకులుకూడా కలిగించి ఉండలేరు.

మన రాజకీయ భావాల అనేక సంఖ్యాక ప్రతినిధి ఏకైక నాయకుడు నెహ్రూ. అలాగే సినిమారంగంలోకూడా భారతజాతి జాతి హృదయాన్నంతటినీ మారగొన్న ఏకైక నాయకుడు ఎవరు? మన దురదృష్టవశాత్తూ ఆ నాయకుడు ఈనాడు మనలో లేడు. అతని తరువాత ఈనాడు అతని స్థానాన్ని అలంకరించగల ఏకైక నాయకుడు కంటికి కలికానికైనా లేడు. ఏకైక నాయకుడంటే అటువంటి వాడు. నెహ్రూకి తర్వాత భారతజాతికంతకీ ఏకైక నాయకుడు కాగలిగే ప్రజాహృదయాన్ని మారగొన్న ప్రతిభాశాలి ఎవరనే ప్రశ్నకి జవాబు దొరకటం లేదు. అలాగే ఈవేళ సినిమారంగంలో అనేకచిత్రాల్లో నాయకులున్నారు. కాని, వాళ్ళల్లో ఒక్కడూ పాడలేడు. అనేక గాయకులున్నారు కాని, వాళ్ళలో ఒక్కడూ నటించలేడు. పది పన్నెండేళ్ళపాటు సుమారు 70 చిత్రాలకు పైగా నాయక పాత్రలు ధరించి, తన నటనా సామర్థ్యంతో, మధుర గానంతోను నటించిన చిత్రాలను వాటిని నిర్మించిన కంపెనీలకు అఖండ భారత విఖ్యాతి సంపాదించి తాను అఖిలభారత ప్రజానీకానికి అత్యంత సన్నిహితుడైపోయిన నాయకుడు భారత చలనచిత్ర పరిశ్రమ చరిత్ర అంతా వెదికిచూస్తే ఒకే ఒక్కడుగా కనిపిస్తాడు. అతడు అమరజీవి కుందన్‌లాల్ సైగల్.

సుమారు 50 ఏళ్ళ క్రితం పంజాబ్



**కీ॥ శే॥ సైగల్**

భారతీయ చలనచిత్ర సీమనుంచి ఇద్దరే ప్రతిభాశాలు రనదగినవారు పుట్టారు. ఒకరు కీ॥ శే॥ డైరెక్టర్ బారువా; రెండోవారు గాయకుడు సైగల్. సైగల్ అకాల మరణం (1947 జనవరి 18) అసంఖ్యాకులైన లలిత సంగీతాభిమానులకు తొలగిపోని విషాదస్మృతిగా, మానని గాయంగా మిగిలిపోయింది.

దేశంలో జన్మించి, ఏదో తగుమాత్రపు కాలేజీ చదువు చదివి, భగవత్ప్రసాదంగా లభించిన తన మధురకంఠంతో స్వయం కృషితో సంప్రదాయానుసారంగా సంగీతంలో పరిశ్రమ చేసి, పంజాబ్ దేశపు ముస్లిం కవుల గజల్ కవితాగానముతో, భక్త శేఖరుల భజన కీర్తనలతో తన చుట్టుపక్కల స్నేహబృందాలను అలరిస్తూ చిన్న ఆవరణంలో తన కళాజీవితానికి అంకురారోపణ చేసుకున్నాడు సయిగల్. ఈ ఆవరణ పెద్దది కావడానికి టైప్‌రైటర్ల కంపెనీలో ట్రావెలింగ్ ఏజంట్ పని అతనికి సహాయపడింది. తన పనిమీద కలకత్తా వెళ్లినపుడు స్నేహితులగోష్ఠిలో పాడుకుంటున్న సయిగల్‌లో దాగివున్న అమరగానాన్ని న్యూ థియేటర్స్ పెద్ద B N. సర్కార్ కనిపెట్టాడు.

'పురాణ్ భకత్' మొదలైన ఒకటి రెండు N. T. వారి తొలిచిత్రాల్లో పాటలుపాడే పక్క పాత్రలు ఇచ్చారతనికి. ఆ భక్తి గీతాలు, గజల్సు ఈనాటికీ పాతబడలేదు. 'కారవా నే హయాత్', 'రూప్ లేఖా' అనే చిత్రాల్లో ఇతనికి నాయక పాత్రే లభించింది. కాని, 'చండీదాస్'లో నాయక పాత్ర నటించడంతో చలనచిత్ర చరిత్రలో యుగళగీతాల కొక స్థానం, సైగల్‌కు మధుర గాయకులలో ప్రథమ స్థానమూ లభించాయి. ఆతరువాత, శరత్ చంద్ర చటర్జీ వ్రాసిన దేవదాస్ చిత్రం వచ్చింది. దేవదాస్ పాత్రతోనే సైగల్ పేరు భరతఖండమంతా మోగిపోయింది. అందులో అతను పాడినవి మూడే పాటలు. ఆ చిత్రంలో అతనికి లభించిన గొప్పతనం అంతా అతని నటనా సామర్థ్యానికీ, డైరెక్టర్ బారువా దర్శకత్వానికీ చెందుతుంది.

ఆ తర్వాత, ఇతను 'మిలియనీర్', 'ప్రెసిడెంట్', 'ధర్తీమాతా', 'దుష్మన్', 'మై సిస్టర్' అనే చిత్రాల్లో నాయకుడయ్యాడు. 'మిలియనీర్'లోనే కాకుండా ఒకటి రెండు చిన్న పొట్టి చిత్రాల్లో సైగల్ హాస్య పాత్రలు కూడా ధరించి కృతార్థుడయ్యాడు. ఇలాగ దినదిన ప్రవర్ధమానమవుతూన్న అతని కీర్తి 'జిందగి' అనే చిత్రంలో ప్రకాష్ బాబు పాత్ర నిర్వహణలో "సోజా రాజకుమారీ" అనే పాటతో చలన చిత్రాకాశంలో ధ్రువతార అయిపోయింది. ఎన్నిరకాల గీతాలో! అతను పాడినవి! "ఏక్ రాజాకా బేటా లేకర్ ఉడ్‌నేవాలా ఘోడా" — "దోనైనా మత్ వాలే..." పిల్లవాళ్ళకి కథ చెప్తున్నట్లు పాడేపాట. 'ప్రేమ్ కా హై ఇస్ జగ్ మే పంథ్ నిరాలా' 'దుఃఖ్ కే అబ్ దిన్ బీతత్ నాహీ' — 'కరూం క్యా ఆస్ నిరాస్ భయీ' వంటి భగ్న ప్రేమికుల హృదయాంతరాళాలు. స్వప్న గీతాలు. ప్రేయసిని ప్రేమడోలలో ఊయలూగించే మధుర గీతాలు

కలకత్తానుంచి కొన్నాళ్లకు అతని నటనా రంగం బొంబాయికి మారింది. అక్కడ నుంచి తాన్‌సేన్, సూర్‌దాస్, షాజహాన్, ఉమర్ ఖైయామ్, పర్వానా మొదలైన చిత్రాలు వచ్చాయి.

హాస్యము, శృంగార లాలిత్యము, ప్రేమ మాధుర్యము, వంటి జీవితంలోని వెలుగు చూపే భావాలను ఎంత సమగ్రతతో నిరూపించేవాడో, స్వప్నలాలసా, ప్రేమోన్మాదము, భక్తియోగిత్వము, భగ్నహృదయము, వైరాగ్యము ఇన్నిరకాల భావాలను కూడా ఇతోధికంగా నిర్వహింపగలిగేవాడు.

# స్మృతి సీమల్లో సైగల్

## "రజని"

గేయకారులెవరైతేనేం
భావాలకు నీ హృదినెలవై
నీ తియ్యని కంఠనాళమున
నిస్తుల మధువులుగా రాలాయ్!

రజకినీ ప్రియుడవై పరచి
ఘాతుకలోకము నేమరచి
మధుర గీతమాలికతో నవ
ప్రణయసౌధమును నిలిపావు!

"ప్రేయసి వస్తే శ్రావణము
ప్రేయసే లేందే ఏ ఋతువూ
భాసించ" దనుచు పాడేవు!
యువకులకూ విద్యార్థులకూ
ప్రేమికులకు అది వొక వేదం!

"గడచినదినాలు సుఖదాలై
కలలో తియ్యదనాలవుగా!
దుఃఖంలో ప్రకృతదినాలు
ఒక్కింతయినా గడవవుగా!"
అని ఆలాపిస్తూ నవ్వేవ్,
అది నవ్వో లోకపు కఠినహృ
దయాని కొక పమ్మెటరువ్వో!

ప్రేమకు మార్గ మ్మీజగతిని
కంటక మహిత మ్మన్నావు!
ప్రేమకు ఫలిత మ్మీజగతిని
దుఃఖమ్మె అని తేల్చావు!

నీ శక్తిని వినియోగించి
నీ ప్రయత్నమును కావిస్తే
కలిగే సత్ఫలితాలన్నీ
కావిలించుకుంటై నిన్నని
ధరిత్రి మాతను సేవిస్తూ
పవిత్రముగ చాటించేవు!

"చేత్తో నను రమ్మని పిలిచి
కాలదన్ని పొమ్మంటుందా!
చిన్నతనం అయితే మాత్రం
హృదయం లేదా అమ్మాయికి?"
అని వాపోతూ నువ్వు దగ్గిన
ఆ దగ్గున ఖంగుఖంగుమని
మారుమ్రోగుతై లోకంలో
మోసపోవు ప్రేమిక హృదయాల్!"

వీధి గాయకుడవై నువ్వు
చేతులార పైకి తెచ్చిన
ప్రియురాలే నిన్ను కాదని
లోకపు పోకల పాలైతే
నీదు హృదయవల్లకి విరిగి
రోదింపగ కొండలె కరిగాయ్!

నీ కూర్చిన పాటే గొప్పగ
తాను పాడగా సభలోన
తనని మెచ్చువారే అంతా,
నిను చూచేవారే లేరు!
ఏమిటి ఈ అన్యాయమ్మని
ఎలుగెత్తి విలాపించేవు!
సులువుగ బ్రతుకున దగాపడే
కవి హృదయాలను కలిచేవు!

ఆరిపోని దీపపు వెలుగున
కొనవూపిరి నీ పాట వినే
కోరికతో వేచిన ప్రేయసి
గుండెబరువు తీర్చిన పాట!
దేవలోక సీమల నామెను
రాకుమార్తె చేసిన పాట!
లోకములో ప్రణయ జీవులకు
'మరపురాని తీయని బాధ!'

'దివ్వె జ్వలించా' లని పాడావ్!
నువ్వే ఆరని దివ్వె వయావ్!
నీ పాటలు మా స్మృతిసీమల
తిరిమి తిరిమి వలపించే నం
దనవన చందన పవనాలు!
తలపు దొంతరల మెదిలే క
మ్మని కర్పూరపు ధూపాలు!

★

అలాగే చక్రవర్తి, మహాకవి, భక్తశేఖరుడు, సంగీత విద్వాంసుడు, విద్యార్థి, ప్రేమికుడూ, మధ్యతరగతి కుటుంబీకుడు, నిరుద్యోగి, క్షయరోగి, త్రాగుబోతు, దేశద్రిమ్మరి, కార్మికుడు, కృషికుడు, శిల్పి మొదలుగా అన్ని రకముల మానవత్వాన్నీ అసమానంగా అభినయించి నెగ్గుకువచ్చాడు.

అతని నటనాసామర్థ్యమా, గానమాధుర్యమా ఏది మేల్తరము అనే ప్రశ్నకు జవాబుగా నేను నేనని రెండూ పోటీ పడినప్పటికీ, గానమాధుర్యము జయించితే నటనాసామర్థ్యము తక్కువయినందు చేత కాక, గానమాధుర్యం ప్రజల మనస్సును త్వరగా చూరగొనగలగడంచేత నేఅని చెప్పాలి.

అతను గొంతువిప్పితే వెన్న కరిగి అమృత ప్రవాహాలుగా మారి అపూర్వ సౌరభాలు వెదజల్లుతూ నలుదిశలా వ్యాపించేది. అతని గాత్రసాధన అపూర్వము. అది ప్రౌఢ గాయకులు నిరంతర సాధనచేత సంపాదించుకుని స్థిరం చేసుకునే పూర్వ జన్మ సుకృతం. మనకు నిత్యమూ చిత్రాల్లో అతని మధురగానమే వినబడుతూండడము చేతా, మిగిలిన శాస్త్రీయ గాయకులపంథా వేరుగా ఉండడంచేత మనము ఇతని శాస్త్రీయ సంగీతకృషి ఎంత ఘనమైనదో ఊహించలేము. అతని గాత్రంలో తిరిగే మెళుకువలు, మంద్రస్థాయిలో ఎంతటి అగాధాలకు పోగలిగేవో తారస్థాయిలో అంతటి ఔన్నత్యాలు అందుకుని తారామండలంలో ఇంద్రధనుస్సుల మంచు తుంపరలు కురియించేవి.

మొత్తముమీద ఎక్కువగా తాను నటిస్తూ వచ్చిన విషాద జీవితములనూ, భగ్న హృదయములనూ తనవి చేసుకుని, తన జీవితంలో ఏదో అందుకోలేని ఆదర్శము కోసము నలిగిపోయి, లోలోపల కుమిలి, కుంగి, అకాలంలోనే మనల్ని విడిచిపెట్టి, తన జీవితాన్నికూడా విషాదాంతం చేసుకొన్నాడా సైగల్, అనిపిస్తుంది.

ఈనాడు ఎందరో మగ గాయకులను, కథానాయకులనూ వింటున్నాము, చూస్తున్నాము. ఒక్కరూ సైగల్ కోవగోటికైనా పోలటంలేదు. నూటికి తొంభయి తొమ్మిది పాళ్లు సైగల్ గొంతును అనుకరిస్తూ, అతను పాడే పాటల వరుసల పద్ధతినే పాటలను తయారుచేసుకుని పాడికూడా ఆత్మ వంటివారు సైగల్ గొంతు అందుకున్న అగాధాలనూ ఔన్నత్యాలనూ అందుకోలేకపోతున్నారు. నానాటికీ మన సినీమా పాటల్లో పాశ్చాత్య సంప్రదాయాలు హెచ్చయి, భారత జాతీయ సంప్రదాయాలు, భావనా మృగ్యమయి పోతున్నాయి. అప్పుడు, నాయకు లెక్కువయిపోయి, ఒక కొలిక్కిరాని రాజకీయాలలాగే మన కళలుకూడా నీళ్ళుగారిపోకతప్పదు. సైగల్ పాడుతూఉండిన పది పంద్రెండేళ్ళు ప్రతి యువకుడూ సైగల్‌లాగా పాడదామని ప్రయత్నించినవాడే - మళ్ళీ సైగల్ వంటి నాయకుడూ గాయకుడూ ఒక్కడైనా లభిస్తేనే మన సినిమా కళారంగానికి పురోగతి. ★



సైగల్ ఎంత గొప్పగాయకుడో అంత గొప్ప నటుడు. అతడు నిరుద్యోగి ప్రకాష్ బాబుగా నటించి, "సోజా రాజకుమారీ" పాటతో యువ హృదయాలను ఉర్రూతలూగించిన "జిందగీ" చిత్రంలోనిది ఈ దృశ్యం.



# సినిమాకళ వినోదసాధనం

**ఎస్. ఎస్. వాసన్ (జెమిని)**

పూర్వం ఈజిప్టుదేశాన్ని ఒక సారసెన్ రాజు పాలిస్తూవుండేవాడు. కేవలం మూర్ఖుడు. ఆయన చేసిన మొట్టమొదటి ఘనకార్యం ఏమిటంటే, అలెగ్జాండ్రియాలోని గ్రంథాలయాన్ని తగలబెట్టించాడు. అతని పూర్వులు ఎంతో శ్రమకు, వ్యయానికి ఓర్చి, అమూల్యమైన గ్రంథాలు సేకరించి నిర్మించిన బ్రహ్మాండమైన గ్రంథాలయం అది. దాన్ని దగ్ధం చేయమని ఆయన ఆజ్ఞాపించేసరికి, మంత్రుల్లో ఒకాయన ఆశ్చర్యపడి 'కారణం తెలుసుకోవచ్చునా' అని అడిగాడు. సుల్తాను తిరుగులేని జవాబు చెప్పాడు: "ఖురానులో లేని విషయాలు ఈ పుస్తకాల్లో వుంటే, వాటిని ప్రజలు చదవడం పాపం. ఖురానులో ఉన్న విషయాలే ఈ పుస్తకాల్లో వుంటే, అవన్నీ శుద్ధ దండుగ."

మూర్ఖంగా వాదించే వారందరూ ఆ సారసెన్ రాజులాంటి వాళ్లే. వాళ్లకి ఒక వస్తువు పూర్తిగా తెలుపైనా కావాలి, పూర్తిగా నలుపైనా కావాలి. ఈ రెంటి మధ్యా ఎన్నో వింత రంగులు, రంగుల నీడలు ఉంటాయని వాళ్ళకి తోచదు. ఆ సారసెన్ రాజు వితండవాదాన్ని చూసి మనం నవ్వనక్కరలేదు. అలా వాదించేవారు ఈ రోజున మన మధ్య చాలామంది కనిపిస్తారు. సినిమాలు పూర్తిగా చెడ్డవనీ, వాటిని సామాన్య ప్రజలు చూడగూడదనీ అనేవాళ్లున్నారు. వారే నియంతలైతే మన సినిమాలన్నింటినీ నిస్సంకోచముగా తగలబెట్టేస్తారు

ప్రపంచంలో ఏదీ పూర్తిగా చెడ్డదీ, పూర్తిగా మంచిదీ అయివుండదు. ప్రకృతి, జీవితం ద్వంద్వభావ సమ్మిళితమైనవి. ప్రతిదాంట్లోనూ మంచి, చెడు కలగాపులగమై వుంటాయి. వెలుగు, దాని వెనక నీడ. ప్రతి గులాబీ పువ్వూ కంటకావృతమైనదేనని ఇంగ్లీషు సామెత. ఆధునిక విజ్ఞాన శాస్త్రములో స్వతస్సిద్ధమైన చెడుగు ఏమీ లేదు దాన్ని మనం ఉపయోగించుకునే విధంలోనే మంచి చెడుగులుంటాయి.

నోబెల్ బహుమతి అందరికీ తెలిసిందే. ఇండియాలో సర్ సి. వి. రామన్, రవీంద్రనాథ టాగూర్లకు ఈ బహుమతి వచ్చింది. ఈ బహుమతుల పద్ధతి స్థాపించింది ఒక స్కాండినేవియన్ కోటీశ్వరుడు. ప్రేలుడు మందును కనిపెట్టి యీయన కోటీశ్వరుడైనాడు. ఆ మందుతో కొండప్రదేశాల్లో బావులు త్రవ్వవచ్చును; రైల్వేల కోసం సొరంగాలు చేయవచ్చును. అందుచేత తను మానవహిత కార్యం చేస్తున్నానని ఆయన భావించాడు. కాని ఆయనభావం తారుమారైంది. ప్రేలుడు మందుతో యుద్ధకాలంలో సోదర మానవ మారణహోమం, వైద్యశాలల, పాఠశాలల విధ్వంసం చేయబడింది. అందుచేత ప్రేలుడుమందు కనిపెట్టి మహాపాపం చేశానని పశ్చాత్తాపపడ్డాడు. ప్రాయశ్చిత్తంగా తన ధనమంతా విరాళమిచ్చాడు. శాంతి, ఆరోగ్యం, సారస్వతం, మున్నగు వాటి అభివృద్ధికోసం పాటుబడేవారికి బహుమతులుగా తన ఆస్తి వెచ్చింపబడాలని ఆదేశించాడు.

ఇంతకీ నేను చెప్పొచ్చేదేమిటంటే, దేన్నైనా సద్వినియోగం చేయవచ్చు, దుర్వినియోగం చేయవచ్చు. అది మనపై ఆధారపడివుంది. సినిమాకళకూడా అంతే. రచనాకళ అభిప్రాయప్రకటనకోసం, బైబిలు మొదలైన పవిత్రగ్రంథాలను ప్రజలు చదవడంకోసం కనిపెట్టబడింది. కనుక రచన ప్రజోపయోగార్థమైనదే గాని మరే ప్రయోజనమూ కలది కాదు. ప్రజలకు వినోదం యివ్వడం దాని అసలు ప్రయోజనం కాదు. కాని ఈ రోజున ఏమి జరుగుతోంది? కొద్దిమంది ప్రజలుమాత్రమే పవిత్ర గ్రంథాలుచదువుతున్నారు. ఎక్కువమంది చవకబారు నవలలు చదువుతున్నారు. అంతమాత్రాన ముద్రణ, ప్రచురణ నిషేధించబడాలని ఎవరైనా అంటారా? అనరు. ఇలాటి సహనభావమే సినిమాలపట్లకూడా చూపాలి. పైగా పుస్తకాలవలెగాక, సినిమాలను కొందరు సమర్థులైన అధికారులు ముందే చూసి బహిరంగంగా ప్రదర్శించవచ్చునని సర్టిఫికెట్ యిస్తారు. పుస్తకాలకు ఇటువంటి సెన్సార్‌షిప్ లేదు. ఏ రకం పుస్తకమైనా నిరభ్యంతరంగా ప్రచురించవచ్చు. అందుచేత ఏ చెత్త పుస్తకాన్నైనా చదవడానికి తమ పిల్లలను, కుటుంబాలను అనుమతించే కొందరు పెద్దలు ప్రత్యేకంగా సినిమాలనే నిషేధించాలని పట్టుబట్టడంలో అర్థంలేదు.

మరొక రకం సినిమా విమర్శకుడున్నాడు. అతడు సినిమాలు చెడ్డవని అనడు. అందుచేత సినిమాలని ధ్వంసం చెయ్యాలనే వాదనకు అతడు పోడు. అతని వాదమల్లా సినిమాలు వినోదానికి మాత్రమే ఉపయోగించబడుతున్నాయని; ప్రజలను విద్యావంతులుగా చెయ్యడానికి అవి పనికి రావడంలేదని. ఇది కూడా అర్థంలేని వాదనే. ముద్రణయొక్క అసలు ప్రయోజనం ప్రజలను విద్యావంతులుగా చెయ్యడమే. కాని సినిమాకు ప్రయోజనం అది కాదు. వినోదంకొరకే సినిమాలు కనిపెట్టబడ్డాయి. ప్రజలకు విద్య కావలిస్తే, పుస్తకాలు చదువుతారు; కాలేజీల్లో ఉపన్యాసాలు వింటారు. విద్యకోసం సినిమాలకే ఎందుకు వెళ్లాలి? సినిమాలద్వారా విద్య నేర్చుకోవడం ప్రజలకిష్టంలేదని ఒక విషయం చూస్తే తేల్తుంది. భారతప్రభుత్వం చాలా విద్యా చిత్రాలు తయారుచేస్తుంది. ప్రజలకి ఇవి చూడ్డంలో గొప్ప ఆసక్తి వుందని ప్రభుత్వమునకు నమ్మకముంటే, ఆ విద్యాచిత్రాలను చూపించితీరాలని సినిమా థియేటర్లవారిని ఒత్తిడి ఎందుకు చెయ్యాలి? విధిలేక తప్పితే ఈ చిత్రాలను స్వయంగా ఎవరూ చూడగోరరని దీనివల్లనే స్పష్టమౌతుంది. ప్రభుత్వంగాని, విమర్శకులుగాని టిక్కెట్లు పూర్తిగా అమ్ముడుపోతాయనే గ్యారంటీ యిస్తే విద్యాచిత్రాలను నిర్మించడానికి ప్రతి నిర్మాతా ముందుకొస్తాడు. ఇటువంటి గ్యారంటీ యివ్వకుండా ఊరికే విమర్శించే వ్యక్తికి, నిర్మాత ఎటువంటి చిత్రం నిర్మించాలో చెప్పే హక్కు లేదు. తను ఏ చిత్రం నిర్మించాలో నిర్మాతే చూసుకుంటాడు. మధ్య విమర్శకు డెవరు?

# ఆంధ్రరాష్ట్రం - చలనచిత్రాలు

## చిత్తూరు వి. నాగయ్య

ఆంధ్రరాష్ట్రం అవతరించింది. ముక్కోటి ఆంధ్రులు వీళ్ళ తరబడి చేసిన కృషికి, చూపిన త్యాగసాహసాలకు ఇప్పుడు ఫలితం దక్కింది. ఇప్పుడిప్పుడే మన సంసారాన్ని మనం చక్కబెట్టుకుంటున్నాం. ఈ మన సంసారం మిగతావారికి మార్గదర్శిని కావాలి. భారతదేశంలోని మిగతా రాష్ట్రాలకు మనరాష్ట్రం ఆదర్శప్రాయంగా వుండాలి.

ప్రజలు ప్రభుత్వంగూడా సహకరించి పనిచేసినప్పుడే మన చిరకాలపు త్యాగం సఫలమాతుంది. అందువల్ల ఆంధ్రరాష్ట్రాన్ని ఆదర్శప్రాయంగా చేయాల్సిన బాధ్యత ప్రజలమీద రాజకీయ నాయకులమీదా వుంది. ప్రజలకు, నాయకులకు, ప్రచార సాధనాలు కొన్ని ఉండటం అవసరం. ప్రచార సాధనాల్లో ముఖ్యమైనవి చలనచిత్రాలు.

"చలనచిత్రాలు మహత్తరమైన ప్రచార సాధనా"లన్నాడు లెనిన్. రష్యా దేశంలో దీన్ని ఆచరణలో పెట్టి చూపించారు. అలాంటినాటిని ఆచరించటం మనకు శ్రేయస్సు; చిత్రాలద్వారా ప్రజలకు, విజ్ఞాన ప్రబోధం చేయవచ్చు. ప్రభుత్వం దీని విషయమై ఎంత శ్రద్ధ తీసుకుంటే అంత మంచిది.

రాజకీయంగానే కాకుండా సాంస్కృతికంగా గూడ చలనచిత్రాలను ప్రోత్సహించడం రాష్ట్రాభ్యుదయానికి ఎంతైనా అవసరం. చలనచిత్రాలు లలితకళ సమ్మిళితాలు. జాతి పురోవృద్ధికి లలితకళలు పట్టుకొమ్మలు. లలిత కళలు సర్వతోముఖంగా వికసించి, వెల్లివిరిసినప్పుడే స్వర్ణయుగం! మన ప్రజలూ ప్రభుత్వమూ గూడా ఇది గుర్తించాలి.

మన దేశంలో అనేకులు మహా విద్వాంసులున్నారు, కవులున్నారు, గాయకులున్నారు, నటులున్నారు, నాట్యకారులున్నారు. - విమర్శకులున్నారు. ప్రభుత్వంలో కూడా లలితకళాభిమానులు ఎందరో ఉన్నారు. వారంతా సహకరించి చలనచిత్ర పరిశ్రమకు ఇతోధికంగా పాటు బడవలసిన అగత్యం ఎంతైనా ఉంది.

ఉమ్మడి రాష్ట్రంగా ఉన్నప్పుడు శ్రీ గోపాల రెడ్డిగారు ఆంధ్ర నాటక రంగాన్ని తీర్చి దిద్దటానికని ఒక కమిటీని ఏర్పాటుచేశారు. ఆ కమిటీరిపోర్టు ఏమైందో మళ్ళీ తెలియలేదు. ఇప్పుడు ప్రత్యేకాంధ్ర రాష్ట్రంవచ్చింది. ఒకరిఅడ్డంకులు లేకుండా మనిల్లును మనం చక్క బెట్టుకోవచ్చు. డిప్యుటీ స్పీకర్ శ్రీ, పసల సూర్యచంద్రరావుగారి లాంటి విజ్ఞులున్నారు. అలాంటివారి సహకారంతో లలితకళలు పెంపొందాలి. ప్రభుత్వంలో ప్రత్యేకంగా లలితకళల కొకశాఖ నేర్పరచాలి. దానికి ప్రత్యేకంగా ఒక మంత్రిని నియమించాలి. ప్రభుత్వ పరిపాలనలో లలితకళలకుగూడ స్థానం ఉండాలి.

ఈనాటి ప్రజలు నిత్యావసరాల జాబితాలో కాఫీ, సినిమాగూడ చేరినై. వేలంవెర్రిగా జనం సినిమాలకు వస్తున్నారు. సినిమాలనుచూసి అందులోని భావలన్నీ తమ, తమ నిత్య జీవితాల్లో అనుకరిస్తున్నారు గూడా. అప్పుంగూడా మానేసి, సినిమాలకు వెళ్లేవాళ్లెంతోమంది ఉన్నారు. సినిమాలు ప్రజలపైన ఇంత తీవ్రంగా పనిజేస్తున్నై. ఇలాంటి పరిశ్రమను సవ్యంగా గనక ఉపయోగించుకుంటే, మనం ఆర్థికంగానూ, నైతికంగానూ కూడా ముందడుగు వేయగలమనటంలో సందేహం లేదు.

క్రొత్తగా ఏర్పడ్డ మన ప్రభుత్వం దీన్ని గుర్తించి వంటనే రంగంలోకి దిగాలి. ప్రజలకు విజ్ఞానయుతమైన చిత్రాల్ని అందించే ఏర్పాట్లు చెయ్యాలి. ప్రజా బాహుళ్యంలో ఉన్న లలితకళోపాసకుల్ని, ఆసక్తుల్ని ప్రోత్సహించాలి.

ఇంకా అభిరుచి ఉన్నవారికి సాంకేతిక శాఖల్లో మంచి తర్ఫీదు ఇప్పించితే నిరుద్యోగసమస్య గూడ చాలవరకు రూపుమాసిపోతుంది. ఇవన్నీ చెప్పగలిగినవాళ్లే గాని, ఆర్థికస్తోమతు ఏ నేను చేసి చూపించలేను. ఏ ఒక్క వ్యక్తి పూనుకున్నా ఇది జరిగేది కాదు. అందువల్ల మన ప్రభుత్వాన్ని సవినయంగా అర్థిస్తున్నా; ప్రభుత్వ శాఖల్లో లలితకళలకుగూడ ఒక శాఖ నిర్మించాలని.

అలా జరిగిన రోజున మన రాష్ట్రం మిగతా రాష్ట్రాలకు ఆదర్శప్రాయమాతుందనటంలో సందేహమేమైనా వుందా? ఆ శుభదిన మెప్పటికో! ★

## ★ సినిమాకళ వినోదసాధనం ★

ఇంకోరకం విమర్శకు డున్నాడు. "సరే. సినిమా ప్రయోజనం వినోదమే గాని విజ్ఞానం కాదని ఒప్పుకుంటాను. వినోదంలో కూడా ఒక పద్ధతి, ఒకస్థాయి ఉండాలా, వద్దా? మీ చిత్రాల్లో అనవసరమైన సంగీతం ఎందుకు పెడతారు? సంగీతం లేకుండా షేక్స్పియరు మంచి నాటకాలు వ్రాయలేదా? మీ చిత్రాల్లో సంగీతమే కాదు; వీలూ చాలూ లేకుండానే నాట్యాలు సర్కసులు, కత్తియుద్ధాలు, కుస్తీలు అన్నీ వుంటాయి! ఈ అనవసరమైన అంశాలతో కథలోని అందం, బింపో చెడిపోవడం లేదా?"

ఈ విమర్శకు సమాధానం, ఇది: ఏ సినిమా నిర్మాతా "ఇదుగో నేను అద్భుతమైన, అద్వితీయమైనకథ తయారుచేశాను. ఇందులో బ్రహ్మాండమైన ప్లాటు వుంది," అని ఎప్పుడూ చెప్పడు. గొప్పకథను సృష్టిద్దామనేదే నిర్మాత ప్రధాన ప్రయోజనమయినట్లయితే పై విమర్శకు అర్థం వుంది. నిర్మాత లక్ష్యం ఇది: తన చిత్రం లక్షలాది ప్రజలు ధనవ్యయం ఆలోచించకుండా వచ్చిచూసేటంత వినోదదాయకంగా. ఆసక్తియుతంగా ఉండాలి. అదే అతడు కోరేది, ఎందుకంటే కొన్ని లక్షలమంది వచ్చి చూస్తేనే అతడు వ్యాపార రంగంలో నిలవ గలుగుతాడు. ఈ లక్షలాది జనులు పట్నవాసులు కారు. పట్టణాల్లో వుండేవారైతే నాటకం, సర్కసు, కుస్తీప్రదర్శన, నాట్యప్రదర్శన ఏదో వొకటి చూస్తారు. కాని కుగ్రామాల్లో దూరదూరంగా వుండే వారికి ఏడాదికొకసారి దేవుడి వుత్సవాల్లో బాణాసంచాలు తప్ప మరే వినోదమూ తగలదు.

సుందరాంబాళ్, సుబ్బలక్ష్మిగార్ల సంగీతం, లలిత, పద్మిని, వైజయంతీమాల గార్ల నాట్యం గ్రామస్థులకు గడపదాకా వచ్చి అందించేవి సినిమాలే. ఆట్టే శ్రమపడకుండా ప్రతి గ్రామస్థుడూ సినిమా తారల్ని తనివితీర చూడవచ్చు. ఆ మాటకొస్తే వినోదంకోసం క్రికెట్ ఆడే పండిట్ నెహ్రూను కూడా చూసి వినోదించవచ్చు. అంటే ఏమిటన్నమాట? కొన్ని అణాలు ఖర్చుపెడితే (ఇందులో కొంత వినోదం పన్నుకు పోతుందనుకోండి!) జీవితంలో ఎప్పుడూ చూడ్డానికి వీలుపడనివన్నీ చూడవచ్చు నన్నమాట—ముఖ్యంగా ఇప్పటి అణా ఇదివరకటి కానీ విలువగల యీ రోజుల్లో దీన్ని సుసాధ్యం చేసేవి సినిమాలే. ★

# చమ్రియా టాకీ డిస్ట్రిబ్యూటర్సు

## సంక్రాంతి అభినందనలతో సంతోషపూర్వకముగా ప్రకటించు '1954' నూతన తెలుగు చిత్రములు

విజయవంతముగా నడుచుచున్నది "పక్కయింటి అమ్మాయి"

జెమినీవారి
**"రాజీ - నా ప్రాణం"**
శ్రీరంజని (జూనియర్) ★ రంగారావు ★ శ్రీరామ్

ప్రతిభావారి
**"రేచుక్క"**
యన్. టి. రామారావు
అంజలి ★ ముక్కామల

ఆనందావారి
**"మేలుకొలుపు"**
జి. వరలక్ష్మి ★ శ్రీరామ్
సి. యస్. ఆర్. ★ జమున

నాగూర్ సినీవారి
**"సందేశం"**
యం. వి. రాజమ్మ ★ సి. యస్. ఆర్.
శివరావు ★ జమున ★ యన్. టి. రామారావు

గోకుల్ పిక్చర్సువారి
**"నిరుపేదలు"**
నాగేశ్వరరావు ★ జమున
సురభి బాలసరస్వతి

పక్షిరాజావారి
**"మరకతం"**
తారాగణముతో......

బి. ఏ. యస్. ప్రొడక్షన్సువారి
**"రాజు - పేద"**
యన్. టి. రామారావు ★ రేలంగి
రంగారావు ★ లక్ష్మీరాజ్యం ★ సుధాకర్

శోభనాచలవారి
**ప్రొడక్షను నం: ౪**
అంబుజం ★ రేలంగి ★ డా. శివరామకృష్ణయ్య
లక్ష్మీరాజ్యం (జూనియర్)

ప్రకాశవారి బాలానందం పిల్లల వినోదచిత్రములు
**బూర్లెమూకుడు · కొంటెకిష్టయ్య · రాజయోగం**

DISTRIBUTORS FOR ANDHRA, CEDED & NIZAMS
**CHAMRIA TALKIE DISTRIBUTORS**
VIZIAWADA · GUNTAKAL · SECUNDERABAD

# సంక్రాంతి ఏ తేదీ? ★ 'డాక్టర్'

సంక్రాంతి తెలుగువారికి పెద్దపండగ. సంవత్సరాది, వినాయకచవితి, దసరా, దీపావళి, పండగలకంటె సంక్రాంతి పెద్ద పండగ. కొత్త అల్లుళ్లనూ కూతుళ్ళనూ యిళ్ళకు రప్పించి, కొత్త బట్టలు కట్టుకుని కొత్తపంటలు తెచ్చుకున్న నూతనోత్సాహముతో మనము ఆనందించడమే కాక, ధాన్యము నిండుకు తెచ్చిన బళ్ళను అలంకరించి, చక్రాలకి చుక్కలు పెట్టి, పశువులకు పసుపు పారాణులు పూసి 'పశువులకు (కూడ) పండుగ' చేయడము సంక్రాంతి రోజులలోనే గాని సంవత్సరములో మరొక సమయములో లేదు.

సంక్రాంతి పంటల పండుగ కనక భూమిని దున్నిన దగ్గిర్నుంచి, దుక్కికీ, విత్తనాల మోతకీ, కోతల తర్వాత కుప్పనూర్పులకీ, ధాన్యాల గడ్డిమోపుల మోతకీ పయోగించిన పశువులకు ప్రత్యేక అలంరము చేయడము వచ్చింది. బళ్ళకి స్తాబుచేసి చక్రాలకి చుక్కలు పెట్టు ఆయుధ'పూజ' కాదు. సిరిసంపదలకు రణమైన అందపు వాహానానికి అలంకాకు చేయడము భక్తికాదు. గృహస్థుల సావంచేది, ఉత్సాహము.

సంక్రాంతికి ముందురోజుని 'భోగి' అని పేరు పెట్టుకుని తల అంటుకోడమూ, చలి మంటలు కాగడమూ, చిన్నపిల్లలకి భోగి పళ్ళు పొయ్యడమూ చేస్తారు. అసలు సంక్రాంతి సందడి నెలరోజులకు ముందుగానే 'నెలగంటు' పెట్టడముతో ప్రారంభిస్తుంది. ఆడపిల్లలు వాకిళ్లను చాలా మేరకు ఊడ్చి శుభ్రముచేసి ముగ్గులు పెట్టుతారు. ఆ ముగ్గులమధ్య గొబ్బిళ్ళుపెట్టి, "తామర పువ్వువంటి తమ్ముణ్ణియ్యవే, చామంతి పువ్వంటి చెల్లెల్నియ్యవే, మొగలీ పువ్వువంటి మొగుణ్ణియ్యవే" అని పాటలు పాడతారు. గొబ్బి పదములు పాల్కురికి సోమనారాధ్యుడు (క్రీ. శ. 1300) పేర్కొన్నాడు. కాటమరాజు కథలో 'గొబ్బి' ఉన్నది. గొబ్బిళ్ళు ఆవుపేడతో మాత్రమే పెట్టుతారు. అయితే కాటమరాజుకథలోని 'గొబ్బి'యే దేశమంతటా పాటలలో వ్యాపించడానికి యెఱ్ఱగడ్డపాటి యుద్ధానికీ పాల్కురికి సోమనారాధ్యుడికీ మధ్యనున్న కాలము చాలదేమోనంటాను. కనక 'గొబ్బి' పాటలలోని 'గొబ్బి' వేరు' అనిపిస్తోంది. కాటమరాజుకథలోనైనా 'గొబ్బి' ఏమంత పర్యాంతర్యామిగా లేదు. గోపికలు కాత్యాయనివ్రతము చేశారని భాగవతమంటున్నది. ఈ వ్రతముగాని గొబ్బి నృత్యమును పట్టుకుని తెలుగుదేశములో ఉన్నదా అని కొందరు భావిస్తున్నారు. అయితే గోపికలు బాలికలు కారు. గొబ్బి నృత్యములో బాలికలదే సర్వమూను. కాని కన్య లదిమట్టు కాను. గోపికల కాలమునాటికి ప్రౌఢావివాహాలే ఉండేవి కనక, 'గోపికల వ్రతనృత్యము గొబ్బి నృత్యమై యుంటుందన్న తిమ్మావఝ్ఝుల వారి వాదము సమంజసమే నేమో. తెలుగులో 'గోపెమ్మ' అనే పేరు 'గొబ్బెమ్మ' కాకుండా గోపెమ్మ అనే దసరా పద్యాలలోకూడా నిల్చిఉంది. కాగా గొబ్బి తీరని సమస్య అయిపోతోంది.

'గొబ్బిళ్లో' అనే చివరిమాటతో పాటలు పాల్కురికి సోమనారాధ్యుడూ, అన్నమాచార్యులూ పేర్కొన్నారు. నేడు రామాయణ గొబ్బిపాట, దశావతార గొబ్బిపాట వినపడుతున్నాయి. గొబ్బిపాట ఒక వరస అయిపోయింది తెలుగులో.

సంక్రాంతి మూడురోజులూ కాగానే పడుచులు బొమ్మలనోము ప్రారంభిస్తారు. ఈ బొమ్మలు పతులతో సహగమనము చేసిన సతులబొమ్మలు. నవోఢలకు ఆదర్శ వ్రతమిది. వినోదాలతో పాటుచేరి ఈవ్రతము ఆదర్శాన్ని ఆకళించుకోడానికి డాకూ దారిచేస్తుంది.

పండుగ ముందురోజు భోగి. అట్లతద్దికీ ఉండ్రాళ్లతద్దికీ ముందురోజుకూడా భోగి అనే అంటారు. ఈనాడంతా పెద్దపండుగకి తయారీ. తలంట్లూ ఇత్యాదితో భోగిపిడకలతో చేసే మంట చలికి స్వస్తిచెప్పన్నామనే స్ఫురణతో వేసే మంటయేమో. సంక్రాంతితో సూర్యుడు ఉత్తరాయణ ప్రారంభము చేస్తాడు.

సంక్రాంతి అంటే 'సమావేశము' అని అర్థము చెప్పకోవచ్చును. సూర్యచంద్రులు తిరిగే నక్షత్రపథములో ఇరవైయేడు నక్షత్రాల్ని పేర్లు పెట్టి గుర్తుపెట్టుకున్నారు మనవారు. సూర్యుడు ఆకాశపథంలో ఒక నక్షత్రమును విడిచినట్లు కనబడి, మళ్ళీ ఆ నక్షత్రము దగ్గిరకి రావడానికి పట్టే సంవత్సరకాలాన్ని అమావాస్యనించి అమావాస్యకి గల కాలముతో పోల్చి చూసుకోడానికి పన్నెండు నెలలుగా భాగించుకున్నారు. నక్షత్రపథాన్ని కూడా పన్నెండు 'రాసులు'గా భాగించుకున్నారు. సూర్యుడు ఒకొక్క రాశిలో ఒక నెల ఉన్నట్లవుతుందిగదా? ప్రతీ నెలా సూర్యుడు ఏదో రాశిలో ప్రవేశిస్తూంటాడు. ఇదే సంక్రాంతి. మనము సంక్రాంతి అని పేరుపెట్టిన పండగనాడు సూర్యుడు మకరరాశిలో ప్రవేశిస్తాడని ఈ సంక్రాంతికి 'మకర సంక్రాంతి' అనిపేరు పెట్టారు. ఈనాటినుంచి ఉత్తరాయణము ప్రారంభము. అయితే వాస్తవానికి ఆకాశంలో ఉత్తరాయణ ప్రారంభము డిశంబరు 23 వ తేదీనాడు జరిగితే మనవారి నమ్మకాలలో జనవరి 15 వ తేదీని జరుగుతున్నది.

అయితే క్రీ.శ. 400 నాటికి సంక్రాంతి డిశంబరు 23 వ తేదీనాడే అయింది. ఏడాదికి సుమారు ఇరవై నిమిషాల చొప్పున జరిగిపోయి, 1550 సంవత్సరాలు దాటిపోయిన నేటికి 21 రోజులు జరిగి కనపడుతోంది. ఇది మనవారు పంచాంగంలో చేయవలసిన దిద్దుబాటు.

సూర్యుడు మకరరేఖనుంచి కర్కాటరేఖవైపు మళ్లడమంటే మనకీ, అరేబియా, సిరియా, బాబిలోను, రోము గ్రీసు దేశముల వారి కందరికీ దినప్రమాణము హెచ్చడమూ, ఎముకల్ని కొరికే చలి ఆఖరవడమూ అన్న మాట. కనక ఈ దేశాలవారందరూ మకర సంక్రాంతిని ఈ కారణమువల్ల ఉత్సవ దినముగా గణిస్తారు. దీని నిజము క్రిస్మస్ పండుగ తేదీని గమనిస్తే బోధపడుతుంది. జీసస్ గొప్పతనము ఆయన నిష్క్రమించిన రెండుమూడు వందల సంవత్సరాలకి గాని బాగా తెలిసిరాలేదు అందరికీ. ఆరీతిగా ఎంతోమంది క్రైస్తవులైన తర్వాత వారికి జీసస్ జన్మదినాన్ని పండుగ చేసుకోవాలని అభిలాష కలిగింది. కాన్‌స్టాంటినోపిల్ నగరపు బిషప్పును భక్తులంతా అడిగేరు. ఆయన గడుసువాడు. ఎవరూ గుర్తుపెట్టుకోనిది ఆయనమాత్రము ఎలాగు చెప్పగలడు? ఆనాటికి మకర సంక్రాంతి డిశంబరు 25 నాడు జరిగేను కాబోలు, ఆరోజే క్రీస్తుజన్మదినమన్నాడు. నాటికీ నేటికీ ఆరోజే నిలిచిపోయింది.

సంక్రాంతిని మనవారు పితృదినముగా కూడ పరిగణిస్తారు. గ్రహణాలూ, పుష్కరాలూ, - ఆకాశములోని గోళముల చలనాలకు సంబంధించిన వాటిని - పితృదినాలుగా పరిగణించే ఆచారమే సూర్యుడు మకరరేఖనుంచి మళ్లడమూ, కర్కాటకరేఖనుంచి మళ్లడమూ జరిగేనాటికీ ఆవరించింది. ఇందులో వింత యేమీ లేదు. 

